# విషయ సూచిక

|| శ్రీహరిః ||

## నివేదనము

నవజలధరవర్ణం చంపకోద్భాసికర్ణం
వికసితనళినాస్యం విస్ఫురన్మందహాస్యమ్
కనకరుచిదుకూలం చారుబర్హావచూలం
కమపి నిఖిలసారం నౌమి గోపీకుమారమ్. 1

ముఖజితశరదిందుః కేళిలావణ్యసింధుః
కరవినిహతకందుర్వల్లవీ ప్రాణబంధుః
వపురుపస్మృతరేణుః కక్షనిక్షిప్తవేణుః
వచనవశగధేనుః పాతు మాం నందసూనుః. 2

త్వాం చ వృందావనాధీశ త్వాం చ వృందావనేశ్వరి
కాకుభిర్వందమానోఽయం మందః ప్రార్థయతే జనః. 3

యోగ్యతా మే న కాచిద్వాం కృపాలాభాయ యద్యపి
మహాకృపాళు మౌళిత్వాత్తథాపి కురుతం కృపామ్. 4

అయోగ్యే సాపరాధేఽపి దృశ్యంతే కృపయాకులాః
మహాకృపాలవో హంత లోకే లోకేశవందితా. 5

భక్తేర్వాం కరుణాహేతోర్లేశాభాసోఽపి నాస్తి మే
మహాలీలేశ్వరతయా తథాప్యత్ర ప్రసీదతమ్. 6

యదక్షమ్యం ను యువయో స్స్వకృద్భక్తిలవాదపి
తదాగః క్వాపి నాస్త్యేవ కృత్వాశాం ప్రార్థయే తతః. 7

ఏష పాపీ రుదన్నుచ్చైరాదాయ రదనైస్తృణమ్
హా నాథౌ నాథతి ప్రాణీ సీదత్యత్ర ప్రసీదతమ్. 8

హాహారావమసౌ కుర్వన్ దుర్భగో ఖిద్యతే జనః
ఏతాం మే శృణుతం కాకుం కాకుం శృణుత మీశ్వరౌ. 9

కిరతం కరుణస్వాంతా కరుణోర్మిచ్ఛటామపి. 10
మధురా స్సంతి యావంతో భావాస్సర్వత్ర చేతసః
తేభ్యోఽపి ప్రేమ మధురం ప్రసాదీకురుతం నిజమ్. 11
నాథితం పరమేవేదమనాథజనవత్సలౌ
స్వం సాక్షాద్దాస్యమేవాస్మిన్ ప్రసాదీకురుతం జనే. 12
అంజలిం మూర్ధ్ని విన్యస్య దీనోఽయం భిక్షతే జనః
అస్య సిద్ధి రభీష్టస్య సకృదప్యుపపాద్యతామ్. 13

(స్తవపుష్పాంజలి)

క్రీ.శ. 1916 లో ప్రప్రథమముగా నేను బెంగాలీలో అచ్చు వేయబడిన 'నారదభక్తిసూత్రాలు' అన్న పుస్తకమును చూచుట సంభవమైనది. ఆ కాలములో నేను ఏకాంతవాసములో ఉన్నాను. నాకు ఆనాడు భగవానుని కృప వలన మనస్సు ఒకింత పరమార్థసాధనము దెసకు మరలుచుండెను. ఆ దశలో ఉన్న నాకు ఆ భక్తి సూత్రముల వలన విశేష ప్రోత్సాహము లభించెను. అప్పుడే ఆ సూత్రములను పరిశీలనము చేయుచు చేయుచునుండగా నాకు వానిపై భావార్థ వివరణము వ్రాయవలె నన్న సంకల్పము గలిగెను. కొంతకాలమైన పిదప భావార్థము వ్రాయుటయు పూర్తియయ్యెను. అప్పుడు వ్రాసిన యీ విషయమును అచ్చువేయవలె నన్న సంకల్పమును నాకు కలుగలేదు. అందులకు ఆనాడు సౌకర్యమును లేదు. ఇంచుమించు క్రీ.శ. 1920 ప్రాంతమున నేను ముంబయిలో నుంటిని. అక్కడ ఒకనాడు శ్రీవెంకటేశ్వర ముద్రణాలయమునకు అధిపతియైన స్వ. సేఠ్ ఖేమరాజ్‌గారి తోడ మాటలాడు సందర్భమందు ప్రసంగవశమున ఈ భక్తి సూత్రాల చర్చ జరిగినది. ఆయన నాకడ నుండి వ్రాతప్రతిని గ్రహించి ముద్రించుటకై ముద్రణాలయములో చేర్చెను. కాని యలక్ష్యభావము కారణముగా అది యముద్రితముగా అచ్చటనే ఉండిపోయెను. దాని విషయమున నాకు అంతగా పట్టుదలయు లేకపోయెను. ఈ కారణమున నేను వారికి ఎట్టి

ఆదేశమును ఇచ్చి యుండలేదు. అంతలో సేఠ్ ఖేమరాజ్‌గారు స్వర్గస్థులైరి. అనంతరము కొన్ని ఏండ్లు గడచిన పిమ్మట నేను ఆ వ్రాతప్రతిని అచ్చుట నుండి వెనుకకు తీసికొంటిని. అచ్చువేయించు సంకల్పము గలుగలేదు. భక్తి శాస్త్రముపై టీక వ్రాయుటకు నేను ఎంతటివాడను అన్న సంకోచము నన్ను వెనుకకు అడుగుపెట్టించుచుండెను. కాని కాలక్రమమున నాలోని యా సంకోచము తగ్గి కడకు ముద్రించవలెనని నిశ్చయించితిని. నేను మరియొక్కమారు ఆ వ్రాతప్రతిని చదివితిని. చాలాచోట్ల ఆవశ్యకములైన చేర్పులు, మార్పులు గావింపవలయు అవసరము గోచరించెను. ఆ కారణమున ముద్రణకార్యము నిలిచిపోయెను. ఈ మారు భగవత్ప్రేరణ వశమున చక్కగా దాని పునఃపరిశీలనమయ్యెను. కొన్ని మార్పులు, చేర్పులు చేసిన పిమ్మట వరుసగా ఆ సూత్రములు 'కళ్యాణ్' హిందీ మాసపత్రికలో ముద్రింపబడెను. పరివర్తితము, విపులీకరించబడిన దాని స్వరూపము ఈ పుస్తకములో నున్నది.

1916లో నేను ఈ భావార్థము వ్రాయుచున్నప్పటికి హిందీలో ఈ సూత్రములపై ఒకటి రెండు టీకలు వ్రాయబడియుండును. ఇప్పుడైననో చాలటీకలు వెలువడినవి. అయినను నా యీ భావార్థవివరణమును అచ్చువేయించుటకు రెండే ప్రధానకారణములు కావచ్చును. నాలో గుప్తముగా పని చేయుచున్న పేరుప్రతిష్ఠల కాంక్ష అందు మొదటిది. ఈ భక్తిశాస్త్ర పరిశీలనము వలన నాకు శ్రేయస్సు కలుగగలదన్న యాశ రెండవది. నిజ మరయుగా భక్తి చర్చ ఎంతచేసిన అంతయు శ్రేయోదాయకమే యగును. కారణము ఏమైనా భగవత్ప్రేమ ప్రాప్తికి భక్తియే సర్వప్రధాన సాధనము. సాధ్యరూపమందు అదియే భగవత్ప్రేమ. భక్తులు, విద్వద్వరులైన పాఠకులును ఈ విధముగా భావించి నేను పూనిన యీ కార్యము దోషయుతము కానిది అని యెంచి నన్ను క్షమింతురనియు, నా తప్పులను కూడ మన్నింతురనియు నేనాశించుచున్నాను. ప్రేమ విషయమున భాషకంటె భావమునకే విశేష ప్రాముఖ్యముండును. ఈ

భక్తిశాస్త్రము విషయమున వ్యాఖ్యయే కొంచెము వ్రాయుటకైనను నాకు అధికారము లేదనుట నిజము. అయినను ఈ వివరణయందు నా ప్రయత్నమును విజ్ఞులైన మహానుభావులు భగవత్ప్రేరణగాను, భగవత్కృపగాను దలచి నా యెడల ప్రసన్నత వహింపగలరని నేను ఆశించుచున్నాను. కారణమేమన్న భగవత్కృప లేనిదే మానవునకు ఉత్తమకార్యములు చేయుటయందు ప్రవృత్తి కలుగదు. భక్తిశాస్త్ర పరిశీలనము ఉత్తమోత్తమమైనదనుట నిర్వివాదాంశము. ఇందు భగవానుని దివ్యగుణములు, తదీయమగు అలౌకిక ప్రేమ, భగవద్భక్తి, భగవత్ప్రేమ ప్రాప్తికి సంబంధించిన సాధనములు, కడకు భగవానుని పవిత్రనామములు చర్చింపబడును. ఈ కారణమున ఈ గ్రంథపరిశీలనము వలన అవశ్యము రసరహితము, భక్తిశూన్యమునైన నా హృదయములో నొకింత రసము, భక్తి ప్రస్ఫుతమైయుండును. భగవానుని పవిత్రనామములు చర్చింపబడును. భగవానుని పవిత్రనామగుణాదుల స్మరణము, కీర్తనము వలన మానవుని కలుషిత హృదయము కూడ క్రమముగా పవిత్రతను సంతరించుకొని శిశుహృదయమువలె బహుసరళమైనది కాగలదని యొక మహాత్ముడు చెప్పుచున్నప్పుడు అతని మాటలను కాదని త్రోసిపుచ్చుటకు వీలులేదు. భగవన్నామగుణకీర్తన మన్నది మనోగతములైన సమస్తమాలిన్యములను కడిగివేయును. ప్రేమావేశము కారణముగా శుద్ధము, శాంతిమయమునైన భావములు ఉదయించి మానవుని జన్మమును, జీవితమును ధన్యము, సఫలము గావించును.

మహాపాతకయుక్తోఽపి ధ్యాయన్నిమిషమచ్యుతమ్
పునస్తపస్వీ భవతి పంక్తిపావనపావనః

మహాపాతకుడైన మానవుడు కూడ ఒక నిమేషకాలమైనను భగవద్ధ్యానము చేసినచో మరల పవిత్రతను సంతరించుకొని తపస్వియై పంక్తిని పావనమొనర్చువారిని సైతము పావనులను గావించువాడగును.

మరియొక విషయము. ఈ గ్రంథమందు వ్యాఖ్యరూపములో నేను వ్రాసినదెల్ల సాధుపురుషుల యెంగిలి ప్రసాదవే. కాని యిందు ఇది నాదియని చెప్పదగినది ఏదియును లేదు. కావున పాఠకులు నా వంకకు చూడక సూత్రకారుని మీదను, సూత్రముల మీదను, వ్యాఖ్యరూపములో వ్రాయబడిన శాస్త్రముల మీదను, సాధుజనుల భావముల మీదను దృష్టి నిలుపదగునని సవినయముగా వారికి మనవి చేయుచున్నాను.

షడ్దర్శనములవలె భక్తిసూత్రములు కూడ ఒక దర్శనము అని తత్త్వజ్ఞులు భావించిరి. వారు ఈ గ్రంథమును (ఈ సూత్రములను) సప్తమదర్శనముగా పేర్కొనినారు. నిజమునకు జ్ఞాన విజ్ఞాన సంపన్నులైన పురుషులే భగవత్ప్రేమకు ప్రకృతాధికారులు అగుదురు. దేవర్షి నారదుడు ఎనుబదినాలుగు సూత్రములలోనే భక్తితత్త్వమును చక్కగా ప్రకటించెను. ఇందు భగవానుని సగుణ సాకారదివ్యస్వరూపమునకు సంబంధించిన భక్తియే వర్ణితమైనది. అయినను జ్ఞానముతో భక్తికి ఏ సంబంధమును లేదని మాత్రము ఎన్నడును భావింపరాదు. అదియునుగాక దేవర్షి నారదుడు వ్రజగోపికలను ఉదాహరణముగా పేర్కొని వారియందు భగవన్మాహాత్మ్య పరిజ్ఞానము ఉన్నదని సిద్ధాంతము చేసెను. భగవత్సంబంధమగు జ్ఞానమే లేనినాడు ప్రేమను ఎవరియందు చూపవలయును? అభిన్నము, అఖండము, అనన్యము, వికారరహితమునగు ప్రేమ ఉదయించిన మీదటనే హృద్గతమైన వాస్తవతత్త్వము అనగా ప్రియతముని మనోగతభావము తెలియవచ్చును. కావుననే భక్తికి, జ్ఞానమునకు నడుమ వైరుద్ధ్యము ఏదియు లేదని తలపవలసియున్నది. అట్లే యిందు కర్మవైరుద్ధ్యము కూడ లేదని తలపవలయును. భగవాను నుద్దేశించి నిష్కామకర్మ చేయవలెనన్న యాదేశమే యీయబడినది. సర్వవిధముల కర్మపరిత్యాగము గావించిన భక్తుడు కూడ భగవత్ప్రేమసాగరమున మునిగి భగవచ్చింతనా రూపమైన కర్మను విడిచిపెట్టలేడు. కాబట్టి దేవర్షిప్రోక్తమైన భక్తియందు జ్ఞానమును

ఉన్నది. కర్మయు నున్నది. అవి తప్పనిసరిగా భక్తికి అనుకూలమైనవి గావలయును. శుష్కజ్ఞానమునకు, కర్మకు ఇందు తావులేదు. ఇందు వెలుపల క్రింద, లోపల అంతట రసమే నిండియున్నది. ఆ రసమందే పరమానంద మున్నది. శ్రుతి కూడా ఈ మాటనే చెప్పుచున్నది.-

"రసో వై సః, రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి."

భక్తివలననే యీ రసమయస్వరూపుడైన భగవానుని దర్శనము లభించును. భక్తివలననే ఋషి ముని దేవదుర్లభమైన యీ పరమానందము నందుకొనశక్యమగును. కాబట్టి యెల్లవారును భక్తిపథమునే యాశ్రయింపవలెను. శ్రీమద్భాగవతములో నిట్లు చెప్పబడినది. -

"సూర్యభగవానుడు దినదినము ఉదయించుచు అస్తమించుచు నుండును. ఈ యుదయాస్తమయములందు మానవుల యాయువు ఊరక చెల్లిపోవుచున్నది. అందు భగవంతుని గురించిన ఆలోచనకై వినియుక్తమైన సమయమెంతయో అదియే సఫలమగుచున్నది. లోకములో జీవించియుండుటయు, అన్నపానములు గ్రహించుచుండుటయు గొప్ప విషయము ఏమియును గాదు. మానవుల వలె వృక్షలతాగుల్మాదులు జీవించుటలేదా? కమ్మరివాని చెంతనుండు తోలుతిత్తి మానవులవలె శ్వాసగ్రహణము చేయుటలేదా? గ్రామాలలోనుండు పశువులు, కుక్కలు, పందులు మున్నగు ప్రాణులు ఆహారపానీయములు గ్రహించుట లేదా? మలమూత్ర విసర్జనము చేయుటలేదా? కుక్కలు ఇల్లిల్లు తిరిగి లాఠీ (కఱ్ఱ) దెబ్బలు తినుచుండును. పందులు అశుద్ధవస్తు గ్రహణము చేయుచు అందర చేతను పరిహరింపబడును. ఒంటెలు కంటకభక్షణము గావించును. గాడిదలు కేవలము బరువులు మోయుటకే ఉపయుక్తములు అగుచుండును. ఈ విధముగనే భగవద్భక్తి రహితుడైన మనుజుడు కుక్కవలె ఎల్లయెడల తిరస్కారమును పొందుచుండును. పందివలె అసారవస్తు గ్రహణము చేయుచుండును. ఒంటెవలె దుఃఖభరితములైన విషయరూప

కంటకములను తిని తిని (అనుభవించి) సర్వదా దుఃఖానుభవమును పొందుచున్నాడు. గాడిదవలె సంసారభారమును మోయుచు రోదించు చున్నాడు. విషయాభిలాష అనెడు సర్పములకు మాత్రమే ప్రవేశముండి, శ్రీకృష్ణభగవానుని లీలాచరిత్రములకు అవంతయు ప్రవేశముండని మానవకర్ణములను పాములపుట్టలు అనవలయును. భగవద్గుణ గానము చేయని నాలుకను కప్ప నాలుక యనవలయును. శ్రీహరి సమక్షమున మోకరిల్లబోవని మానవుని శిరస్సు సుందరములైన శిరోజములు, నితర శృంగార లక్షణములును కలిగియున్నను కేవలము మొండెమునకొక బరువు మాత్రమే యగును. సువర్ణవలయ విభూషితములై శోభిల్లుచున్నను ఏ చేతులు శ్రీహరిని సేవింపవో అవి శవహస్తములని చెప్పబడదగినవి. భగవానుని దివ్యమంగళమూర్తిని దర్శింపనేరని కన్నులు నెమలి పింఛము నందు గోచరించు కన్నులవంటివి. భగవానుని దివ్యస్థలములను (ఆలయ ములు, తీర్థములు) బోవనేరని చరణములు కదలికలేని తరువులవలె వ్యర్థములని భావింపదగును. భగవానుని చరణధూళిని శిరముపై నిడుకొననివాడు, తచ్చరణయుగళముపై నర్పింపబడిన తులసీదళము యొక్క గంధము నాఘ్రాణింపగోరనివాడునగు మానవుడు సజీవుడైనను మృతప్రాయు డనియే యెన్నదగినవాడు. శ్రీహరి నామముల నాలకించి యుప్పొంగకయు, గద్గదిక వహింపకయు, రోమాంచానుభూతిని పొందకయు, కన్నుల నానందాశ్రువులను వెడలింపకయు నుండు హృదయము వజ్రకఠోరమైనదని యెన్నదగును.

సీ. కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే
పవనగుంభిత చర్మభస్త్రి గాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడి ఢక్క గాక
హరిపూజనము లేని హస్తంబు హస్తమే
తరుశాఖనిర్మితదర్వి గాక

కమలేశుఁ జూడని కన్నులు కన్నులే
తనుకుడ్యజాలరంధ్రములు గాక

ఆ. చక్రిచింత లేని జన్మంబు జన్మమే
తరళ సలిలబుద్బుదంబు గాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే
పాదయుగముతోడి పశువు గాక. (బమ్మెర పోతన)

భూమండలము నందలి సమస్త భగవత్ప్రేమిభక్తబృందములారా! కడపట మీ అందరి చరణారవిందముల మీదను శిరమువంచి నమస్కరించుచు సవినయముగా మిమ్ము వేడుకొనుచున్నాను. మహానుభావులారా! మీరెల్లరును సర్వదా నా మనస్సు అనుభ్రమరము భగవానుని దివ్యశ్రీ చరణారవిందయుగళముపై విహరించుచుండునట్లు నాకు ఆశీర్వచనము ననుగ్రహింపుడు! ఏలయన భగవచ్చరణారవిందముల యాశ్రయము లభించనంత వరకు మాత్రమే భయము, శోకము, స్పృహ, పరాభవము, లోభము అనునవి మానవుని బాధించుచుండును. -

తావద్భయం ద్రవిణగేహసుహృన్నిమిత్తం
శోకః స్పృహా పరిభవో విపులశ్చ లోభః
తావన్మమేత్యసదవగ్రహ ఆర్తిమూలం
యావన్న తేఽంఘ్రిమభయం ప్రవృణీత లోకః
(శ్రీమద్భాగ. 3/9/6)

ఇట్లు
భక్తచరణరజోదాసానుదాసుడు
హనుమాన్ ప్రసాద్ పోద్దార్.

# దేవర్షి నారదుడు

అహో దేవర్షిర్ధన్యోఽయం యత్కీర్తిం శార్ఙ్గధన్వనః
గాయన్మాద్యన్నిదం తంత్ర్యా రమయత్యాతురం జగత్
(శ్రీమద్భాగ. 1/6/39)

అహో! దేవర్షి నారదుడు బహుధన్యుడు. ఏలయన్న అతడు వీణ మ్రోగించుచు, హరిగుణగానము చేయుచు, పారవశ్యము నందుచు ఈ యాతురమైన జగత్తునంతను ఆనందింపజేయుచున్నాడు.

భగవానుడు స్వయముగా ఎట్లవతరించుచుండునో అట్లే కారణ జన్ములైన మహాపురుషులు లోకములో నప్పుడప్పుడవతరించి లోకకల్యాణము నిమిత్తము భూమిపై చరించుచుందురు. భగవానుని లీల కొరకు రంగ భూమిని సిద్ధము చేయుట, ఆ లీలకు ఆవశ్యకములైన యుపకరణములను సేకరించుట, ఆ లీలయందు తాము సహాయకులగుటయు ఆయా కాలములందు వారికి స్వాభావిక కార్యమగుచుండును. ఇట్టి మహాపురుషులు ముక్తులైయుండియు, ముక్తులుగా నుండక లోకములోని జీవులతోడ వారి కల్యాణమును గోరి జీవించుచుందురు. సాధారణముగా వీరి కార్యక్రమము సర్వదా నిర్విరోధముగా సాగిపోవుచునే యుండును. అయినను ఏదియైన ప్రధానమైన భగవదవతారము సంభవించినప్పుడు మాత్రము వీరి కార్యక్రమభారము మరింత పెరిగిపోవుచుండును. మంగళమయమైన వీరి జీవితము. జగత్కల్యాణమునకు ఉద్దేశింపబడి యుండును.

అవిద్య, అహంకారము, మమకారము, ఆసక్తి, మున్నగు నవ లక్షణములు ఏవియు లేనివారై యీ మహాపురుషులు సకల ప్రపంచమును నడుపు భగవానుని చేతిలోని యంత్రములవలె కార్యసాధనము చేయు చుందురు. వీరివలననగు కార్యములన్నియు భగవానుని కార్యములే! ఇట్టి మహాపురుషులలో దేవర్షి నారదుడు ఒకడు. ఎల్ల యుగములందు, ఎల్ల

లోకములందు, ఎల్ల శాస్త్రములందు, ఎల్ల సమాజములందును ఎల్ల కార్యములందును నారదునకు ప్రవేశమున్నది. ఇతడు సత్యయుగములో నుండెను. త్రేతాయుగమందు ఉండెను. ద్వాపరమందును ఉండెను. ఈ ఘోరమైన కలికాలమునందును ఉండువాడు. అర్హతగల భక్తులకు ఈ మహాభాగుని దర్శనము లభించుచుండునని పెద్దలు చెప్పుదురు. గోలోకము, వైకుంఠము, బ్రహ్మలోకము మొదలు అతలవితలాది పాతాళలోక పర్యంతముగా గల సమస్త లోకములందును ఇతని ప్రవేశమునకు ఎట్టి అవరోధము లేదు. ఇతడు మనస్సంకల్ప మాత్రమున యోగబలముతో ఎక్కడనుండి ఎక్కడకైన పోగలడు. వేదములు, స్మృతులు, పురాణములు, సంహితలు, జ్యోతిషము, సంగీతము మున్నగు సమస్త శాస్త్రములందును ఈ మహానుభావుడు గోచరించుచుండును. సాక్షాత్తు విష్ణుభగవానుడు, శంకరుడు మొదలు రాక్షసుల వరకు అందరును ఈ మహానుభావుని యెడల గౌరవమును, విశ్వాసమును, ఆదరమును ప్రకటింతురు. దేవరాజగు నింద్రుడు కూడ ఈతని వచనములందు విశ్వాసమును, ఆదరమును ప్రదర్శించును. దేవశత్రువగు హిరణ్యకశిపుని భార్య కయాథువు కూడ ఇతని మాటలను నమ్మి ఇతని యాశ్రమము నందు తనను తాను సురక్షితురాలిని గావించుకొనెను. ఒకసారి ఈ మహానుభావుడు వ్యాసుడు, వాల్మీకి, శుకయోగివంటి మహాపురుషులకు పరమతత్త్వము నుపదేశించుచు గానవచ్చిన, మరియొక యెడ రెండు పక్షముల నడుమ కలహమును గల్పించి ధర్మపక్షమునకు శుభమును జేకూర్చు ప్రయత్నములో నున్నవాడుగా గోచరించుచుండును. నిజమునకు ఇతడు తనకై తానేమియు జేయడు. ఇతడు ఏ పని వలన ఒకరికి శుభము గలగగలదని భావించునో ఏ పని వలన సుందరమైన యొక భగవల్లీలా దృశ్యమును ప్రత్యక్షము గావింపగలుగునో ఆ పనినే యాచరించుచుండును. ఇతడు కల్పించు కలహము కాని, వివాదము కాని లోకకల్యాణహేతుకమైనదో, భగవల్లీలా సాధన మూలకమైనదో యగుచుండును. కారణము ఏమనగా ఇతని ప్రతి ప్రయత్నము భగవంతుని ప్రయత్నమే యగుచుండును. నిజము చెప్పవలెనన్న ఇతనిని భగవంతుని

హృదయమని అనవలెను. గంభీరదృష్టితో నాలోచించినప్పుడు భగవత్కృప వలన ఈ విషయము తెలియవచ్చును. నారదుడను పేర బరగు వ్యక్తులు పలువురు ఉన్నారని కొందరు వాకొందురు. వారిలో ఏడుగురు ముఖ్యులు. 1. బ్రహ్మ యొక్క మానసపుత్రుడు. 2.పర్వతుడను ఋషి యొక్క మామ . 3.వసిష్ఠుని భార్యయగు నరుంధతి యొక్క సోదరుడు లేక సత్యవతి యనునామె భర్త. 4.ఇక్కడ మాట అక్కడ, అక్కడ మాట యిక్కడను చెప్పి జగడమును సృష్టించి కళ్యాణము చేయువాడు. 5.కుబేరుని సభాసదుడు. 6.శ్రీరామచంద్రుని సభలో నుండు నెనమండుగురు ధర్మశాస్త్రవిదులలో నొకడు. 7. జనమేజయుని సర్ప యజ్ఞమున సదస్యులలో నొకడు.

ఇంతకు నిక్కడ నారదుడు ఒకడా? పలువురా? అన్న వివాదముతో మనకు పనిలేదు. ఈ వివాదమును లేవనెత్తి సిద్ధాంతము చేయుటకు వలయు నర్హతయు లేదు. ఒకే నారదుడు వేరువేరు కల్పములందు, యుగములందును భగవానుని చేతిలోని యంత్రమై విభిన్న కార్యములను సాధించినవాడు. సాధించుచున్నవాడు. ఇక్కడ భక్తికి సంబంధించి నారదుడాచరించిన కార్యమును గూర్చియే యొకింత చెప్పనెంచియున్నాము. నిజమునకు నారదుని ప్రధానకార్యమిదియే. సమస్త శాస్త్రములయందు మహాపండితుడు, సమస్త తత్త్వపరిజ్ఞాత, వ్యాఖ్యాతయు నయి యుండి కూడ కడకు ఈ నారదుడు భగవద్భక్తినే ప్రబోధించెను. వాల్మీకి, వ్యాసుడు, శుకయోగి, ప్రహ్లాదుడు, ధ్రువుడు మున్నగు మహామహాను భావులను ఇతడే భక్తిమార్గమందు ప్రవర్తిల్లజేసినవాడు. ఇంతియే కాదు. ఇతడు స్వయముగా వీణను చేత ధరించి యెల్ల యుగములందు నెల్ల సమాజములందును నిర్భయముగా నిశ్చింతముగా సర్వసమయములందును భగవంతుని పవిత్రనామములను గానము చేయుచు, సమస్తవిశ్వములోని స్త్రీ పురుషులను పవిత్రులను, భగవదభిముఖులను గావించుచు చరించు చుండును. ఈ నారద భగవానుడు తన రెండు కల్పములకు సంబంధించిన చరిత్రమును కొంతవరకు స్వయముగనే వర్ణించి యున్నాడు. భాగవతము

ఈ చరిత్రమును బహుసుందరముగా వ్యక్తము చేసినది. ప్రస్తుత వ్యాకర్తకు, పాఠకులకు రసానుభూతి కలిగించెడి యీ ప్రసంగ విషయమిది! చూడుడు!

దివ్యదృష్టి సంపన్నుడైన వేదవ్యాసమహర్షి లోకకల్యాణార్థము వేదములను నాలుగు భాగములుగా విభజించెను. పంచమవేదముగా నానా విధములైన ఆఖ్యానములతో నిండియుండు మహాభారతమును రచించెను. పురాణములను విరచించెను. ఈ విధముగా సమస్తప్రాణుల కల్యాణము ప్రవర్తిల్లినను వ్యాసభగవానునకు తృప్తి కలగలేదు. అతని చిత్తము పరిపూర్ణశాంతిని పొందలేదు. అతనికి తన చేతలో ఇంకను ఏదియో కొరవడినట్లు తోచసాగెను. అప్పుడు అతడు ఉదాసీనత వహించి సరస్వతీ నదీ తీరమునందు గూర్చుండి యిట్లు ఆలోచింపసాగెను – 'నేను సర్వము జేసితిని. అయినను నాలోనేదియో వెలితి యేల గోచరించుచున్నది? నేను భాగవతధర్మములను విస్తృతముగా నిరూపించలేదా? ఏలయన్న భాగవత ధర్మములే భగవానునకు, పరమహంస భక్తులకును ప్రీతిపాత్రములైనవి'. ఇట్లు అతడు ఆలోచించుచుండగా హరిగుణగానము చేయుచు, ప్రసన్న వదనుడైన నారదమునీంద్రుడు అక్కడకు వచ్చి చేరెను. స్వాగతసత్కార విధులై కుశలప్రశ్నములైన పిదప వేదవ్యాసుడు తన పరిస్థితిని అతనికి ఎరుగజెప్పి తన్నివారణమునకు ఉపాయమేదియైన నెరిగింపుమని యతనిని కోరెను. అంతట నారదుడు ఇట్లు చెప్పెను. –

''ఓ మునివరేణ్యా! నీవు నీ గ్రంథములలో ఇతరేతర ధర్మములను వివరించిన విధముగా భగవంతుని కీర్తిని కీర్తించలేదు. ఈ కారణముననే నీ మనము ఉదాసీనత పొందినది. ఏ వాక్కునందు – ఏ కవిత్వమందు జగత్పావనుడైన భగవానుడు వాసుదేవుని మహిమ, కీర్తియు వర్ణితము గాదో ఆ వాక్కు, ఆ కవిత్వము ఎంత మృదుమధురమ్మైనది, ఎంత చిత్రవిచిత్ర పద గుంఫనము గలది యైనను, ఎంతగా కావ్యలక్షణ లక్షితమ్మైనను సారాసారవివేకము గల జ్ఞానులు దానిని కాకతీర్థమని

వాకొందురు. అనగా విష్ఠమీద ముక్కుతో పొడుచు కాకులవంటి మలిన విషయ భోగలంపటులు, కాముకులునైన మనుష్యుల మనస్సు ఆ కవిత్వము నెడల ముగ్ధమగు విధముగా మానససరోవరములో విహరించు రాజహంసలవంటి పరమభాగవతులైన పరమహంసల చిత్తములు ఎన్నడును ఆకర్షింపబడవు. కాని యే కవిత్వమందు భగవానుని నామగుణకీర్తనము నిండియుండునో ఆ కవిత్వము వినుటకు ఇంపుగా లేక కావ్యాలంకారాదులు లేక యడుగడుగున వ్యాకరణాదిదోషములతో కూడియున్నను అత్యంతరమణీయమై సమస్త జనపాపతాప పరిహారకమైనది కాగలదు. ఆ కారణముననే భగవన్నామ గుణ వర్ణన భరితమైన వాక్కును – కవిత్వమును సాధుజనులు, మహాత్ములును తాము స్వయముగా విందురు. ఇతరులకు వినిపింతురు. కీర్తింతురు. మునివరేణ్యా! నీవు అమోఘద్రష్టవు. నీకు ఎరుగరానిది, నీ ముందు రహస్యమై యుండునది ఏదియును లేదు. కావున నీవు ఈ జగత్తు యొక్క కల్యాణమును గోరి శ్రీహరి లీలలను వర్ణింపుము! పండితులు మానవుని తపస్సు, శ్రవణము, నిత్యధర్మాచరణము, తీక్ష్ణబుద్ధి మున్నగువాని పరమఫలము కేవలము భక్తిపూర్వకముగా నొక్క శ్రీహరి గుణ వర్ణనము చేయుటయేయని చెప్పిరి. ఒక్క మారు నా పుర్వజన్మ చరిత్రము నాలకించి యాలోచింపుము! శ్రీహరి గుణశ్రవణ ప్రభావమున నేను ఏ దశయందు ఉన్నవాడను ఏ దశకు చేరితినో నీకు తెలియగలదు.

ఓ మహాముని! పూర్వకాలమందు నేనొక దాసీపుత్రుడను. ఒకానొక సమయమున వర్షాకాలమందు చాతుర్మాస్యదీక్ష సాగించికొనుటకై మా యూరికి పలువురు మహాత్ములు విచ్చేసిరి. నేనప్పుడు చిన్నపిల్లవాడను. నా తల్లి నన్ను ఆ మహాపురుషుల సేవకు నియమించెను. నేను ఆ మహాత్ముల యెదుట చిన్నతనపు చిలిపి చేష్టలు ఏవియు చేయలేదు. ఆటపాటలెల్ల విస్మరించి నేను ప్రశాంతముగా వారి పాదముల వద్ద కూర్చుండి యుండువాడను. నేను చాల తక్కువగా మాటలాడువాడను. ఈ కారణము చేత ఆ మహాపురుషులు సమదర్శనులై యుండియు నా

యెడల ప్రసన్నత వహించి నాపై విశేషానుగ్రహము కలిగి యుండసాగిరి. వారు ఆదేశింపగా నేను వారు తినగా మిగిలిన (యెంగిలి) పదార్థములు తినువాడను. అట్లు చేయుటచేత నా పాపములు అన్నియు నశించిపోయినవి. అట్లు చేయుచు చేయుచు నుండగా కొంతకాలమునకు నాకు చిత్తశుద్ధి గలిగి భాగవతధర్మమునందు అభిరుచి గలిగెను. అక్కడ వారు నిత్యము శ్రీకృష్ణకథాగానము చేయుచుండువారు. ఆ మహాత్ముల దయవలన నేనా గాథలను శ్రద్ధగా నాలకించుచుండువాడను. అట్లు చేయుగా చేయగా క్రమముగా నాకు భగవానునియందు భక్తి కుదురుకొనెను. ఓ మునివర్యా! మొదట నాకు భగవానునియందు రుచి కలిగినది. పిమ్మట నా మతికి స్థిరత్వము ప్రాప్తించినది. దృఢమైన యా విశుద్ధబుద్ధి ప్రభావము వలన నేను నా మాయావిరహిత విశుద్ధపరబ్రహ్మ స్వరూపమందు సత్తు అసత్తునైన సమస్త ప్రపంచమును మాయాకల్పితమైన దానినిగా చూడసాగితిని. ఈ విధముగా వర్షర్తువు, శరదృతువు రెండు ఋతువుల కాలమెల్ల ఆ మహాత్ములు దినదినము భగవంతుని నిర్మలయశస్సును గానము చేయుచుండిరి. దాని నాలకింపగా నా హృదయమందు రజోగుణమును, తమోగుణమును క్షీణింపజేయు సాత్త్వికభక్తి యుత్పన్న మయ్యెను. నన్ను అనురక్తునిగా, ఆశ్రితునిగా, జితేంద్రియునిగా, శ్రద్ధా యుక్తునిగా, పాపరహితునిగా, బాలకుని రూపమందున్న దాసునిగా గుర్తించి దీనదయాపరులైన యా మహాత్ములు మా యూరిని వీడి వెడలిపోవు వేళ నాయందు పరమానుగ్రహమును జూపి సాక్షాత్తు భగవానుడు ఉపదేశించిన గుహ్యతమమైన జ్ఞానమును నాకు ఉపదేశించిరి. ఆ జ్ఞానము యొక్క ప్రభావము చేత భగవానుడైన వాసుదేవుని మాయా ప్రభావమునుదెలిసికొనగలిగితిని. దానిని తెలిసికొనుట వలననే పురుషుడు పరమాత్మ యొక్క పరమపదమును పొందగలుగును.

(గీతకు టీక వ్రాసిన సుప్రసిద్ధ మహాత్ముడు మధుసూదన సరస్వతి తన భక్తిరసాయనము అను గ్రంథములో దేవర్షి నారదుడు అనుసరించిన యీ క్రమమునే అనుసరించి భక్తికి సంబంధించిన పదునొకండు భూమికలను పేర్కొనెను. –

ప్రథమం మహతాం సేవా తద్దయాపాత్రతా తతః
శ్రద్ధాథ తేషాం ధర్మేషు తతో హరిగుణ శ్రుతిః
తతో రత్యంకురోత్పత్తిః స్వరూపాధిగతి స్తతః
ప్రేమవృద్ధిః పరానందే తస్యాథ స్ఫురణం తతః
భగవద్ధర్మనిష్ఠాతః స్వస్మింస్తద్గుణ శాలితా
ప్రేమ్ణోఽథ పరమా కాష్ఠేత్యుదితా భక్తిభూమికాః

1. తొలుత మహాపురుషులను సేవించుట. 2. పిమ్మట వారి దయకు పాత్రుడగుట. 3. తన్మూలమున వారి ధర్మములందు శ్రద్ధ కలుగుట. 4. ఆ శ్రద్ధతో హరిగుణ శ్రవణము చేయుట. 5. శ్రవణము వలన ప్రేమాంకుర ముదయించుట. 6. ప్రేమవలన స్వరూప ప్రాప్తి. 7. దానివలన పరానంద స్వరూపమందు ప్రేమ పెంపొందుట. 8. ప్రేమ వలన పరానందము స్ఫురించుట. 9. దానివలన భాగవత ధర్మమందు నిష్ఠ జనించుట. 10. దానివలన తనలో తద్గుణములు ప్రకటమగుట. 11. దానివలన ప్రేమ పరాకాష్ఠకు చేరుట. ఇట్లు భక్తికి 11 భూమికలు తెలుపబడినవి.)

అనంతరము నాకు జ్ఞానోపదేశము గావించిన యా మహాపురుషులు వేరొక యెడకు వెడలి పోయిరి. వారు చెప్పిన విధముగా నేను భజనము చేయుచుంటిని. నా తల్లికి నేను ఒక్కడనే తనయుడను. ఆ కారణమున ఆమెకు నా మీద ప్రేమ మెండు. ఆమె నన్నే తన పరమగతిగా భావించికొనుచుండెను. ఒకనాడు కాలప్రేరితమైన సర్పము నా తల్లిని కాటువేసెను. ఆ కారణమున నామె మరణించెను. అప్పుడు నేను భక్తకల్యాణకరుడైన భగవంతుడు నాయందు కృప జూపెనని తలచికొని ఉత్తరదిక్కుగా పయనము సాగించితిని. అట్లు పోయి నేనొక వనములో ప్రవేశించితిని. అచ్చట నొక నది యుండెను. దాని తటమునందు రావిచెట్టు క్రింద గూర్చుండి నేను భగవచ్చింతనమున, చిత్తము నేకాగ్ర మొనర్చికొని భక్తితో భగవానుని చరణకమలధ్యానము చేయనారంభించితిని. ఆ

సమయమున ప్రేమావేశము కారణముగా నా కన్నులనుండి ఆనందాశ్రువులు వెలువడసాగెను. క్రమముగా నా హృదయములో శ్రీహరి ప్రత్యక్షమైనట్టి యనుభూతి నాకు గలిగెను. భగవానుని దర్శనము ప్రాప్తించినంతనే నాలోని ప్రేమ వెల్లువయ్యెను. నా దేహము రోమాంచిత మయ్యెను. నేను ఆనంద సముద్రములో మునిగిపోయితిని. లోకముతోడ నన్ను నేను మరచి పోయితిని.

ఆకస్మికముగా భగవానుని మనోమోహనమైన పరమసుందర రూపము అంతర్హితమైపోయెను. అప్పుడు నాకు ఎంతో దుఃఖము గలిగెను. నేను మరల దర్శనము కొరకు ప్రయత్నింపసాగితిని. అంతట నాకు – 'ఓ బాలకా! ఈ జన్మలో నీకు నా దర్శనము లభించదు. నీలోని ప్రేమను పెంపొందించుటకై ఒక మారు దర్శనమిచ్చితిని. అల్పకాలపు సత్సంగము యొక్క ప్రభావము చేత నాపై నీకు దృఢమైన భక్తి కుదురుకొన్నది. నీవు ఈ దేహమును బాసి నాకు పరిజనుడవు గాగలవు. నాయందు నీ బుద్ధి చలింపక నిలువగలదు. నా కృపవలన కల్పాంతరమందు కూడ నీకు ఈ జన్మలోని విషయములు జ్ఞప్తియందు ఉండగలవు' అని ఆకాశవాణి వినవచ్చినది. అప్పుడు నన్ను నేను భగవానుని కృపకు పాత్రునిగా నెరిగితిని. వంగి నమస్కారము చేసితిని. లజ్జ వీడి భగవానుని పరమగుహ్యము, కల్యాణమయము నైన నామమును, గుణములను కీర్తించుచు స్మరించుచు ఈర్ష్యాహంకారములను వీడి కామనారహితుడనై లోకములో తిరుగ నారంభించితిని. సమయము వచ్చినప్పుడు నా శరీరము రాలిపోయి నాకు దివ్యమైన పార్షదదేహము ప్రాప్తించినది.

అనంతరము కల్పాంతరమందు లోకముల నెల్ల తనలో విలీనము చేసికొని ప్రళయ సముద్రమందు శయనించిన బ్రహ్మ హృదయమందు అతని శ్వాసతోడ నేను ప్రవేశించితిని. వేయి యుగముల కాలమతిక్రమించిన పిదప ఆ బ్రహ్మ మరల జగద్రచన మారంభించెను. అప్పుడు మరీచి మున్నగు మహర్షులతోడ అతని శ్వాసము నుండి నేను ఆవిర్భవించితిని.

నాటినుండియు అఖండ బ్రహ్మచర్యవ్రతము నవలంబించి నేను వెలుపల లోపల ఇచ్ఛవచ్చిన విధముగా తిరుగాడ నారంభించితిని. భగవంతుని కృపవలన నాకు ఎందు పోవుటకైనను అవరోధమేదియును లేదు. స్వయముగా భగవానుడొసగిన యీ స్వరమయబ్రహ్మతో విభూషితమైన వీణను మ్రోగించి హరిగుణగానము చేయుచు సర్వత్ర పరిభ్రమించుచున్నాను. భగవానునకు నాపై అపారమగు కృప యేర్పడినది. నేను ప్రేమతో గద్గదికము వహించి భగవానుని లీలాగాన మారంభించినంతనే శుభకరుడు, కీర్తిశాలియైన ఆ పూజ్యపాదుడు, ఆ స్వామి యాక్షణమందే ప్రకటమై పిలిచిన వెంటనే ముందునకు వచ్చి నాకు దర్శనమిచ్చుచుండును.

భోగాపేక్షతో వ్యగ్రమానసులై మరల మరల సాంసారిక విషయ భోగములందు ఆసక్తులగుచుండు మానవులు సంసారసాగరమును తరించిపోవవలెనన్న వారికి శ్రీహరి చర్చయే దృఢమైన నౌకయగును. ఈ కారణముననే నేను నాయొక్కయు, లోకుల యొక్కయు కల్యాణమును గోరి సర్వకాలములందును హరిగుణగానము చేయుచు సర్వత్ర సంచారము సాగించుచుందును. విషయలంపటులైన పురుషుల చిత్తము శ్రీహరి భజనము వలన శాంతించునంత శీఘ్రముగా యోగాదుల వలన శాంతింపనేరదు. ఇంత మాత్రము పలికి హరిగుణగానము చేయుచు నారదుడటనుండి వెడలిపోయెను.

దేవర్షి నారదుడు సమస్త వేదతత్త్వవిదుడు, దేవతలకు కూడ పూజ్యుడు, ఇతిహాసపురాణ విశేషజ్ఞుడు, కడచిపోయిన కల్పములలోని విషయములను సైతము నెరిగినవాడు, ధర్మతత్త్వపరిజ్ఞాత. శిక్షాకల్ప వ్యాకరణాదులయందు అసాధారణ పాండిత్యము గలవాడు, సంగీత విశారదుడు, పరస్పర విరుద్ధములైన విధి వాక్యముల మీమాంస నెరిగిన వాడు, వాక్యముల విభాగమందు పరిపూర్ణయోగ్యత కలవాడు, శ్రోతలను రంజింపచేయునట్లు మాటలాడగలవాడు (ఉపన్యసింపగలవాడు) మేధావి,

స్మరణశాలి, నీతిశీలుడు, కవి, జ్ఞాని, ఎల్ల ప్రమాణములతోను వస్తువిచారణ చేయగలవాడు, బృహస్పతులవంటి పండితుల సందేహములను గూడ పరిష్కరించగలవాడు, ధర్మార్థకామమోక్షముల తత్త్వము నెరిగినవాడు, యోగబలము సాయమున ఎల్లదిక్కుల నుండియు సమస్త భూమండలమును ప్రత్యక్షముగా చూడగలవాడు, మోక్షాధికారము నెరిగినవాడు. మేలు చేకూర్చు తలంపుతో వివాదములను గల్పించువాడు. సంధి విగ్రహముల సిద్ధాంత పరిజ్ఞానము గలవాడు. అనుమాన ప్రమాణముతో కార్యముయొక్క తత్త్వమును తెలిసికొనగలవాడు. సమస్త శాస్త్రముల పాండిత్యము గలవాడు. విధిని ఉపదేశించువాడు. సమస్త సద్గుణములకు నెలవు అయినవాడు. మహాతేజశ్శాలి అని మహాభారతము చెప్పుచున్నది. అతడు జ్ఞానస్వరూపుడు, విద్యానిధి, ఆనందపుంజము, సదాచారమునకు పరమాధారభూతుడు, సమస్త ప్రాణులయందు నిర్హేతుక ప్రేమను ప్రదర్శించువాడు, జగత్కల్యాణకారి, భక్తియే మూర్తి అయినవాడు, పరమాచార్యుడు.

ఇట్టి సర్వవిధశుభలక్షణలక్షితుడైన యీ నారదమహర్షి సర్వ విషయములను ఉపదేశించిన పిమ్మట 'అథాతో భక్తిం వ్యాఖ్యాస్యామః' అని కడపట భక్తిని ఉపదేశించెను. దీనినిబట్టి భక్తియొక్క స్థానము మహోన్నతమైనదని వ్యక్తమగుచున్నది.

ఈ విధముగా లోకులపై నిర్హేతుక కృపను వెలయించు లక్ష్యముతో హరిగుణగానము చేయుచు మూడు లోకములందును సంచరించుచుండు దేవర్షి నారద మునీంద్రుని పాదపద్మములపై ప్రణమిల్లి, మనము అతని పరమప్రియములైన భక్తితత్త్వోపదేశములను శ్రద్ధగా పఠించి తదనుసారముగా మన జీవితమును మలచుకొనవలయును.

హరిః ఓం తత్సత్

|| ఓం శ్రీ పరమాత్మనే నమః ||

# నారద భక్తి సూత్రములు

## (ప్రేమ దర్శనము)

### ప్రేమరూప భక్తి ప్రకారము

**"అథాతో భక్తిం వ్యాఖ్యాస్యామః" (1)**

ఈ సూత్రమందు ప్రయోగింపబడిన 'అథ' 'అతః' అను శబ్దములను బట్టి భక్తిమార్గమునకు సంబధించిన పరమాచార్యుడు, మహాభక్తశిరోమణి, సర్వభూతహితసాధన పరతంత్రుడు, దయానిధి, దేవర్షి ప్రవరుడునగు నారదుడు ఇంతకు ముందు ఇతరేతరములైన సిద్ధాంత విషయములను ఎన్నిటినో వివరించియుండె ననియు, ఇప్పుడు జీవుల క్షేమమును గోరి కల్యాణమయమైన భక్తియొక్క స్వరూపమును, సాధనములను వివరింప నెంచుచున్నాడనియు వ్యక్తమగుచున్నది. నారదుడిట్లు చెప్పుచున్నాడు -

**"సా త్వస్మిన్ పరమప్రేమరూపా" (2)**

అది భగవానుని యెడల పరమప్రేమ స్వరూపమగునది.

భక్తి యొక్క విధములు అనేకము లున్నవి. వానిలో నారదుడు వివరించు భక్తి ప్రకారము పరమప్రేమ స్వరూపమగునది. భగవంతుని యెడల అనన్యప్రేమ కుదురుకొనుటయే భక్తి. మానవుని చిత్తవృత్తి జ్ఞానము, కర్మము మున్నగు ఆశ్రయములను పూర్తిగా వీడవలెను. ఎల్లవంకల నుండియు కామనారహితము గావలయును. లోకమందలి సమస్త

పదార్థముల మీద నుండి, పరలోకగతములైన సమస్త భోగసాధన సామగ్రుల మీద నుండి, కడకు మోక్షము మీదనుండి కూడ తొలగి చిత్తము కేవలము ఒక్క తనకు పరమప్రేమాస్పద భూతుడగు భగవానునియందే లగ్నము గావలయును. చిత్తములో నెలకొనియున్న మమకారము, ఆసక్తి యంతయు సమస్త పదార్థముల నుండి పూర్తిగా తొలగి కేవల మొక్క తన ప్రియతమ భగవానుని పై సంలగ్నము గావలయును. ఈ స్థితియే అనన్య ప్రేమ యనబడును.

''అమృతస్వరూపా చ'' (3)

ఇది యమృత స్వరూపము కూడ (అగునట్టిది).

భగవానుని పయి కుదురుకొన్న యనన్య ప్రేమయే అమృతము. అది సర్వాధిక మధురమైనది. ఈ ప్రేమామృతమును పొందినవాడు దానిని గ్రోలి యమరత్వమును పొందును. లోకసంబంధమైన వాసనయే మృత్యువు. భగవంతుని అనన్యభావముతో ప్రేమించు భక్తుని హృదయములో భగవత్ప్రేమ సంబంధమగు నిత్యము, నూతనము, పవిత్రమునగు సంస్కారము యొక్కటి దక్క ఇతరమగు వాసన యేదియు నుండదు. ఇట్టి వాసన అత్యంత దుర్లభమైనది. దీని మూలముగా మానవుడు భగవానుని మునిమనోహారిణి యైన లీలకు ఒక సాధనమై కర్మబంధన యుతములైన జననమరణాల వలయమునుండి సర్వవిధముల విడివడిపోవును. అతడు భగవానుని వద్ద సర్వదా నివసించును. అట్లే భగవంతుడు అతని చెంత నివసించును. ప్రేమించు భక్తుని యొక్క, ప్రేమాస్పదభూతుడగు భగవానుని యొక్కయు నిత్యము, అవిచలమునగు ఈ సంయోగమే అచ్చమైన యమరత్వము. ఈ కారణముననే భక్తులు ముక్తిని కోరక భక్తినే కోరుకొనుచుందురు.

''యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధో భవతి, అమృతో భవతి, తృప్తో భవతి.'' **(4)**

(పరమప్రేమ స్వరూపము, అమృతస్వరూపము) నగు ఈ భక్తిని పొంది మానవుడు సిద్ధపురుషుడు అగును. అమరుడగును. తృప్తుడగును.

భగవత్ప్రేమామృతరసపానము చేసినవాడే సిద్ధుడు. ఇక్కడ ప్రయోగింపబడిన 'సిద్ధ' శబ్దము నుండి అణిమాదులగు అష్టసిద్ధులను పొందినవాడు అను అర్థమును గ్రహింపరాదు. ప్రేమరూపమగు భక్తిని అవలంబించిన భక్తుడు సిద్ధుల మాట యటుండ, మోక్షరూపమగు సిద్ధిని కూడ ఎన్నడు నపేక్షింపడు. ఈ సిద్ధులు తమయంత తామే అట్టి భగవత్ భక్తుని సేవించు అవకాశమునకే అన్వేషించుచుండును. కాని యతడు వీనిని స్వీకరింపనొల్లడు. ఈ విషయమున స్వయముగా భగవంతుడు ఏమనెనో చూడుము! –

న పారమేష్ఠ్యం న మహేంద్రధిష్ణ్యం
న సార్వభౌమం న రసాధిపత్యమ్
న యోగసిద్ధీ రపునర్భవం వా
మయ్యర్పితాత్మే చ్ఛతి మద్వినాన్యత్

(శ్రీమద్భాగ. **11/14/14**)

'నాయందే చిత్తమును లగ్నము గావించి నన్ను ప్రేమించు భక్తుడు నన్ను కాదని బ్రహ్మ పదమును గాని, యింద్రపదమును గాని, సమస్తభూచక్రవర్తిత్వమును గాని, లోకాంతరాధిపత్యమును గాని, యోగసిద్ధులను గాని, కడకు సాయుజ్యాది మోక్షసుఖములనుగాని ఆవంతయు నపేక్షింపడు.'

ఈ విషయమున ఒక భక్తుడు ఏమనుచున్నాడో చూడుడు। -

రోమాంచేన చమత్కృతా తనురియం, భక్త్యా మనో నందితం,
ప్రేమాశ్రూణి విభూషయంతి వదనం, కంఠం గిరో గద్గదాః
నాస్మాకం క్షణమాత్రమప్యవసరః కృష్ణార్చనం కుర్వతాం.
ముక్తిర్ద్వారి చతుర్విధాపి కిమియం దాస్యాయ లోలాయతే?
(బోధసార)

"మేము మా ప్రియతముడైన శ్రీకృష్ణుని పూజించుకొను వేళ మా శరీరమంతయు పులకించిపోయినది. భక్తిచేత మనస్సు ఆనందభరిత మయిపోయినది. ప్రేమాశ్రువులు ముఖమును, గద్గదవాక్కులు కంఠమును అలంకరించినవి. ఇతర విషయముల మీదకు దృష్టిని మరలించుటకు మాకు క్షణము కూడ అవకాశము లభించుట లేదు. అయినను సాయుజ్యమాదిగా నాలుగు విధముల ముక్తులును మా గుమ్మము చెంత నిలిచి మమ్ము చేటికలవలె భజించుటకు ఎంతయో యారాటపడుచున్న వేమి?"

భక్తుడు ఎట్టైన భుక్తిని, ముక్తిని స్వీకరించునేని అవి తమ భాగ్యముగా భావించుకొనును. కాని యతడట్లు చేయడు. -

హరిభక్తిమహాదేవ్యా స్సర్వా ముక్త్యాదిసిద్ధయః
భుక్తయశ్చాద్భుతాస్తస్యాశ్చేటికావదనువ్రతాః (నారద పాంచరాత్ర)

ముక్తి మున్నగు సిద్ధులు. ఇంకను అనేకవిధములగు విలక్షణములైన భుక్తులును (భోగములు) చేటికలవలె హరిభక్తి మహాదేవిని సేవింప నుద్యుక్తములై యుండును.

కాబట్టి యిక్కడ 'సిద్ధి' యను శబ్దమునకు "కృతకృత్యత్వము" అని యర్థము చెప్పుకొనవలయును. భక్తుడగువానికి ఏ వస్తువుయొక్క

లేమి స్ఫురించదు. అతడు తన యిష్టదైవతమునందు భక్తిని పొంది పూర్ణకాముడే అగును. ఈ పూర్ణకామత్వమే అతని యమరత్వము. మానవుడు ఇట్టి పూర్ణకామత్వమును, ఇట్టి యమరత్వమును సాధించుకొననంతవరకు మరల మరల ప్రారబ్ధకర్మవశమున పుడమిపై పుట్టుచు గిట్టుచు నుండవలసినవాడు అగును. పూర్ణకాముడైన భక్తుడు సృష్టి, సంహారముల రెండింటియందును ప్రత్యక్ష భగవల్లీలనే అనుభవములోనికి తెచ్చికొనును. అతడు మృత్యువును ఒక క్రీడగా భావించును. నిజమునకు అతని విషయమున మృత్యువునకే మృత్యువు ప్రాప్తించినట్లులగును. భగవల్లీల యన్న భావన యొక్కటి దక్క మృత్యువు అనుపేరిట భయంకరవస్తువు ఏదియు అతని తలపులో ఉండనే యుండదు. ఆ కారణముననే అతడు తృప్తిగన్నవాడై యుండును. జగత్తులోని పదార్థములు భగవల్లీలకంటె భిన్నములైనవియన్న భావన యున్నంత వరకు వానిని మానవుడు సుఖదాయకములు, దుఃఖదాయకములు అని తలపోయుచు నిరంతరము క్రొత్త క్రొత్తవైన సుఖదాయక పదార్థములను అపేక్షించుచు, అన్వేషించుచు అసంతృప్తి చెందుచునే యుండును. ఈ పదార్థముల మూలకారణ మేదియో, పరిపూర్ణమైన యథార్థస్వరూప మేదియో అది తనకు తెలిసినప్పుడు, అది ప్రాప్తమైనప్పుడు అతని చిత్తము ఖండరూపము, అసంపూర్ణమునగు పదార్థముల వంకకు పోనేపోదు. అతడు పూర్ణవస్తువును పొంది తృప్తుడైయుండును.

''యత్ప్రాప్య న కించిద్వాంఛతి న శోచతి న ద్వేష్టి న రమతే నోత్సాహీ భవతి'' **(5)**

ఆ (ప్రేమస్వరూపమైన) భక్తి ప్రాప్తించినప్పుడు మానవుడు ఇక ఏ వస్తువును కాంక్షింపడు. దేని కొరకును శోకింపడు. దేనిని, ఏ వ్యక్తిని ద్వేషింపడు. ఎందును ఆసక్తుడు కాడు. (విషయభోగముల పొందుటయందు) ఉత్సాహము వహింపడు.

ఆ పరమభక్తుడు పరమము, మహత్తరమునగు వస్తువునే పొందును. దానిని పొందగా వానిలోని యిచ్ఛలన్నియు అంతరించిపోవును. లోకములోని ప్రేమ, ఐశ్వర్యము, సౌందర్యము, బలము, యశస్సు, జ్ఞానము, వైరాగ్యము మున్నగు ఏ పదార్థముల కొరకు భోగులు, విరాగులునగు మానవులందరును తమ తమ యిచ్ఛ ననుసరించి సర్వదా ఆసక్తి (లోభము) కలవారు అగుచుందురో, అవి యన్నియు భగవానునియందలి పరమప్రేమయను దుర్లభవస్తువు ముందు అత్యంతము తుచ్ఛములైనవే యగును. పైని పేర్కొన్న వస్తువులు అన్ని విశ్వమందు ఎల్లయెడల విస్తరించి యుండునట్టివి. వాని నన్నిటిని ఒకచోటికి ప్రోగుచేయుగా నేర్పడు సమాహారరూపమెల్ల భగవానుడు అను సముద్రమందలి ఒక జలకణముతో తుల్యమైనదగును. ఆ భగవానుడు ఏ ప్రేమచేత సర్వదా ఆకర్షితుడు అగుచుండునో దాని ముందు ఈ లౌకిక పదార్థములు ఏ లెక్కలోనికి వచ్చును?

శుకమహర్షి యేమనెనో చూడుడు! -

యస్య భక్తిర్భగవతి హరౌ నిశ్శ్రేయసేశ్వరే
విక్రీడతోఽమృతాంభోధౌ కిం క్షుద్రైః ఖాతకోదకైః
(శ్రీమద్భాగ. 6/12/22)

'పరమకల్యాణమయప్రదుడు, భగవానుడునగు శ్రీహరియెడల భక్తి గలిగియుండు మనుజుడు అమృతసాగరమందు క్రీడించును. కుంటలలో నుండు మురికినీటిని బోలునట్టి యే భోగము నందును, కడకు స్వర్గాదికమందుకూడ అతని మనస్సు సంసక్తము కాదు'

ప్రేమ సముద్రమందు నిమగ్నుడైన భక్తుడు ఇతర పదార్థముల నెందులకు కాంక్షించును?

భక్తుడైనవాడు భోగమోక్షాదులను ఎట్లు అపేక్షింపడో అట్లే యవి నశించినను (అందినవి, అందకుండనివి అయిపోయినను) వానికై విచారింపడు. భోగనాశమును అతడు భగవంతుని లీలగా భావించి సర్వదశలయందును సర్వదా ఆనందభరితుడు అయియేయుండును. కాని భగవత్ప్రేమ ఆస్వాదించుచుండగా తనకు సాయుజ్యమోక్షసాధనమందు లోపము సంభవించినను అతడు అందులకై చింతింపక తాను ఎన్ని జన్మలు ఎత్తవలసివచ్చినను విచారింపక తన భగవత్ప్రేమ క్షణక్షణ ప్రవర్ధమానము గావలెననియే కోరుకొనుచుండును.

తులసీదాసు తన రామాయణములో ఏమనెనో చూడుడు!-

"నేను సద్గతిని కోరను. శాస్త్రజ్ఞానమును గోరను. ఒకింత సంపదలను అపేక్షింపను. బుద్ధిసిద్ధులను పడయగోరను. విపులమైన ప్రశంసల నపేక్షింపను. శ్రీరామచంద్ర చరణారవిందయుగళిపై అనుదినము అనువర్తించు నిర్హేతుక భక్తిభావము గావలెనని మాత్రమే కోరుకొందును."

ఇట్లే అతడు ఒకజీవుని గాని, లోకదృష్టిలో ప్రతికూలముగా భావింపబడు నొక పదార్థమును గాని, ఒక పరిస్థితిని గాని ద్వేషింపడు. అతడు సమస్త జీవులయందు తమ యిష్టదైవమును, సర్వపదార్థముల యందు, సర్వపరిస్థితులయందు తన స్వామియొక్క లీలను సందర్శించుచు క్షణక్షణము పరమానందానుభవము నందుచుండును.

'లోకమంతయు ప్రభుమయముగా గానవచ్చునప్పుడు అతడు ఎవరితోడ, దేనితోడ ఎందులకు విరోధము పెట్టుకొనును?'

భక్తుని మనస్సు భగవత్ప్రేమయందు గాఢముగా కలసి లీనమైపోవును. అర క్షణము కూడ అది యితర పదార్థములందు రమించదు. గోపికలు ఉద్ధవునితో ఏమన్నారో చూడుడు! -

''ఉద్ధవా! మాకు పదులు, ఇరువదులుగా మనస్సులు ఏవియును లేవు. ఉన్నది ఒక్క మనస్సు. ఆ ఒక్కటియు శ్యామసుందరునితోడ వెడలిపోయినది. ఇక ఇక్కడ నీవు చెప్పుచున్న బ్రహ్మ నారాధించువారు ఎవరు?''

అచ్చమైన భక్తుల మనస్సు వారి యధీనమందు ఉండనే యుండదు. ఇక అది యితరములందు ఎట్లు రమించును? ఈ కారణముననే మధురభక్తి మార్గము నవలంబించిన వారి భగవంతునకు మనోహరుడు అనగా మనశ్చోరుడు అను పేరు గలిగినది.

మరియొక గోపికాభావన యిది - ''తుమ్మెదా! శ్యామసుందరుడు మా పాలిటి దొంగ. మధురమూర్తియైన యాతడు మా మనమును హరించివైచినాడు. కావలెనన్న యీ నేత్రములను పరిశీలింపుమా!''

ఆ స్వామి పరమభక్తుని చిత్తమును నేర్పుగా హరించి తన సంపద గావించివైచుకొనును. ఇక దాని మీద ఇతరుల దృష్టి పడనే పడదు. మరియొక వ్యక్తి కాని, వస్తువుకాని కానవచ్చినప్పుడు కదా వానియందు, దానియందు ఆసక్తియో, ప్రీతియో జనించునది? ఇతరమునకు సంబంధించిన కల్పనకు కూడ స్థానము లభించునట్టి దశయందు ఉన్న మనస్సులో ఆసక్తియో, రతియో ఎవరియందు, దేనియందు ఎట్లు కలుగనేర్చును? శ్రీకృష్ణప్రేమమయస్వరూపిణులైన గోపికలు ఏమనుచున్నారో చూడుడు! -

''మా తనువులెల్ల శ్యామసుందరుడు. మా మనమ్ములెల్ల శ్యామసుందరుడు. మా ధనమెల్ల శ్యామసుందరుడు. ఉద్ధవా! ఎనిమిది యామములు మాకు శ్యామసుందరునితోడిదే పని. మా హృదయమెల్ల శ్యామసుందరుడు. మా జీవన మెల్ల శ్యామసుందరుడు. శ్యామసుందరుడు

లేని గతి మాకు లేదు. శ్యామసుందరుడే మాకు మతి. శ్యామసుందరుడే మాకు ప్రాణపతి. శ్యామసుందరుడే మాకు సుఖప్రదుడు. అతడే మాకు మేలు కలిగించువాడు. అతడే మా శోభాధామము. ఉద్ధవా! ఏవియో పత్రాలను చేతబట్టుకొని పరుగిడివచ్చినావు. ఎంత పిచ్చివాడవయ్యా నీవు? నీవు బోధించు యోగమును ఇక్కడ ఎందు నిలిపికొనుమందువయ్యా? ఇక్కడ మా రోమరోమము శ్యాసుందరమయమై యున్నదయ్యా!''

అత్యంత ప్రియుడగు కేవల మొక్క శ్రీకృష్ణునకు దక్క తదితరమునకు మనస్సులో ప్రవేశమే నిషిద్ధమైయున్న చోట ఇతరమైనదానిని దేనినైన పొందవలెనన్న యుత్సాహము కాని, కోరిక గాని యెట్లు కలుగును? ఎవరైన ఎవరినైన లేక దేనినైన చూచుట సంభవము గావలె. తద్విషయము వినుట సంభవము గావలె. వారికై లేక దానికై యిచ్ఛ జనింపవలె. అప్పుడు కదా వారికై లేక దానికై ప్రయత్నము మొదలగునది? మనస్సు ముందుగనే ఒకరి యధీనమై పోయినదయ్యె. దాని మీద ఆ ఒక్కరు సంపూర్ణస్వత్వము నేర్పరచికొనుట పూర్తియైనది. ఆ ఒక్కరు స్వయముగా వచ్చి యందు స్థిరనివాసము కల్పించికొనుట కూడ పూర్తియైపోయినది. ఇతరులకు లేక యితరమునకు ఇక అందు కొంచెము కూడ తావేలేదు. అట్టియెడ ఎవరైన వచ్చినను దూరమునుండియే వెనుకకు మరలిపోవలసినవారు అగుదురు. తావే దొరకనప్పుడు వారు ఇంకేమి చేయగలరు?

రోమరోమమునందు హరి రమించియుండ ఇతరమునకు అక్కడ ఆవంతయైన తావు ఎట్టులుండును అని యన్నాడు ఒక కవి.

మనస్సుయొక్క శెలవు లేనప్పుడు పాపము! కన్నులు ఎవరిని లేక దేనిని చూడగలవు? ఎందును ఎవ్వరును. ఏమియు గానరాకున్నపుడు వారిని లేక దానిని పడయవలెనన్న యుత్సాహమెట్లు కలుగును?

మరియొక్క విషయము. - మానవునకు సుఖాపేక్ష ఏమైన కలిగినప్పుడు కదా ఉత్సాహము ఉదయించునది. సమస్త సుఖముల భాండారమే తన చెంత నున్నవేళ క్షుద్రసుఖములకై యుత్సాహము ఎట్లు జనించును? కాబట్టి పాఠకులారా! గుర్తు ఉంచుకొనుడు! ప్రేమోత్సాహ మూర్తులు అనదగు ప్రేమిభక్తులైన పురుషులలో లౌకికకార్యముల యెడల, విషయముల యెడల ఉత్సాహము ఇసుమంతయు గానరాదు. వారికి అట్టివానియందు అభిరుచియే యుండదు.

భగవానుడు స్వయముగా చెప్పియున్నాడు -

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః (గీత 12/17)

'ఎన్నడు హర్షమును పొందనివాడు, ఎవరిని ద్వేషింపనివాడు, ఎందులకును శోకింపనివాడు, ఏమియు గాంక్షింపనివాడు, శుభమును, అశుభమును కూడ వీడినవాడు ఎవడో అట్టి భక్తియుక్తుడైన పురుషుడు నాకు ఎంతయో ఇష్టుడు.'

**''యజ్జ్ఞాత్వా మత్తో భవతి స్తబ్ధో భవతి ఆత్మారామో భవతి.'' (6)**

ఆ (పరమ ప్రేమ స్వరూపమైన) భక్తిని తెలిసికొని మానవుడు ఉన్మత్తుడగును. స్తబ్ధుడు అనగా శాంతుడగును. ఆత్మారాముడగును.

తనలో భగవత్ప్రేమ ప్రకటమైనంతనే మానవుడు పిచ్చివాడైపోవును. కాబట్టి భగవద్భక్తుడు నిరంతరము ప్రేమావేశపారవశ్యమునందు మునిగియుండి, రేయనక పవలనక, తన స్వామి గుణములను గానము చేయుచు, ఆలకించుచు, చింతనము చేయుచు కాలము బుచ్చుచుండును.

అతనికి ఇతరములైన బాహ్యవిషయముల స్ఫురణమైన ఉండదు. లోకములో పిచ్చివాడు ఎట్లు ప్రలపించుచుండునో అట్లే ప్రేమోన్మత్తుడైన యా భక్తుడు కూడ తన ప్రభుని చర్చయందు తల్లీనుడైయుండును. ఏలయనగా అట్లుండుటయే అతని మనమునకు రుచించును. ఈ విషయమున భాగవతము ఏమనుచున్నదో చూడుడు! -

శృణ్వన్ సుభద్రాణి రథాంగపాణే
ర్జన్మాని కర్మాణి చ యాని లోకే
గీతాని నామాని తదర్థకాని
గాయన్ విలజ్జో విచరేదసంగః.
ఏవంవ్రతః స్వప్రియనామకీర్త్యా
జాతానురాగో ద్రుతచిత్త ఉచ్చైః
హసత్యథో రోదితి రౌతి గాయ
త్యున్మాదవన్నృత్యతి లోకబాహ్యః. **(11/2/39-40)**

''భక్తుడైనవాడు చక్రహస్తుడైన భగవానుని కల్యాణకారకములు, లోకప్రసిద్ధములు అయిన జన్మములను, కర్మములను ఆలకించుచు, తదనుసారముగా పేర్కొనబడిన నామములను సిగ్గు వీడి బిగ్గరగా గానము చేయుచు, లోకమునందు ఆసక్తి లేనివాడై చరించుచుండును. తన్మూలమున అతనిలో తన ప్రభునిపై గాఢమైన ప్రేమ నిలచును. ఆ ప్రేమ కారణముగా అతడు ద్రవీభూతచిత్తుడై యున్మత్తుడగును. ఆ దశలో అతడు ఒకప్పుడు కిలకిల నవ్వును. ఒకప్పుడు ఏడ్చును. ఒకప్పుడు అరచును. ఒకప్పుడు బిగ్గరగా గానము చేయును. ఒకప్పుడు నృత్యము చేయును.''

ఈ విధముగా ప్రవర్తిల్లుచు ఆ ప్రేమిభక్తుడు ఆనందభరితుడై యొకప్పుడు మౌనము వహించి, శాంతముగా కూర్చుండిపోవును. ఈ స్తబ్ధత్వము అతడు పూర్ణకాముడని చెప్పక చెప్పుచుండును. ప్రభువు

యొక్క మూర్తి హృదయములో ప్రకటమగుటయే తడవుగా అతడు తద్రూపమాధుర్యమును గ్రోలుచు ఆనందమగ్నుడై ధ్యానమగ్నత చెందును.

సుతీక్ష్ణుని దశను వర్ణించుచు తులసీదాసు ఇట్లనెను - 'పులకాంకురములతో నిండిన శరీరము పనస ఫలమును దలపించుచుండగా ఆ మహర్షి మార్గమధ్యమందు నిశ్చలముగా నిలిచిపోయెను.''

నృత్యము చేయుచు భగవంతుని ఎదలో నిలిపిన భక్తునకు ఇట్టి దశ ప్రాప్తించును. అతని శరీరము, చిత్తమును సర్వవిధముల స్తబ్ధమై శాంతమైపోవును. అతని యాత్మ యానందమయము అయిపోవును. దీనినే యాత్మారామస్థితి యందురు. ఈ స్థితియందు విషయతృష్ణ ఎందును ఆవంతయు ఉండదు అని ''నహి స్వాత్మారామం విషయమృగతృష్ణా భ్రమయతి'' అన్న శ్లోకపంక్తి తెలుపుచున్నది.

అట్టి భక్తునియందు ఇతరముల పరిజ్ఞానము (తలపు) ఇసుమంతయు నుండదు. ఇదియే ప్రేమాద్వైతస్థితి. ఇదియే రసాద్వైతస్థితి. ఇట్లు ప్రియతమునితోడ ఏకత్వమును పొందిన భక్తునకు ఆ స్వామికంటె భిన్నముగా అస్తిత్వము ఏదియు నుండదు. అది తొలగిపోవును.



# ప్రేమయందు అనన్యభావము

## ''సా న కామయమానా నిరోధరూపత్వాత్'' (7)

అది (ప్రేమభక్తి) కామనాయుక్తమైనది కాదు. ఏలయనగా అది నిరోధరూపమైనది.

ఈ భగవద్భక్తి సర్వవిధముల త్యాగస్వరూపమగునట్టిది. ఇందు ధనము సంతానము, కీర్తి, స్వర్గము మున్నగువాని మాట యటుండ, మోక్షము కూడ అపేక్షింపబడదు. ఏ భక్తికి బదులుగా ఏమైన కోరుట సంభవమగునో, ఏమైన పడయవలెనన్న యాశకు, ఆకాంక్షకు తావుండునో అది కామనాయుక్తమైనది. అది స్వార్థవ్యవహార మగునట్టిది. ప్రేమభక్తి మార్గమును అవలంబించిన భక్తుడు తన ప్రియతముడైన భగవానుని దక్క, అతని సేవను దక్క ఇతర మేదియు కోరనే కోరడు. శ్రీమద్భాగవతములో కపిలదేవుడు ఏమనెనో యెరుగుదురా? ''నన్ను ప్రేమించు భక్తులు నా సేవను దక్క నేను వారికి పంచవిధముక్తులను ఇచ్చెద నన్నను స్వీకరించుటకు ఇచ్ఛగింపరు.'' (పంచవిధముక్తులు అనగా 1. సాలోక్యము - భగవానునితో సమానమైన లోకములో నివసించు భాగ్యము. 2. సార్ష్టి - భగవానునితో సమానమైన యైశ్వర్యప్రాప్తి. 3. సామీప్యము - భగవానుని చెంత నుండగలుగునట్టి భాగ్యము. 4.సారూప్యముక్తి - భగవానునితో సమానమైన రూపమును పడయునట్టి భాగ్యము. 5. సాయుజ్యము - భగవానునియందు లయమందుట.) యథార్థమైన భక్తి యుదయించినప్పుడు మానవునియందు గల కోరికలు ఎల్ల అంతరించిపోవును. ఏలయనగా ఆ భక్తి నిరోధస్వరూప మగునట్టిది. అనగా త్యాగమయమైనది. ఆ నిరోధము ఏది యనగా? -

''నిరోధస్తు లోకవేదవ్యాపారన్యాసః'' (8)

లౌకికములు, వైదికములు నగు (సమస్త) కర్మల పరిత్యాగము నిరోధ మనబడును.

ప్రేమభక్తి మార్గమందు ఈ కర్మ పరిత్యాగము తనయంత తానుగా అప్రయత్నముగానే సాగును. ప్రేమోన్మత్తుడైన భక్తుడు తన ప్రియతమదైవతమును దక్క అన్యమేదియు నెరుగకుండును. అతని మనస్సు సర్వదా శ్రీకృష్ణాకారమై (ఇష్టదేవతాకారమై) యుండును. అతని కన్నుల ముందు సర్వదా సర్వత్ర అతని ప్రియతమదైవతము యొక్క శోభ, తాండవించుచుండును. ఇతర పదార్థముల మీద అతని మనస్సు సంసక్తము కాదు. గోపికలు భగవంతునితో ఏమన్నారో చూడుడు!

చిత్తం సుఖేన భవతాపహృతం గృహేషు
యన్నిర్విశత్యుత కరావపి గృహ్యకృత్యే
పాదౌ పదం న చలతస్తవ పాదమూలా
ద్యామః కథం వ్రజమథో కరవామ కిం వా.

(శ్రీమద్భా. 10/29/34)

''ఓ ప్రియతమా! సానందముగా గృహకృత్యములందు సంసక్తమైయున్న మా చిత్తమును నీవు హరించివైచితివి. గృహకృత్యములందు సంలగ్నములై యుండునట్టి మా చేతులు కూడ చేష్టలుడిగి యూరకున్నవి. మా పాదములు కూడ నీ చరణకమలములను వీడి ఒక్కయడుగైన తొలగుటకు ఇచ్చగించుట లేదు. ఇప్పుడు మేము మా యిండ్లకు ఎట్లు వెడలుదుము? వెడలి యేమి చేయుదము?''

తన మనఃఫలకముపై అంకితమైయున్న జగచ్చిత్రము చెరిగిపోవుట కారణముగా ఆ భక్తుడు ఇక లౌకికములు (స్మార్తక్రియలు) వైదికములు

అగు (శ్రుతిసంబంధమైన) కర్మలను ఆచరించుటకు అర్హుడుగా నుండడు. ఈ కారణమున ఆ క్రియాకలాపమంతయు తనయంత తానుగా అతనిని వీడిపోవును. సుందరదాసు ఇట్టి ప్రేమిభక్తుని దశను వర్ణించుచు ఏమనెనో చూడుడు! -

"అతనికి మూడులోకములవారు ఏమనుకొందురో యన్న సిగ్గు, శంక ఉండవు. వేదోక్త కర్మలను అతడు ఆచరించుటకు ఇచ్ఛగింపడు. అతనికి భూతప్రేతముల భయము యుండదు. అతడు దేవతలకును, యక్షులకును వెరవడు. ఇతర ప్రసంగము లేవియు చెవిని బెట్టడు. ఇతర మేదియు చూడగోరడు. ఇతర ప్రసంగము లేవియు పలుకడు. ఇది ప్రేమ ప్రధానమైన ఉత్తమ భక్తిప్రకారము.

ఒకప్పుడు అతడు నవ్వుచు నృత్యము చేయును. ఒకప్పుడు రోదనము చేయ నారంభించును. ఒకప్పుడు కంఠము గద్గదిక వహింపగా అతడు మాటలాడలేకపోవును. ఒక తటి హృదయము ద్రవించిపోవగా గొంతు ఎత్తి బిగ్గరగా గానము చేయమొదలిడును. వేరొక సమయమందు నోరు మూసికొని మౌనము వహించి యాకాశమువలె శూన్యముగా నుండి పోవును. అతని చిత్తవిత్తము శ్రీహరియందు లగ్నమైపోయి యుండును. ఇక అతడు ఏ విషయమందైన సావధానత నెట్లు వహింపగలుగను?"

"తస్మిన్ననన్యతా తద్విరోధిషూదాసీనతా చ." (9)

ఆ ప్రియతము భగవానుని యెడల అనన్యభావము గలిగి యుండుటయు, తత్ప్రతికూల విషయములందు ఉదాసీనత వహించుటయు కూడ నిరోధమే యనబడును.

బాహ్యజ్ఞానము ఉన్న దశలో ప్రేమిభక్తుడు తన ప్రియతముడైన భగవంతుని యెడల అనన్యభావము కలిగియుండుచు తత్ప్రతికూలకర్మల

యెడల సర్వవిధముల ఉదాసీనుడై యుండిపోవును. ఈ విధముగా సావధానముగా కర్మలు నిర్వర్తించుట కూడ నిరోధమనబడును. ప్రేమిభక్తుడు చేయు ప్రతి క్రియయు అతని ప్రియతమునకు అనుకూలమైనదే యగును. అందు అనన్యభావముతో ఆ ప్రియతమునే సేవింపవలెనన్న భావన ఇమిడియుండును. ప్రతికూలక్రియ యేదియు అతని వలన జరగనే జరగదు. సూర్యుడు ఉన్నచోట అంధకారము నిలుచునా? అమృతము వలన మృత్యువు సంభవించునా?

''అన్యాశ్రయాణాం త్యాగోఽనన్యతా.'' (10)

(తన ప్రియతమ దైవతము యొక్క ఆశ్రయమొక్కటి దక్క) ఇతరములైన యాశ్రయముల నన్నిటిని విడనాడుటయే అనన్యభావ మనబడును.

ప్రేమిభక్తుని హృదయములో తనకు ప్రియతముడగు భగవానునకు ఒక్కనికి దక్క అన్యమునకు దేనికైన తావుండునని ఊహింపనైనజాలడు. అట్టియెడ అతడు అన్యమునెట్లు భజించును? అతడు ఈ చరాచరవిశ్వము నంతను తన ప్రియతమదైవతము యొక్క శరీరముగా భావించుచుండును. తదన్యము ఏదియు అతనికి ఎందును గానరాదు. -

'ఉత్తమభక్తుని దృష్టిలో లోకములో అతని యిష్టదైవత మొక్కడు దక్క ఇతర పురుషుడు ఎవ్వడును ఉండనే ఉండడు.' (ఒక భక్తకవి)

ఇతర చ్ఛవికి (శోభ, తేజస్సు) దేనికిని ఈషణ్మాత్రము తావుండని విధముగా కన్నులలో ప్రియతమ దైవతము యొక్క ఛవి నిండియుండు స్థితిని వివరించుచు రహీము ఏమనెనో చూడుడు! -

ఆ. కన్నులందు బ్రియుని కాంతి యెల్లెడ నిండ,
నన్య మెట్టులందు నిముడనేర్చు?
పథికభరితమైన పాంథశాలను గాంచి
చనక యున్నె బాటసారి మగిడి?

సర్వత్ర శ్యామమయమైన (శ్యాముడు అనగా కృష్ణుడు. అతడు నల్లనివాడు. కావున శ్యామమయము అనగా నల్లని కాంతితో నిండిన – అని యభిప్రాయము) గోపికల చిత్తవృత్తిని వర్ణించుచు దేవకవి యేమనెనో చూచితిరా? –

"ఆకస్మికముగా అగాధమైన సిరా సముద్రము పొంగి పొరలి వచ్చినది. అందు ఒక్కుమ్మడిగా మూడు లోకములును మునిగిపోయినవి. కాగితములు నల్లనివైనవి. అందు అక్షరములు నల్లనివి. చిత్తము పరిభ్రమించుచుండగా వానిని ఎవరు చదువగలరు? అమావాస్య రాత్రివలె కన్నులందు శ్యామకాంతిమయములైన చీకటులు గ్రమ్మినవి. యమునానదీజలతరంగములందు జంబూనదము యొక్క బిందువులు అలముకొన్నవి. ఏమో తల్లీ! నా మనస్సు నా వశము తప్పి కొరగానిది అయిపోయినది. అది యెల్లఎడల శ్యామవర్ణమయము అయిపోయి, అందు లీనమైపోయినది."

ఎవడైన ఇట్టి భక్తునితో అన్యవిషయమేదియైన ప్రసంగించబోయినను అతడు ఆలకింపడు. ఆ ప్రసంగము అతని చెవుల పడనే పడదు. ఏ యెడనైన ఆలకించుట తప్పని పరిస్థితి యెదురైనను దాని వంకకు అతని మనము ఆకర్షింపబడదు. పరమశివుని యనన్యోపాసకురాలైన పార్వతీదేవికి సప్తమహర్షులును మహాదేవునియందు ఎన్నియో దోషములను ఉగ్గడించి యతని దెసనుండి మనమును మరలించుకొని, సకలశుభగుణసంపన్నుడైన శ్రీమహావిష్ణువునందు లగ్నము గావించుకొమ్మని ప్రబోధము చేసిరి.

అప్పుడు శివప్రేమమయమనోరూపిణి యైన పరమేశ్వరి వారికి ఏమని బదులు చెప్పినదో చూడుడు. –

ఆ. ఋషివరేణ్యులార! యెన్నొ జన్మలనాటి
దెన్న ప్రేమబంధ మిద్ది మాది
ఏను వలతు నా మహేశునే యెటులైన,
కాక నిలిచిపోదు కన్య గాగ.

ఆ. అవగుణాల భవన మయి శివుం, డచ్యుతుం
డగుత మఖిల శుభగుణాలయంబు,
ఏరితో రమించునేరి చిత్తం బెన్న
వారి దెసకె సాగు వారి క్రియయు

ఇట్లే గోపికలు కూడ ఉద్ధవునితో నేమనిరో చూచితిరా? –

సీ. సుధ లొల్కు ద్రాక్షాది శుభఫలంబులు మాని
విషకీటకం బెన్న విసమె మెసవు,
ఎవడైన కర్పూర మిడిన జకోరకం
బది వీడి యంగార మభిలషించు,
వట్టి కొయ్యనె యిల్లు గట్టు తుమ్మెద బద్ధ
మయిపోవు బద్మదళాంతరమున,
పడబోవు దీపంబు పయి నాత్మహిత మందె
కలదంచు శలభంబు తలచి తలచి,

ఆ. భిన్నభిన్న చిత్తవృత్తుల గతు లిట్టి
వరయలేదొ యుద్ధవా! నిజంబు?
నేరి మనము కోరు నేదదే వారిని
దనుపు, నిద్ది 'సూరదాసు' వాణి.

ఈ విధముగా ప్రేమిభక్తుడు కేవలమెుక్క తనప్రియతమ భగవానునే యెరుగును. అతనినే తన సర్వస్వముగా నెంచికొనును. చేపకు నీటివలె అతనికి అతని భగవానుడే పరమాధారమగును. ఆ పరమాశ్రయము కొరకే అతడు అన్నిపనులు నిర్వర్తించును.

'భక్తునకు అతని భగవానుడు ఒక్కడే పరమావలంబము. అతడే అతని బలము. అతడే అతని యాశాకేంద్రము. అతడే అతని విశ్వాసస్థానము. కేవలమెుక్క ఘనశ్యాముడైన శ్రీరాముని వంకకే అతడు చాతకమై చరించును'. (తులసీదాసు)

అతడు చాతకముయెుక్క దీక్షవంటి దీక్ష వహించి కేవలము ఆ తన భగవానుని యందే చిత్తమును లగ్నమొనర్చి, అతనిమీదనే యాధారపడి యుండుచు, అతని కొరకే జీవనధారణము చేయును. ఆ భక్తుని యన్నపానములు, నిద్రాజాగరములు, సంచార పరిభ్రమణములు, ఇచ్చిపుచ్చుకొనుటలు, దానధర్మాదిక క్రియలు సర్వము అతని భగవానుని కొరకే సాగుచుండును. కావున భగవానుని కొరకే సాగించెడు నతని కార్యకలాపమంతయు అనన్య ప్రేమభావసంపన్నమైన కారణమున స్వాభావికముగనే మంగళకరమైనదిగా పరిణతమగును.

**''లోకే వేదేషు తదనుకూలాచరణం తద్విరోధిషూదాసీనతా.'' (11)**

లౌకికములు, వైదికములు నగు కర్మలలో భగవానునకు అనుకూలమైన వానిని ఆచరించుటయే ఆ స్వామికి ప్రతికూలమైన విషయములందు ఉదాసీనతయగును.

అనన్య భావముతో భగవానుని ప్రీతికొరకు కర్మలను ఆచరింపబూనినప్పుడు తత్ప్రతికూలకర్మల పరిత్యాగము స్వయముగనే

సంభవమగును. వైదికమైనది కాని, లౌకికమైనది కాని (శ్రౌతస్మార్తక్రియలు) భగవానునకు ప్రతికూలమైన కర్మయేదియు, తనలోని ప్రేమరూపమగుభక్తిని పెంపొందింపజాలని కర్మ యేదియు అతడు ఆచరింపజాలడు.

తల్లిదండ్రుల యాజ్ఞ తనయునకు, పతి యాజ్ఞ పడతికి, గుర్వాజ్ఞ శిష్యునకు వేదధర్మానుసారముగాను, లోకధర్మానుసారముగాను సర్వవిధముల పాటించుట విధి. కాని యా యాజ్ఞ కూడ భగవత్ప్రేమకు విరుద్ధమైననాడు ఎంత కష్టమైనను భరించి దానిని అనన్యభక్తుడు విసర్జించివేయును. ఏలయనగా అతడు తన ప్రియతమదైవతమునకు ప్రతికూలమైన క్రియ యేదియు నాచరించుటకు ఇష్టపడనేరడు. ఈ విషయమున గోస్వామి తులసీదాసు ఉదాహరణ పూర్వకముగా ఏమనెనో చూచితిరా? –

సీ. భవ్యసీతారామపాదపద్మంబులఁ
గూర్మిమైఁ గొలువంగఁ గోరనట్టి
వారెంతగాఁ గూర్చువారైన వీడంగ
వలయు వారలఁ గోటివైరు లటులు.
జనకుని వీడఁడే మును ప్రహ్లాదుడు,?
భరతుండు మాతను దొరఁగలేదె?,
ఎన్న విభీషణుం డన్నను విడువండె?,
పతుల వీడరె వ్రజవనిత లెల్ల?,

ఆ. పరమభక్తుఁడైన బలిచక్రవర్తి మున్
గొట్టివేయలేదె గురుని మాట?,
అయిన నేమి? వార లందరు లోకక
ల్యాణకరులు గారె యాత్మఁ దలఁప

'ప్రహ్లాదుడు భగవానుని ద్వేషించు తండ్రియొక్క యాజ్ఞను తిరస్కరించినవాడు. విభీషణుడు అన్న సాహచర్యమును వీడినాడు. భరతుడు తల్లి యాజ్ఞను పాలింప నిరాకరించినాడు. బలిచక్రవర్తి తన గురువు శుక్రాచార్యుని మాటను పాటించలేదు. వ్రజవనితలు తమ పతుల యాజ్ఞలను పట్టించుకొనలేదు. అయినను వారు జగత్పూజ్యులు, లోకకల్యాణ కారణభూతులును అయిరి.'

నిత్యకర్మలు, నైమిత్తికకర్మలు, కామ్యకర్మలు, నిషిద్ధకర్మలు నని కర్మలు నాలుగు విధములు. మద్యమాంససేవనము, చౌర్యము, వ్యభిచారము మొదలైనవి నిషిద్ధకర్మలు. వానిని ఎల్లరును పరిహరింప వలసినదే. శాస్త్రీయములైన కామ్య (సకామ) కర్మలు బంధన కారకము లైనవి. అవి జననమరణ చక్రమందు తగుల్కొనజేయునవి కావున ''కామ్యానాం కర్మణాం న్యాసం'' అన్న భగవానుని వచనానుసారము త్యాజ్యములైనవి. ఇక మిగిలినవి లౌకికకర్మలు. వైదికకర్మలును. వీనిని లౌకిక విధానమును, వేదోక్త విధానమును అనుసరించి ఫలాపేక్ష వీడి కేవలము భగవత్ప్రీత్యర్థమై భగవదాజ్ఞానుసారము ఆచరింపవలయును. భగవానుని యెడల అనన్యభక్తిని పెంపొందించునవి యేవో అవియే భగవంతుని కొరకు చేయదగిన కర్మలు అగును. భగవద్గీత చెప్పిన విధముగా ఆసక్తిని, ఫలాపేక్షను వీడి మానసికముగా వాచికముగా కాయికముగా భగవదనుకూలములైన కర్మల నాచరించుచు తత్ప్రతికూలకర్మలను పరిహరించుచుండుటయే విరుద్ధకర్మల యెడల ఉదాసీనత వహించుట యగును. అనన్యభక్తి సంబంధమైన యున్మాదస్థితి ప్రాప్తించనంత వరకు ఆ భక్తుని వలన సహజముగనే భగవదనుకూలములైన కర్మల యాచరణము సాగుచునే యుండును.

''భవతు నిశ్చయదార్ఢ్యాదూర్ధ్వం శాస్త్రరక్షణమ్'' (12)

(మనస్సులో విధి నిషేధములకు అతీతము, అలౌకికమును అయిన ప్రేమను పొందవలెనన్న) దృఢనిశ్చయమైన పిదప కూడ భక్తుడు శాస్త్రమును పరిరక్షించుచునే యుండవలెను. అనగా భగవదనుకూలములైన శాస్త్రోక్తకర్మలను ఆచరించుచునే యుండవలెను.

అనన్యభక్తికి సంబంధించి బాహ్యజ్ఞానశూన్యము, విధినిషేధములకు అతీతమును అయిన సిద్ధావస్థ ప్రాప్తించినప్పుడు లౌకిక, వైదిక కర్మల పరిత్యాగము బుద్ధిపూర్వకముగా కాక, అప్రయత్నముగా స్వయముగనే సంభవమగును.

కాబట్టి భగవత్ప్రేమకు సంబంధించి సర్వమును విస్మరింపజేయునట్టి స్థితి ప్రాప్తించనంత వరకు, ఆ భక్తి పేరుతో శాస్త్రవిహిత కర్మలను ఎన్నడును విసర్జింపరాదు. శాస్త్రానుసారముగా భగవదర్పణబుద్ధితో భగవదనుకూలములైన నిత్య-నైమిత్తిక కర్మలను, శ్రవణకీర్తనాదుల రూపమున భజనమును సాగించుచు సాగించుచు నుండగా, ఒకనాటికి భగవత్సంబంధమైన పరమోన్నత భక్తి ప్రాప్తించగలదు. భగవంతుని ఆజ్ఞ ఇది - చూడుడు.

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి (గీత 16/24)

'కావున నీవు ఏమి చేయవలెను? ఏమి చేయరాదు? అను విషయమున శాస్త్రమే ప్రమాణము అన్న విషయమును గుర్తించి శాస్త్రోక్త విధానమును అనుసరించియే కర్మాచరణము చేయవలెను.'

"అన్యథా పాతిత్యాశంకయా." (13)

అట్లు కాకున్న పతనము సంభవము కావచ్చును.

శాస్త్రము యొక్క ఆదేశములను పాటింపక, తత్ప్రతికూలముగా అమర్యాదిత (నిషేధ) కార్యముల నాచరించుచు, అది యంతయు తనలోని భగవత్ప్రేమ స్వరూపమని చెప్పుచు, దోషములనుండి ముక్తుడు కాగోరు మానవుడు అవశ్యము పతనమును పొందును. భగవానుడే స్వయముగా ఇట్లు చెప్పియున్నాడు. -

యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్
(గీత. 16/23)

'శాస్త్ర విధానమును కాదని త్రోసివైచి యిచ్చవచ్చిన విధముగా వ్యవహారము, ఆచరణము సాగించుకొనువాడు సిద్ధిని గాని, సుఖమును గాని, పరమసుఖమును గాని పొందలేడు.'

బుద్ధిపూర్వకముగా శాస్త్రవిధిని వీడి విహితకర్మలను పరిత్యజించుట భగవత్ప్రేమకు సంబంధించిన యాదర్శము గాదు. అది మోహము, విశృంఖలత్వము. స్వేచ్ఛాప్రవర్తనము. అట్లు చేయువాడు ముందుముందు ఆసురయోనులను, నరకమును, దుఃఖములనే పొందును.

"లోకోఽపి తావదేవ, కింతు భోజనాది వ్యాపారస్తు ఆ శరీరధారణావధి" (14)

సాధారణ లౌకికకర్మాచరణము అంతవరకే (అనగా బాహ్యాజ్ఞానము ఉండునంత వరకు చేయుచునే యుండవలెను.) కాని

భోజనాది అవశ్యక కార్యకలాపము శరీరము ఉండునంత వరకు సాగుచునే యుండును.

వైదికకర్మలను ఆచరించుచునే లౌకికమైన జీవికా నిర్వహణము, గార్హస్థ్య పాలనము మున్నగు కార్యములను కూడ జాగరూకతతోడ భగవదనుకూలమైన విధిని అనుసరించి యాచరించుచుండవలెను. వైదికములు, లౌకికములునగు సర్వకర్మలు విడివడిపోవునట్టి బాహ్యజ్ఞానశూన్యమైన సిద్ధావస్థ యొకటి ప్రాప్తించుట తథ్యమే. (ఇక్కడ బాహ్యజ్ఞానశూన్యమైన సిద్ధావస్థ యనుటను బట్టి దానిని భావసమాధియని భావించుకొనరాదు. ఇది యొక విధముగా భగవత్ప్రేమకు సంబంధించిన పరిపూర్ణ సాఫల్యదశ. ఇందు ప్రేమమయుడైన భగవానుడు ఒక్కడు దక్క 'బాహ్యమైనది' ఏదియు నుండదు. భగవానుడు ఒక్కడు దక్క తద్భిన్నమైన బాహ్యపరిజ్ఞానము పూర్తిగా లోపించిపోయిన మీదటనే యీ విధినిషేధాతీత ఫలస్వరూపమైన స్థితి ప్రాప్తించును.) కాని యీ స్థితి ప్రాప్తించునంత వరకు రెండు విధముల కర్మలను తప్పక యథావిధిగా ఆచరించుచునే యుండవలెను. ఈ స్థితి ప్రాప్తించిన మీదట ఆ కర్మలు వానియంతట నవియే సాధకుని విడిపోవును. కాని యాహారాదివిధులు ఆ దశయందు కూడ నిలిచియే యుండును. కారణము ఏమనగా అవి శరీరధారణమునకు అవశ్యకము. ప్రేమోన్మాదావస్థలో మునిగియున్న భక్తుడు ఆహారాదులకై యెట్టి ప్రయత్నమును చేయడు. అయినను యోగక్షేమవహనకారి యైన భగవానుని విధానమును అనుసరించి అతనికి ఆహారము ప్రాప్తించుచుండును. అవశ్యము అది భగవత్ప్రసాదమే.



## ప్రేమభక్తి యొక్క లక్షణములు - ఉదాహరణములు

''తల్లక్షణాని వాచ్యంతే నానామతభేదాత్'' (15)

ఇప్పుడు వివిధమతములను (అభిప్రాయములను) అనుసరించి భక్తియొక్క లక్షణములు తెలుపబడుచున్నవి.

వేరువేరు ఆచార్యులు భక్తిస్వరూపమును వేరువేరు విధములుగా వివరించియున్నారు. మొదట వానిని వర్ణించి, నారదుడు చివరకు తన యభిప్రాయమును ప్రకటము చేయనెంచుచున్నాడు.

''పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః.'' (16)

పరాశరనందనుడైన వ్యాసమునీంద్రుని యభిప్రాయమును అనుసరించి పూజాదికమందు అనురాగము గలిగియుండుటయే భక్తియగును.

మానవుడు తన తనువును, మనమును, ధనమును భగవానుని పూజాసామగ్రిగా భావించి యత్యంత శ్రద్ధాపూర్వకముగా యథావిధిగా ఆ సామగ్రులతో భగవానుని ప్రతిమను గాని, విశ్వరూప పరమాత్మను గాని పూజించుచుండవలెను. ఎప్పుడు మనస్సు భగవానుని పూజయందు సంలగ్నమగునో అప్పుడు అది తనయంత తానే బంధనకారకములైన లౌకిక విషయముల నుండి తొలగిపోవును. భగవానుని పూజను కాయికముగాను, మానసికముగాను కూడ చేయవలెను. ఆ క్రియవలన భగవానుని పరమపదము ప్రాప్తించును. -

శ్రీవిష్ణో రర్చనం యే తు ప్రకుర్వంతి నరా భువి
తే యాంతి శాశ్వతం విష్ణోరానందం పరమం పదమ్. (విష్ణురహస్య)

'ఈ పుడమి మీద విష్ణుభగవానుని పూజించువారు అతని సనాతనము, ఆనందమయమును ఐన పరమపదమును పొందుదురు.'

''కథాదిష్వితి గర్గః'' (17)

భగవానుని కథాదులయందు అనురాగము కలిగియుండుటయే భక్తియని గర్గాచార్యుడు తెలిపెను.

భగవానుని దివ్యలీలలయందు, మహిమయందు, గుణగానమునందు, నామసంకీర్తనమందు, శ్రవణమందును మనస్సును లగ్నము చేయుట నిస్సందేహముగా భక్తియొక్క ప్రధానలక్షణమే యగును. లోకములో ఎందరో మానవులు భగవానునిగాని, అతని కథలనుగాని పరికించనివారు ఉన్నారు. రేయనక పగలనక విషయ చర్చతోనే వారి కాలము సాగిపోవుచుండును. వారు ఎన్నడును భగవానుని గుణగానము చేయరు. వారికి భగవదభిరుచి యుండదు. వారి చెవులు రామకథ యందు అనురక్తములు కానే కావు. ఇట్టి పరిస్థితిలో ఎవరి మనస్సు భగవద్గుణానువాదమును ఆలకించుటయందు, తెలియజెప్పుటయందు సంలగ్నమై యుండునో వారిని అవశ్యము భగవద్భక్తులనియే యెన్నవలెను. ఈ సూత్రములను రచించిన యాచార్యుడు నారదమహర్షి స్వయముగా వ్యాసభగవానునితో ఇట్లు చెప్పియున్నాడు. -

ఇదం హి పుంసస్తపసః శ్రుతస్య వా
స్విష్టస్య సూక్తస్య చ బుద్ధిదత్తయోః
అవిచ్యుతోఽర్థః కవిభిర్నిరూపితో
యదుత్తమశ్లోకగుణానువర్ణనమ్ (శ్రీమద్భాగ. 1/5/22)

భగవద్గుణానువాద కీర్తనమే తపము వలన, వేదాధ్యయనము వలన, చక్కగా ఆచరింపబడిన యజ్ఞముల వలన, మంత్రముల వలన, జ్ఞానము

వలన, దానముల వలన - ఈ యన్నిటి వలన గలుగు నాశరహితమైన మహాఫలమగునని విద్వాంసులు నిరూపించియున్నారు.

తులసీదాసు ఈ భావమునే చెప్పియున్నాడు. -

తే. కలిమలాండజ తతి దవ్వుగాఁగఁ ద్రోలు
రమ్యకరతాళ మరయ శ్రీరాము గాథ,
భయదభవసింధువును దాట వలతు రేరు
వారి కిది దృఢనావయై వరలుఁ గాదె?

శ్రీరాముని చరిత్రము కలిదోషములను పక్షులన దూరముగా పారఁద్రోల గలుగునట్టి యందమైన కరతాళధ్వని. భయంకరమైన సంసారసాగరమును తరింపనెంచువారికి ఇది దిట్టమైన నావవంటిది.

కాబట్టి హరి చరిత్రములందు వాస్తవికమైన భక్తి గలుగుటయే భక్తి యనబడును. ఈ భక్తివలన నిశ్చయముగా భగవత్ప్రాప్తి కలుగు ననుటలో సందేహము లేదు.

## ''ఆత్మరత్యవిరోధేనేతి శాండిల్యః'' (18)

శాండిల్య మహర్షి యొక్క యభిప్రాయమును అనుసరించి యాత్మరతికి విరుద్ధము కాని విషయమందు అనురాగము కలుగుటయే భక్తియగును.

అవిచ్ఛిన్నముగా శుద్ధాత్మ స్వరూపమందు ఆసక్తుడై యుండుటయే యాత్మరతి యనబడును. ఈ యాత్మరతియందు నిత్యము స్థిరముగా నుండుటనే అవ్యక్తోపాసకులు భక్తియందురు. ఆదిశంకరాచార్యులు అన్నమాట చూడుడు. -

మోక్షకారణ సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ
స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే. (వివేక. 32)

ఆత్మ రూపముగా ప్రతిప్రాణియందు భగవానుడే విరాజిల్లుచున్నాడు. కాబట్టి యా సర్వాత్మునియందు రతి కలిగియుండుటయే వాస్తవముగా భగవద్భక్తి యనబడును. ఇట్టి భక్తిమార్గమును అవలంబించిన వారికి ముక్తి ప్రాప్తించుననుటలో ఆవంతయు సందేహము లేదు.

''నారదస్తు తదర్పితాఖిలాచారితా తద్విస్మరణే పరమవ్యాకులతేతి.'' **(19)**

కాని దేవర్షి నారదుని యభిప్రాయము ననుసరించి మానవుడు తన సమస్త కర్మలను భగవదర్పణము గావించుటయు, ఏ కొంచెము భగవద్విస్మృతి కలిగినను పరమవ్యాకులత చెందుటయు భక్తి యని పేర్కొనబడును.

నారదునకు వ్యాసమహర్షియు, గర్గాచార్యుడును, శాండిల్యుడును తెలిపిన భక్తిలక్షణములతో విభేదము ఏదియును లేదు. భగవానుని పూజించుటయు, తద్గుణగానము చేయుటయు, సర్వాత్మరూపుడైన భగవానునిపై ప్రేమ కలిగియుండుటయు ఉచితమే ఆవశ్యకమే యనదగును. నారదుడే వ్యాసమునీంద్రుని భగవద్గుణగానమునందు ప్రవర్తిల్లజేసినవాడు. కాబట్టి యీ లక్షణములను ఖండించుటకో, మంచివి కావని తెలుపుటకో కాక, వీనినే మరియింత బలపరచు నుద్దేశ్యముతో నారదుడు ఈ లక్షణములు అన్నియు గలిగి సర్వాంగ పరిపూర్ణమైన భక్తిలక్షణమును నిర్దేశించుచున్నాడు. అది యెట్టిదనగా మనుష్యుడు తన సమస్త కర్మలను (వైదికములు, లౌకికములు) భగవదర్పణము గావించి యఖండరీతిని తన ప్రియతమ భగవానుని స్మరణము చేయుచుండుటయు,

ఒక్కక్షణమైనను తద్విస్మృతి గలిగినచో పరమవ్యాకులత పొందుటయు ననునదియే సర్వలక్షణ సంపన్నమైన భక్తిప్రకారమగును. ఇందు భగవత్పూజాకథాదులయందు అనురాగము, విశ్వాత్ముడైన భగవానునియందు రతియను నంశములు ఎట్లును ఇమిడియే యుండును. భగవంతుడు భగవద్గీతలో లోకములో ఎన్ని ప్రకారముల యోగులు ఉందురో వారందరియందును ఈ లక్షణములు గలయోగినే సర్వోత్తమునిగా పేర్కొని యున్నాడు. -

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున.
యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః.
**(6/46-47)**

'తపస్వులకంటెను, శాస్త్రజ్ఞానము గలవారికంటెను, సకామముగా కర్మాచరణముచేయువారి కంటెను యోగి శ్రేష్ఠుడు. కావున ఓ యర్జునా! నీవు యోగివి గమ్ము! నా అభిప్రాయమును అనుసరించి ఎల్లరు యోగులయందును భక్తియోగి పరమోత్తముడు. ఏలయనగా అతడు శ్రద్ధావంతుడై తన యంతరాత్మను నాయందే లగ్నమొనర్చి నిరంతరము నన్నే భజించుచుండును.'

భగవానుని యాదేశమే మరియొకటి యున్నది. -

తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ
మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్య స్యసంశయమ్. **(గీత. 8/7)**

కావున ఓ యర్జునా! నీవు సర్వసమయములందు (నిర్విరామముగా) నన్ను స్మరించుచుండుము! (అట్లు స్మరించుచునే నా కొరకే) యుద్ధము

చేయుము! ఇట్లు నాయందే బుద్ధిని, మనస్సును అర్పించి చరించుచుందువేని నిస్సందేహముగా నీవు నన్నే పొందగలవు.

మానావమానములు, లాభనష్టములు, జయపరాజయములు, సుఖదుఃఖములు మున్నగువానిని లెక్కచేయక ఆసక్తిని ఫలాపేక్షను వీడి, శరీరమందు, లోకమందు అహంకారమమకారములను వర్జించి కేవలమొక్క పరమప్రియతముడైన భగవానునే పరమాశ్రయముగా, పరమగతిగా పరమసుహృదునిగా భావించి, యనన్య భావముతో అత్యంతశ్రద్ధతో ప్రేమపూర్వకముగా నిరంతరము తైలధారాక్రమమున స్వామి యొక్క నామరూపగుణ ప్రభావములను చింతనము చేయు మానవుడు పరమానందమగ్నుడు గావలయును. ఇట్లు చింతనము చేయుచునే అతడు కేవలమొక్క తన పరమప్రియతమ భగవానుని కొరకే, అతని అభిరుచిని, ఇచ్ఛను అనుసరించియే, అతని ప్రీతిని గోరియే, అతనికే సుఖమును గలిగింపవలె నన్న పరమభావమునకు లోబడి, సర్వవిధముల నిస్స్వార్థవృత్తి నవలంబించి దైహికములు, వాచికములు, మానసికములు నగు సమస్తకర్మలను ఆచరించుచుండవలెను. ఏ కారణము చేతనైనను క్షణకాలమైనను ఆ విషయము మరచినవేళ నీటి నుండి వెలికి దీయబడిన చేపకంటె ఎన్నియో రెట్లు అధికమైన వ్యాకులతను అనుభవింపవలెను. ఇది నారదమహర్షి తెలిపిన సర్వోత్కృష్ట భక్తి ప్రకారము.

ఈ విధముగా సంపూర్ణముగా సర్వస్వసమర్పణము గావించిన ప్రేమిభక్తుడు త్రైలోక్యరాజ్య సుఖము మాట యటుండగా అపునరావర్తియైన మోక్షసుఖమును అపేక్షించియైన ఎట్టి పరిస్థితియందును తన ప్రియతమ భగవానుని స్మరణమును విసర్జించుటకు ఇచ్ఛగింపడు. భగవానుడు ఇట్టి భక్తుని ప్రశంసించుచు తన భక్తుడైన ఉద్ధవునితో -

న తథా మే ప్రియతమ ఆత్మయోనిర్న శంకరః
న చ సంకర్షణో న శ్రీర్నైవాత్మా చ యథా భవాన్
నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమదర్శనమ్
అనువ్రజామ్యహం నిత్యం పూయేయేత్యంఘ్రిరేణుభిః
నిష్కించనా మయ్యనురక్త చేతసః
శాంతా మహాంతోఽఖిల జీవవత్సలాః
కామైరనాలబ్ధధియో జుషంతి యత్
తన్నైరపేక్ష్యం న విదుస్సుఖం మమ
(శ్రీమద్భాగ. **11/14/15-17**)

'ఓయి ఉద్ధవా! ఈ విధమైన భక్తుడవు నీవు నాకు ప్రియుడవైనయట్లు అల బ్రహ్మ కాని, శంకరుడు కాని, బలరాముడు కాని, లక్ష్మీదేవి కాని, నాయాత్మకాని నాకు ప్రీతిని గలిగింపరు. ఈ విధముగా ఏ వస్తువును అపేక్షింపక శాంతచిత్తులై నిర్వైరులై సర్వత్ర సమదృష్టితో నన్నే చూచువారై నిరంతరము నన్నే మననము చేయుచుండు ప్రేమిభక్తుల చరణధూళిచేత నన్ను నేను పవిత్రుని గావించికొననెంచి సర్వదా వారి వెంట దిరుగుచుందును. నా యెడల దమ చిత్తమును అనురాగాయత్తము గావించుకొని, నాకు సర్వస్వసమర్పణము చేసికొని యకించనులై, శాంతులై నన్ను బట్టి సమస్త జీవులయందును స్నేహమును ప్రదర్శించువారై, సర్వవిధకామనలను వీడిన హృదయములు గలవారైన మహాత్ములు ఏ పరమసుఖమును అనుభవింతురో ఆ నిరపేక్షమైన పరమానందమును అన్యులు ఎరుగజాలరు.'

నారదుని యభిమతమును అనుసరించి యిదియే భక్తి యనబడును. ఇట్టి భక్తుడు సమస్తాచరణములను భగవదర్పణము గావించి అనవచ్చిన్న క్రమమున భగవత్స్మరణము చేయుచుండును. ఎప్పుడైన ఈషణ్మాత్రమైన తద్విషయము విస్మృతమైనచో అతడు పరమవ్యాకులతను పొందును.

''అస్త్యేవమేవమ్'' (20)

అది యట్లే, అది యుక్తమే

దేవర్షి నారదుడు వెనుకటి సూత్రములో చెప్పిన సిద్ధాంతమును బలపరచనెంచి వాస్తవముగా భక్తిస్వరూప మిదియే యని మరల వక్కాణించుచున్నాడు.

''యథా వ్రజగోపికానామ్.'' (21)

భక్తి వ్రజగోపికల భక్తివంటిది గావలయును.

భక్తియొక్క లక్షణమును వివరించి యిప్పుడు నారదుడు ఉదాహరణముగా నిష్కలంక భక్త శిరోమణులు, ప్రాతస్స్మరణీయలును అయిన గోపికలను పేర్కొనుచున్నాడు. గోపికల మహత్త్వమే యట్టిది. లోకములో వారి ప్రేమతత్త్వమును వర్ణింపగలవాడు ఎవడు? వారి తనువు, మనము, ధనము, ఇహము, పరము సర్వము శ్రీకృష్ణార్పితమే! వారు రేయనక పగలనక సర్వదా శ్రీకృష్ణునే చింతించుచుండువారు. అతని గుణగానమే చేయుచుండువారు. అతనినే సర్వత్ర అవలోకించు చుండువారు. స్వయముగా శ్రీకృష్ణభగవానుడే వారితో ఇట్లనినాడు. –

న పారయేఽహం నిరవద్యసంయుజాం
స్వసాధుకృత్యం విబుధాయుషాపి వః
యా మాభజన్ దుర్జరగేహశృంఖలాః
సంవృశ్చ్య తద్వః ప్రతియాతు సాధునా

(శ్రీమద్భాగ. 10/32/22)

'ఓ గోపికలారా! మీరు నాకై కఠినములైన గార్హస్థ్యపు సంకెలలను త్రెంచివైచి నన్ను భజించితిరి. మీ యీ కార్యము సర్వవిధముల

నిర్దిష్టమైనది. నేను దేవతల యాయువు పర్యంతమైనను మీ యుపకారమునకు బదులు తీర్చజాలను. మీరు స్వయముగా ఉదారత వహించియే నన్ను ఋణవిముక్తుని గావింపుడు!'

ఉద్ధవునకు సందేశ మిచ్చి పంపుచున్నవేళ శ్రీకృష్ణుడు ప్రేమాశ్రువులను ఒలికించుచు గద్గదకంఠుడై అనిన మాట! -

తా మన్మనస్కా మత్ప్రాణా మదర్థే త్యక్తదైహికాః
యే త్యక్తలోకధర్మాశ్చ మదర్థే తాన్ బిభర్మ్యహమ్
మయి తాః ప్రేయసాం ప్రేష్ఠే దూరస్థే గోకులస్త్రియః
స్మరంత్యోఽంగ విముహ్యంతి విరహౌత్కంఠ్య విహ్వలాః
ధారయంత్యతికృచ్ఛ్రేణ ప్రాయః ప్రాణాన్ కథంచన
ప్రత్యాగమనసందేశై ర్వల్లవ్యో మే మదాత్మికాః
(శ్రీమద్భాగ. 10/46/4-6)

'ఓయి ఉద్ధవా! గోపికలు తమ హృదయములను నాకు అర్పించివైచిరి. అట్లు నా కొరకు లౌకిక ధర్మములను అన్నిటిని విసర్జించెడువారు ఎవరో వారికి నేను సుఖము చేకూర్చెదను. ఆ గోపికలు నన్ను ప్రియాతిప్రియునిగా భావించుచున్నారు. నేను దూరముగా నున్న వేళ నన్నే స్మరించుచు దారుణ విరహవేదనకు గురియై దేహజ్ఞానమును కోల్పోవుచున్నారు. నన్ను ఎడబాసిన దశలో వారు అతికష్టము మీద ఎట్లో ప్రాణములు నిలిపికొనుచున్నారు. నేను మరల వ్రజమునకు వచ్చెదనన్న సందేశము మీదనే వారు బ్రతికియున్నారు. నేను ఆ గోపికల యాత్మను. వారు నా వారు.'

ఉద్ధవుడు వ్రజపురమున కరిగి ప్రేమమయస్వరూపిణులైన గోపికల పరిస్థితిని చూచెను. వారికి ఎల్లవంకల లోపల, వెలుపల శ్రీకృష్ణుడే

గోచరించుచుండెను. ఆ స్థితిని ఉద్ధవుడు పరికించెను. అప్పుడు వారు అతనితో నిట్లనిరి. -

'ఉద్ధవా! మా హృదయములలో ఇతరమునకు అవంతయు తావులేదు. అందు నందనందనుడు నిండియున్నాడు. అతడు ఉండగా అందు అన్యవిషయము నెట్లు ప్రవేశపెట్టగలము? పగటి వేళ మేల్కొని యున్నప్పుడు, చూచుచున్నప్పుడు, నడచుచున్నప్పుడు, రేయి నిద్రపోవుచున్న వేళ, స్వప్నావస్థయందు సర్వసమయములందును శ్యామసుందరుని మూర్తి క్షణమైన మా హృదయముల నుండి యిటునటు తొలగకున్నది. ఉద్ధవా! మాకు నీవు ఏవియో కథలు చెప్పెదవేల? లోకలజ్జాభయము కలిగింతువేల? మేము ఏమి చేయుదుము? మా తనువంతయు ప్రేమరసముతో నిరవకాశముగా నింపబడి యున్నది. ఈ ఘటమందు ఆ సముద్రము కూడ ఇముడజాలదు. ఆ శ్యామలగాత్రమేమి? ఆ తామరపూవువంటి ముద్దుమొగమేమి? ఆ లలితలలితమైన గమనమేమి? ఆ మృదు దరహాసమేమి? ఆహా! ఆ మహాసుందరరూపమేమి? దాని కొరకే దప్పికగొని యీ కన్నులు తపించుచున్నవి.'' (సూరదాసు)

'ఉద్ధవా! నీవు బోధించు యోగవిద్యకు మేము అర్హులము కాము. మేము అబలలము. జ్ఞానసారమును ఎట్లు తెలిసికొనగలము? ధ్యానప్రక్రియను ఎట్లు అవధరింపగలము. మమ్ము కన్నులు మూసికొమ్మందువు. అందు హరిమూర్తి నిండియుండగా ఎట్లు మూసికొందుము? ఓసి తుమ్మెదా! ఇట్టి మాయమాటలు మాకడ చెప్పవలదు. మేము వినలేకున్నాము. శ్రవణములందు నారబట్టలు చుట్టి జటలను జూటముగా కట్టెదనందువు. ఈ బాధలను ఎవరు భరింతురు? చందనము మాని, ఒడలికి భస్మమును అలదికొమ్మందువు. ఏమి చేయుదుము? విరహాగ్నిలో మేమే భస్మమైతిమి. యోగులు ఎల్లరును ఏ పరమతత్త్వమును తెలియుటకు తెరువుగానక తిరుగాడుచుందురో అది

మా కడనే యున్నది. నిమేషము కాని, క్షణము కాని దాని ఛాయ కూడ మమ్ము వీడుటలేదు. (సూరదాసు)

'గోపికలు ఉద్ధవునితో అన్నమాటల సారాంశము - ఉద్ధవా! శ్యామసుందరునితోడ వియోగము ఏ యెడ నుండునో యచ్చటివారికి నీ యోగమును ప్రబోధింపుము! మాకు వలదు. ఇక్కడ మమ్ము చూచుచున్నావు కదా! ఇక్కడ మాకు సర్వదా సంయోగదశయే కాని వియోగదశ లేదు. మా ప్రియతమ శ్యామసుందరుడు మాతోడనే యున్నాడు.'

వారి పలుకులు విని ఉద్ధవుని కన్నులు తెరచుకొన్నవి. అతడు విశుద్ధము గాఢమునైన గోపికల ప్రేమప్రవాహమందు పరిప్లావితుడైపోయెను.

'గోపికల పలుకులు వినగా ఉద్ధవునకు నియమములన్నియు (యోగమార్గగతములైనవి) విస్మృతములు అయిపోయెను. అతడు గోపాలకృష్ణుని గుణగానము చేయుచు ఉల్లాసముతో లతాకుంజములందు తిరుగాడసాగెను. ఖిన్నుడై గోపికల పాదముల మీద వ్రాలిపోయెను. అతని నియమము లెల్ల సఫలము లయ్యెను. తనయందలి ప్రేమ వర్షిల్లగా పరుగిడి పరుగిడిపోయి బృందావనమందలి ద్రుమములను కౌగిలించికొనసాగెను.'

అప్పుడు అతడు భక్తిప్రణతమానసుడై యిట్లు పలికెను. -

ఏతాః పరం తనుభృతో భువి గోపవధ్వో
గోవింద ఏవ నిఖిలాత్మని రూఢభావాః
వాంఛంతి యద్భవభియో మునయో వయం చ
కిం బ్రహ్మజన్మభిరనంతకథారసస్య.
నాయం శ్రియోఽంగ ఉ నితాంతరతేః ప్రసాదః

స్వర్యోషితాం నలినగంధరుచాం కుతోఽన్యాః
రాసోత్సవేఽస్య భుజదండగృహీతకంఠ
లబ్ధాశిషాం య ఉదగాద్వ్రజవల్లవీనామ్.
ఆసా మహో చరణరేణుజుషామహం స్యాం
బృందావనే కిమపి గుల్మలతౌషధీనామ్
యా దుస్త్యజం స్వజన మార్యపథం చ హిత్వా
భేజుర్ముకుందపదవీం శ్రుతిభిర్విమృగ్యామ్.
(శ్రీమద్భాగ. **10/47/58, 60-61**)

'జగత్తులో ఈ గోపికల జన్మమే ధన్యము. ఏలయనగా వీరి చిత్తము విశ్వాత్ముడైన శ్రీగోవిందభగవానునియందు సంలగ్నమైయున్నది. భవభయభీతులైన మునిజనులు, మేమును కూడ ఆ విశ్వాత్మునే కోరుచున్నవారము. అనంతుని లీలాకథారసరసికులై యుండు వారికి ఇక బ్రాహ్మణజన్మలు (జన్మము, ఉపనయనము, యజ్ఞదీక్ష) మూడింటియొక్కయు ఆవశ్యకమేముండును? రాసలీలాకాలమందు భగవానుడైన శ్రీహరియొక్క భుజదండమును కంఠహారము గావించుకొన్నవారై, పూర్ణకామత్వము పొందిన వ్రజవనితలకు లభించిన ఆ స్వామియొక్క పరమప్రసాదము ఏది ప్రాప్తించినదో అది నిరంతరము ఆ ప్రభుని హృదయమందే వెలుగొందుచున్న లక్ష్మీదేవికి గాని, తామరపూవుయొక్క కాంతివంటి కాంతి, గంధమువంటి గంధమును గలవారగు సురసుందరీమణులకు గాని ప్రాప్తము కాలేదనిన ఇక ఇతరుల విషయము వేరుగా చెప్పవలెనా? ఈ మహాభాగ్యశాలులైన గోపికలు త్యజింప శక్యము గానివారైన బంధుగుల నందరను త్యజించి, ఆర్యధర్మమును ఉజ్జగించి, ముకుంద పదవిని అనుసరించిరి. ఆ పదవి శ్రుతులకు కూడ విమృగ్యమైనట్టిది. ఆహా! ముందుజన్మలో నేను ఈ బృందావనములోని యొక లతనో, ఓషధినో, పొదనో అయ్యెదనేని ఎంత మేలగును? వానిపైని

ఈ గోపికల చరణధూళి పడి నేను ధన్యతను గాంచగలను గదా!'

మధురలోని కులాంగనలు గోపికల దశను వర్ణించి వారి జీవనము ధన్యమని తెలుపుచు అనిన మాటలు!

యా దోహనేఽవహననే మథనోపలేప
ప్రేంఖేంఖనార్భరుదితోక్షణ మార్జనాదౌ
గాయంతి చైన మనురక్తధియోఽశ్రుకంఠ్యో
ధన్యా వ్రజస్త్రియ ఉరుక్రమచిత్తయానాః. (శ్రీమద్భాగ. 10/44/15)

'గోవుల కడ పాలు పిదుకు వేళ, ధాన్యాదికమును దంచువేళ, పెరుగు చిలుకువేళ, వాకిండ్ల నలుకు వేళ, బిడ్డలను ఊయలలయందు ఉంచి యూపువేళ, ఏడ్చుచున్న బిడ్డలను ఊరడింప జోలలు పాడువేళ, వాకిండ్లలో కళ్లాపి చల్లువేళ, చీపురులతో నూడ్చువేళ, కన్నులందు కన్నీరు నింపుకొని, గద్గద కంఠములతో ఏ గోపికలు శ్రీకృష్ణుని గుణగానము చేయుచుందురో, ఆ శ్రీకృష్ణార్పితమానసలైన గోపరమణులు ఎంతయు ధన్యాత్మురాండ్రు.'

ఈ గోపికల మహత్త్వమును ఎంత వర్ణించినను అల్పమేయగును. సర్వత్యాగులైన వ్రజవాసులు అగు భక్తులు తాము గోపికల చరణపంకజధూళి గాగోరిరి.

శ్రీకృష్ణచైతన్య మహాప్రభువువంటి త్యాగధనులైన మహానుభావులు గోపికలనే మధురభక్తి మార్గమున గురువులనుగా స్వీకరించిరి.

ఒక వ్రజవాసి భక్తుడు ఏమనెనో చూడుడు! –

హరిప్రేమభక్తిరససంభరితస్వాంతలైన గోపికలు అందరు స్త్రీలయందును విలక్షణమైనవారు. వీరు కమలనయనుడైన గోవిందునకు ప్రాణమువలె ప్రియమైనవారు. మాత్సర్యరహితులైన సాధుపురుషులయందు

ఈ గోపికలు శిరోమణులు. వీరి ప్రేమప్రవాహము బహు నిర్మలమైనది. వీరి యీ ప్రేమ వెల్లువయందు మర్యాదలు అన్నియును కరగిపోయినవి. మర్యాదలను అన్నిటిని విసర్జించి, కేవలము మోహనుని గుణగానమే చేయువారు వారిలోని ప్రేమభక్తిని ఫలముగా పరమానందమయమైన సుఖమును ఏల పొందకుందురు?

ఏ సాధకులు సర్వవిషయముల యెడల పరమవైరాగ్యమును అవధరించి ప్రేమమార్గమందు ఒకింత ముందడుగు వేయుదురో వారికి మాత్రమే గోపికల ప్రేమమహత్త్వము కొంచెమైనను విదితము గాగలుగును.

''తత్రాపి న మాహాత్మ్యజ్ఞానవిస్మృత్యపవాదః.'' **(22)**

ఈ దశలో కూడ (గోపికలతో) మాహాత్మ్య జ్ఞానము విస్మృతమైన దన్న యపవాదము లేదు.

అనగా గోపికలు శ్రీకృష్ణభగవానుని ప్రభావమును, గుణములను, రహస్యమును ఎరిగియే యుండిరి. ప్రేమయందు మాహాత్మ్యజ్ఞానముండదు. అది యున్నచో ప్రేమ యుండదు అని కొందరు వాదింతురు. కాని గోపికల విషయమట్టిది కాదు. వారు శ్రీకృష్ణభగవానుని సాక్షాత్తు పురుషోత్తమునిగా నెరిగియుండియే తమ ప్రియతమునిగా భావించువారు. లౌకిక ప్రేమకు, భగవత్ప్రేమకు గల ప్రధానభేద మిదియే. నిజమునకు భగవత్ప్రేమయందు ఇట్లే జరుగును. గోపికలు శ్రీకృష్ణుని భగవానునిగా గుర్తింపలేదని వాదించువారు శ్రీమద్భాగవతగతములైన క్రింది శ్లోకములను మననము చేయదగును. –

మైవం విభోఽర్హతి భవాన్ గదితుం నృశంసం
సంత్యజ్య సర్వవిషయాంస్తవ పాదమూలమ్
భక్తా భజస్వ దురవగ్రహ మా త్యజాస్మాన్

దేవో యథాదిపురుషో భజతే ముముక్షూన్.
యత్పత్యపత్య సుహృదా మనువృత్తిరంగ
స్త్రీణాం స్వధర్మ ఇతి ధర్మవిదా త్వయోక్తమ్
అస్త్వేవమేతదుపదేశపదే త్వయీశే
ప్రేష్ఠో భవాంస్తనుభృతాం కిల బంధురాత్మా.
యర్హ్యంబుజాక్ష తవ పాదతలం రమాయా
దత్తక్షణం క్వచిదరణ్యజనప్రియస్య
అస్ప్రాక్ష్మ తత్ప్రభృతి నాన్యసమక్ష మంగ
స్థాతుం త్వయాభిరమితా బత పారయామః.
శ్రీర్యత్పదాంబుజరజశ్చకమే తులస్యా
లబ్ధ్వాపి వక్షసి పదం కిల భృత్యజుష్టమ్
యస్యాస్స్వవీక్షణకృతేఽన్యసురప్రయాస
స్తద్వద్వయం చ తవ పాదరజః ప్రపన్నాః.
**(10/29/31-32, 36-37)**

వ్యక్తం భవాన్ వ్రజభయార్తిహరోఽభిజాతో
దేవో యథాదిపురుషస్సురలోకగోప్తా. **(10/29/41)**

న ఖలు గోపికానందనో భవా
నఖిలదేహినా మంతరాత్మదృక్
విఖనసార్థితో విశ్వగుప్తయే
సఖ ఉదేయివాన్ సాత్వతాం కులే. **(10/31/4)**

'ఓ విభూ! నీవిట్టి కఠోర వచనములు (మరలిపొండు అనునట్టివి) పలుకవలదు. మేము ఇతరవిషయములను అన్నిటిని పూర్తిగా వదలి కేవల మొక్క నీ చరణకమలములనే యాశ్రయించినవారము. ఓ స్వతంత్రవర్తనా! ఆదిపురుషుడగు శ్రీమన్నారాయణుడు ముముక్షువులనుభజించు (తన

యిచ్ఛానుసారము వారిని స్వీకరించు) విధమున నీవు మమ్ము స్వీకరించుము! మమ్ము వీడకుము! ఓ హరీ! నీవు ధర్మమును ఎరుగువాడవు గదా! (మరి మమ్ము మీరు మరలిపోవుదురా?) పతిని, పుత్రులను, బంధుజనులను సేవించుట స్త్రీలకు పరమధర్మమని మాకు ఉపదేశించితివి. కాని యీ ఉపదేశము ఎల్ల ఉపదేశములకును లక్ష్యమై పరమేశ్వరుడవైన నీ విషయముననే చరితార్థమగు గాక! ఏలయన సమస్త దేహధారులకును ప్రియతమబంధుడవు ఆత్మవు నీవే. ఓ కమలలోచనా! లక్ష్మీదేవిని (శ్రీమహావిష్ణు రూపమున) నిరంతరము ఆనందింపజేయు వాడవైన నీ చరణారవిందములను మేమెప్పుడు స్పృశించితిమో, వనవాసులైన తాపసులకు ప్రీతిపాత్రుడవగు నీవు మమ్ము ఎప్పుడు ఆనందింపజేసితివో అప్పటినుండియు మాకు మరియెందును నిలువ గలుగుట యసంభవము అయిపోయినది. దేవతలు సైతము ఎవరి కృపాదృష్టిని పొందుటకై అత్యంతము ఆరాటపడిపోవుచుందురో ఆ లక్ష్మీదేవి అప్రతిద్వంద్వముగా నీ వక్షస్థలమందు స్థానమును పొందియుండియు, తులసి మున్నుగాగల యితర భక్తులచేత సేవింపబడునట్టి నీ చరణముల ధూళిని అపేక్షించుచుండును. అట్లే మేము కూడ నీ చరణధూళిని శరణు పొంద వచ్చినవారము. దేవతలను ఎల్లరను పరిరక్షించునట్టి యాదిపురుషుడవు పరమాత్మవు నగు నీవు వ్రజమండలము భయములను, దుఃఖములను పారద్రోలుటకై ఇక్కడ ప్రకటముగా నవతరించితివి. నీవు కేవలము యశోదాతనయుడవు గావు. సమస్త దేహధారులయందును నెలకొనియుండు నంతరాత్మవు, సాక్షివి. ఓ సఖా! బ్రహ్మదేవుని ప్రార్థనమును అనుసరించియే నీవు ఈ సమస్త జగత్తును రక్షింపగోరి యీ యాదవకులమునందు అవతరించితివి.'

ఇట్టి యనేక ప్రమాణముల చేతను, యుక్తుల చేతను, గోపికలు శ్రీకృష్ణుని సాక్షాత్తు సచ్చిదానందఘనపరబ్రహ్మమని భావించియే యతనికి ఆత్మసమర్పణము గావించికొన్నవారని తెలియగలదు.

''తద్విహీనం జారాణామివ.'' (23)

అట్టి భావన (భగవానునియందు భగవద్భావన) లేనినాడు అవలంబింపబడు ప్రేమ జారుల ప్రేమవంటిదగును.

మాహాత్మ్యజ్ఞానము లేక స్త్రీలు ఒక పురుషుని యెడల వ్యక్తమొనర్చు ప్రేమ జారుల ప్రేమవంటిదేయగును. సర్వస్వ సమర్పణభావము గలిగి లౌకిక స్వార్థగంధము లేశమైన లేకుండునట్టి ప్రేమ కేవలము ఒక్క భగవానుని యెడలనే సంభవమగును. తెలిసియు తెలియని దశలో ఏ విధముగ నైనను భగవంతుని యెడల వ్యక్తము చేయబడిన ప్రేమ కూడ నిష్ఫలము గాదనుకొనుడు! అయినను అంతకంటె తెలిసిన దశలో వ్యక్తము చేయబడిన ప్రేమయందు వైశిష్ట్యముండును. భగవానుడు మా ప్రియతముడు అన్నభావన యందే యపారమైన యానందమున్నదికదా? ఆ భగవానుని పరమప్రియతమునిగా పొందినవారి సుఖము విషయమున ఇక వేరుగా జెప్పవలయునది ఏమి? గోపికలు ఈ పరమ పవిత్రమగు దివ్యానందమునే కోరినవారు. ఈ కారణముననే జీవన్ముక్తుడైన మహాత్ముడు శుకయోగి మరణింప సంసిద్ధుడై యున్న మహారాజునకు పరీక్షిత్తునకు వీరి పవిత్రప్రేమ భరితమగు గాథను వినిపించెను. కావుననే యీ ప్రేమ భగవన్మాహాత్మ్య పరిజ్ఞానముతో కూడిన పరమ పవిత్రప్రేమ అయినది.

''నాస్త్యేవ తస్మింస్తత్సుఖసుఖిత్వమ్.'' (24)

అందు (జారప్రేమయందు) ప్రియతముని సుఖముతో సుఖమును పొందునట్టి లక్షణముండదు.

వ్యభిచారులైనవారు కామప్రవృత్తికి లోబడి కేవలము తమ సుఖమును గోరియే, తమ యింద్రియముల తృప్తిని అపేక్షించియే ప్రేమను వ్యక్తము

చేయుచుందురు. వారు తమ ప్రేమాస్పదుని సుఖముతో సుఖమును పొందరు. గోపికల ప్రేమయందు అట్టి ప్రవృత్తి లేదు. లోకసంబంధమైన కామప్రవృత్తి వలన గలిగిన ప్రీతియందు ప్రేమ స్థానమైన పురుషుడు జారుడగును. అందు శరీరసాంగత్యాపేక్ష యుండును. కాని గోపికల విషయమున అట్లు కాదు. వీరి ప్రేమస్థానము సాక్షాత్తు విశ్వాత్ముడైన భగవానుడు. గోపికల హృదయములలో శరీరసాంగత్యాభిలాష లేదు. వారు కేవలము శ్రీకృష్ణుని సుఖమునే యభిలషించువారు. వారు తమ రూపము, తనువు, మనము, బుద్ధి, యౌవనము, ధనము, ప్రాణము మున్నగువానిని అన్నిటిని తమ ప్రియతముడైన శ్రీకృష్ణభగవానుని పూజాసామగ్రిని గావించినవారు. తమ సర్వస్వమును అర్పించి వారు శ్రీకృష్ణునకు సుఖమును జేకూర్పగోరువారు. శ్రీకృష్ణునకు ప్రసన్నత గలిగించు క్రియ యేదో దాని యాచరణమే వారికి పరమధర్మము. దానియందే వారికి పరమ సుఖానుభూతి గలిగెడిది. ఇది దక్క వారి మనములలో మరియొక విధమైన సుఖాపేక్ష లేశము కూడ లేదు. ఇదియే కామమునకు, ప్రేమకును గల యంతరము. కామప్రవృత్తి యన్యుని వలన సుఖమును పొందగోరునట్టిది. ప్రేమ ప్రవృత్తి తాను స్వయముగా తన ప్రియతముని సుఖమునకై పాటుపడునది. అతడు సుఖవంతుడు కాగా జూచి తాను సుఖించునట్టిది. శ్రీచైతన్య చరితామృతము అను గ్రంథములో గోపీప్రేమతత్త్వమును వివరించుచు ఎంత చక్కగా చెప్పబడినదో చూడుడు.-

''తన యింద్రియముల తృప్తి కొరకైన కాంక్షకు పేరు కామము. శ్రీకృష్ణపరమాత్మయను నింద్రియము యొక్క తృప్తి కొరకైన కాంక్షకు పేరు ప్రేమ (భక్తి). స్వకీయమైన సంభోగసౌఖ్యము మాత్రమే యనుట కామము యొక్క తాత్పర్యము. శ్రీకృష్ణపరమాత్మ యొక్క సుఖమును మాత్రమే ప్రముఖముగా నెంచుట ప్రబల ప్రేమ యొక్క తాత్పర్యము. గోపికలు ఎన్నడు స్వకీయ సుఖదుఃఖములను గూర్చి విచారింపరు. వారు

సర్వవ్యవహారములను శ్రీకృష్ణుని సుఖమును గోరియే చేయుదురు. లోకధర్మములు, వేదధర్మములు, దేహధర్మములు, ఇతరకర్మలు, లజ్జ, ధైర్యము, దేహసుఖము, ఆత్మ (స్వీయ) సుఖము, ఆదిగా సర్వమును త్యజించి, వారు శ్రీకృష్ణుని భజించిరి. కేవలము శ్రీకృష్ణుని సుఖము కొరకే వారు భక్తిరసాస్వాదము గావించిరి. దీనినే శ్రీకృష్ణుని యందలి గాఢానురాగ మందురు. ఇది మరకలులేని స్వచ్ఛమైన ధౌతవస్త్రము వంటిది. కామమునకు, ప్రేమకు ఎంతయో యంతరము ఉన్న కామము అన్నది కటిక చీకటి. ప్రేమయన్నది నిర్మల కాంతిపుంజము. కాబట్టి గోపికాగణమందు కామప్రవృత్తి గంధము లేశమాత్రమును లేదు. శ్రీకృష్ణుని సుఖమును మాత్రమే కోరి వారు అతనితో సంబంధమును గల్పించికొన్నవారు.''

శ్రీకృష్ణపరమాత్మకు సర్వస్వసమర్పణము గావించుట, క్షణమైన విస్మృతి కలిగినప్పుడు పరమ వ్యాకులతను పొందుట, శ్రీకృష్ణుని ప్రభావమునకు, మాహాత్మ్యమునకు సంబంధించిన సమ్యగ్జ్ఞానము గలిగియుండుట, శ్రీకృష్ణుని సుఖముతో సుఖమును పొందుట – అను నీ నాలుగు అంశములే గోపీప్రేమయందు ప్రధానమైనవి.

గోపీప్రేమ పరమపవిత్రము, అలౌకికమునైనది. ఇందు పాపదృష్టి, వ్యభిచారదృక్పథము గలవారిని ఆ శ్రీకృష్ణుడే దయ జూడవలయును.



## ప్రేమభక్తి ఫలస్వరూపిణి

''సా తు కర్మజ్ఞానయోగేభ్యోఽ ప్యధికతరా.'' **(25)**

అది (ప్రేమభక్తి) కర్మమార్గము కంటెను, జ్ఞానమార్గము కంటెను, యోగమార్గమున కంటెను మేలైనది. కర్మమార్గము, జ్ఞానమార్గము, యోగమార్గము అను నీ మూడు మార్గములును భగవత్ప్రాప్తికి సాధనములు. కాని భక్తి యీ మూడింటి కంటెను పరమోత్కృష్టమైనది. ఆ మార్గములందు వర్ణాశ్రమాదుల విచారమున్నది. దానితోపాటు నియమభంగ (పతన) భయము కూడ ఉన్నది. కాని అచ్ఛమైన భక్తియందు భగవానుని సంపూర్ణసహకార మున్నందున ఎట్టి భయమును లేదు. విశేషము ఏమనగా ఇందు స్త్రీలకు, పురుషులకు, బ్రాహ్మణులకు శూద్రాదులకును ఎల్లరకును అధికార మున్నది. గోస్వామి తులసీదాసు ఏమనెనో చూడుడు. -

'ఇట్టి భక్తియొక్క మహత్త్వమును ఎరిగియుండి కూడ దీనిని కాదని త్రోసిపుచ్చి ఎవరు కేవలము జ్ఞానము కొరకు సాధన చేయుదురో ఆ మూఢులు కామధేనువు ఇంటనుండగా దానిని కాదని వీడిపోయి, పాలకై యర్క (జిల్లేడు) వృక్షమును అన్వేషించుచు పరిభ్రమించువారు అగుదురు. ఓయి గరుడా! వినుము! ఈ హరిభక్తిమార్గమును వీడి సుఖము నపేక్షించి యితర మార్గములను అవలంబించువారు శఠులు. వారు ఓడను కాదని వీడి సముద్రమును చేతులతో నీదిపోవ యత్నించువారు అగుదురు.'

ఓ పార్వతీ! 'కేవల మొక్క ప్రేమభక్తి శ్రీరామచంద్రుల పరమానుగ్రహమును సాధించిపెట్టు విధమున యోగము, జపము, దానము, తపము, వివిధ వ్రతములు, యజ్ఞములు, నియమములు నేవియు సాధింపజాలవు. ఓయి గరుడా! వినుము! ఈ మధురభక్తితో సమానమైన

భగవద్భజన ప్రకారము వేరొకటి లేదు. ఈ విషయమును మునులు మారుమారు శ్రీరామగుణగానము చేయుచుందురు.'

స్వయముగా భగవానుడు కూడా ఏమనెనో చూచితిరా? -

న సాధయతి మాం యోగో న సాంఖ్యం ధర్మ ఉద్ధవ!
న స్వాధ్యాయస్తపస్త్యాగో యథా భక్తిర్మమోర్జితా
భక్త్యాహమేకయా గ్రాహ్యః శ్రద్ధయాత్మా ప్రియస్సతామ్
భక్తిః పునాతి మన్నిష్ఠా శ్వపాకానపి సంభవాత్.

**(శ్రీమద్భాగ. 11/14/20-21)**

'నా యందలి దృఢభక్తి (మానవులకు) నన్ను వశమొనర్చు విధముగా, యోగము కాని, జ్ఞానము కాని, స్వాధ్యాయము కాని, ధర్మము కాని, తపము కాని, త్యాగము కాని వశీకరింపజాలవు. సాధుజనులకు ప్రియుడను, ఆత్మస్వరూపుడను అగు నేను కేవలము శ్రద్ధాయుక్తమైన భక్తిచేతనే వశుడ నయ్యెదను. నా యందలి భక్తి చండాలాదులను సైతము పవిత్రము గావింపజాలునట్టిది.' ఇట్లే

నాహం వేదైర్న తపసా న దానేన స చేజ్యయా
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా
భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప! **(11/53-54)**

'ఓయి అర్జునా! ఇప్పుడు నీవు నన్ను చూచిన విధముగా వేదములు, తపములు, దానములు, యజ్ఞములు మున్నగువాని చేత నేను చూడబడను. ఓ పరంతపా! అర్జునా! ఒక్క అనన్యభక్తి వలననే యీ విధముగా నేను చూడబడుటయును, తాత్త్వికముగా తెలిసికొనబడుటయును, నాలో ప్రవేశమును లభించుటయు సంభవమగును.'

''ఫలరూపత్వాత్.'' **(26)**

ఏలయనగా (ఆ భక్తి) ఫలరూపమగునది.

నిజమునకు ఈ భక్తి ఫలరూప మగునది. కాని సాధనముగాదు. భక్తి జ్ఞానసాధనముగా ఎన్నబడిన అది గౌణ (అప్రధాన) భక్తి. అది సాధారణమైన యుపాసనాస్వరూపము. కాని అది అనన్యభక్తి కాదు. ఈ అనన్యభక్తి సమస్త సాధనముల యొక్కయు ఫలరూపమగునది.

ఓ భవానీ! తీర్థయాత్రలు, ఇతర సాధన సముదాయములు, యోగసాధన, వైరాగ్యము, శాస్త్రపరిజ్ఞానము, నానావిధములగు కర్మలు, ధర్మములు వ్రతములు, దానములు, సంయమము, దమము, జపము, తపము, యజ్ఞములు, భూతదయ, బ్రాహ్మణ సేవనము, గురుసేవనము, విద్య, వినయము, వివేకము, మహత్త్వము అని వేదములు ఎన్ని సాధనములను పేర్కొన్నవో ఆ యన్నింటి ఫలము హరిభక్తియే!

''ఈశ్వరస్యాప్యభిమానద్వేషిత్వా ద్దైన్యప్రియత్వా చ్చ.'' **(27)**

ఈశ్వరునకు గూడ అభిమానము నెడల ద్వేషభావమున్నది. దైన్యము నెడల ప్రీతియున్నది.

కర్మమార్గమును, జ్ఞానమార్గమును, యోగమార్గమును అనుసరించి సాధన చేయువారికి తమ బలమునకు, సాధనమునకు సంబంధించిన యభిమాన ముండవచ్చును. భగవానుని పేరే 'దర్పహారి' కదా? నిజమునకు భగవానునకు ఒకని యెడల రాగమును లేదు. ఒకని యెడల ద్వేషమును లేదు. అతని దృష్టికి ఎల్లరును సమానులే. ఆ ప్రభువు ఎల్లరను

ఉద్ధరించువాడు. కాని అతడు ఉద్ధరించుటకు పూను మార్గములు, సాధనములు రకరకములుగా నుండును. ఆ స్వామి యభిమాన పూరితుడైన వానిని దండించి యుద్ధరించును. దీనుడైన సేవకుని తన యక్కున జేర్చుకొని యుద్ధరించును. భగవానుని క్రోధము కూడ వరతుల్యమైన, అభిమానపూరితుడైనవాని యెడల ఆ స్వామి శత్రువువలె లీలను సాగించును. దీనుని యెడల ప్రేమపూరితునివలె లీలను సాగించును. ఈ కారణమువననే ఆ ప్రభువునకు 'దీనజనబాంధవుడు, అశరణశరణ్యుడు, అనాథనాథుడు' అను నామములు ఏర్పడినవి. నిజమునకు అభిమానపూరితుడైనవాని యెడల కూడ ఆ స్వామి హృదయములో ప్రేమయే యుండును. ఆ కారణముననే అతని యభిమానమును హరించివేయును.

తులసీదాసు కూడ ఇదియే చెప్పియున్నాడు. -

'శ్రీరామచంద్రుల సహజమైన స్వభావమును వివరించుచున్నాను. వినుము! ఆ స్వామి తన భక్తునియందును అభిమానమును నిలువనీయడు. ఈ యభిమానము సంసారమునకు మూలకారణము. నానావిధములగు బాధలను గలిగించునది. సర్వవిధముల దుఃఖములను అనుభవింపజేయునది. ఆ కారణముననే కరుణానిధి యైన యా మహాప్రభువు తన సేవకులపై విశేషముగా మమకారము చూపి వారిలోని యభిమాన దోషమును తొలగించును.'

ఇంతయైనను, దండనమందు ద్వేషము గోచరించుచునే యుండును. కాని దీనుడు, అభిమానరహితుడు నగు జనుని మాత్రము ఆ స్వామి అక్కుననే చేర్చుకొనును. వాని కార్యము ఎంత యల్పమైనదైనను చేయుటకు సంకోచింపడు. భక్తులు తమను సహజముగనే కింకరులనుగా భావించికొందురు. వారు ఏమందురన్న -

సర్వసాధనహీనస్య పరాధీనస్య సర్వథా
పాపపీనస్య దీనస్య కృష్ణ ఏవ గతిర్మమ

'ఓ ప్రభూ! శ్రీకృష్ణా! నేను ఎట్టి సాధనములు లేనివాడను. సర్వవిధముల మాయకు లోబడిపోయినవాడను. పాపభారవముతో క్రుంగిపోవుచున్న దీనుడను. నాకు నీవే గతి. నీవే శరణువువు.'

'దేవా! నీ చరణకమలములను వీడి యెందు పోయెదను? లోకములో పతితపావనుడు అన్న బిరుదము నీకు గాక మరి ఎవ్వరి కున్నది? అతి దీనులైనవారి యెడల నీవు గాక, మరి యెవ్వరు ప్రీతిని ప్రదర్శింతురు?'

మానవుడు ధనము, గౌరవము, వైభవము మున్నగువాని కొరకు వెంపరలాడుచుండునో అట్టి స్థితిని దీనత్వముగా భావించికొనరాదు. అభిమాన రాహిత్యమునకు, అహంకార శూన్యత్వమునకు పేరు యీ దీనత్వము. ఇది మహామహావైభవశాలులైన సమ్రాట్టులకు సైతము భగవదనుగ్రహము వలన ప్రాప్తించునట్టిది. అభిమానము, కర్తృత్వాహంకారమును నశించుటయే దీనత్వము యొక్క తాత్పర్యము. నేను, నాది యన్నది ఏమియును లేదు. ఉన్నదెల్ల ఆ భగవానునిదే. సర్వము ఆ భగవానుడే. సర్వము అతని శక్తివలననే, ప్రేరణ కారణముగానే సాగుచుండును. కర్త, కారయిత కూడ అతడే యను నిట్టి భావననే యీ దీనత్వము యొక్క ఉద్దేశ్యము.

కాని భగవంతునకు అత్యంత ప్రీతికారణమైన యీ దీనత్వము అంత సులభముగా ప్రాప్తించునట్టిది కాదు. అభిమానమను దయ్యము వదలిన గాని యాదీనత్వము ప్రాప్తము కాదు. వర్ణము, జాతి, ధనము, గౌరవము, విద్య, సాధనము, ఆరోగ్యము మున్నగువాని వలన గలిగిన యభిమానము, కర్తృత్వాహంకారము మానవుని యందు అట్టి దీనత్వమును

ఉదయింపనీయవు. పైకి మాత్రము మానవుడు డాంబికపు దీనత్వమును ప్రకటించును. భగవానుని యెదుట తాను దీనుడనగును. దుఃఖమును ప్రదర్శించును. కాని గొప్ప గొప్ప లౌకిక సంపదలు, సాధనములు ప్రాప్తించు విషయమున కూడ అతని యందు స్వభావసిద్ధమైన దైన్యము యథాతథముగా నిలిచియున్న దశయందే భగవానుని ముందు అతడు వెల్లడించు దీనత్వము పరికించబడును. పలువురు జనుల సమక్షమున వారు తనను 'ఇతడు దీనుడు, పాపి' యని తెగడినప్పుడు కేవలము ఓరిమి వహించి యూరకుండుటయే కాక, వారి మాటలను సత్యమని తలచి ప్రసన్నతచెందు వానివలె నుండువాడు ప్రభువు యొక్క ప్రాప్తికై మనములో నిరంతరము ఆరాటపడువాడు అగు ఇట్టి దీనులే భగవానునకు అత్యంత ప్రీతిపాత్రులు అగుదురు. అచ్చమైన భక్తియందు తన పురుషార్థమునకు సంబంధించి కాని, సాధనమునకు సంబంధించి కాని యభిమానమన్నది రానే రాదు. కావున భక్తిమార్గమే ఉత్తమమైనది.

"తస్యా జ్ఞానమేవ సాధనమిత్యేకే." **(28)**

దానికి (ఆ భక్తికి) జ్ఞానమే సాధన మన్నది కొందరు (ఆచార్యుల) యభిప్రాయము.

భక్తియందు ఈ విధమైన జ్ఞానమునకు అత్యంతావశ్యకత యున్నది. అది యెట్టిదనగా - నేను ఎవరి యెడల భక్తి గలిగి యున్నానో అతడే సర్వమునకు స్వామి. సర్వాధారభూతుడు, సర్వేశ్వరుడు, జగదుత్పత్తి స్థితిలయకరుడు, మాయాధిపతి, జన్మరహితుడు, నాశరహితుడు, సర్వశక్తియుక్తుడు, సర్వజ్ఞుడు, సర్వాత్ముడు, నిర్గుణుడు, నిర్వికారుడు, నిరాకారుడు, సగుణుడు, సాకారుడు. ఆ భగవంతుని కన్న మిన్నయని యెన్నదగువాడు వేరెవ్వడును లేడు. ఈ మాత్రపు జ్ఞానము కూడ

లేనినాడు శ్రద్ధయన్నది గలుగదు. అది కలుగనినాడు ప్రీతి జనింపదు. అది జనింపక భక్తి యలవడనేరదు.

తులసీదాసు కూడ ఈ భావములనే వ్యక్తమొనర్చెను. -

ఎరుకలేక కల్గునెట్లు ప్రత్యయబుద్ధి?
యదియు లేక ప్రీతి యబ్బు నెట్టు,
లదియు లేక యెట్టు లలవడు దృఢభక్తి?
నీట చిక్కదనము నిలుపవశమె?

కాని యిందు అద్వైత జ్ఞానము యొక్క యావశ్యకము లేదు. కేవలము శ్రద్ధవలన, భావన వలననే యీ భక్తి ప్రాప్తించును. గరుత్మంతుడు, గజేంద్రుడు, ధ్రువుడు, శబరి మున్నగువారు కేవలము భగవానుని యెడల ఇట్టి భక్తినే అలవరచుకొని యా స్వామిని పొందగలిగిరి.

''అన్యోన్యాశ్రయత్వ మిత్యన్యే.'' **(29)**

భక్తి, జ్ఞానము అనునవి పరస్పరాశ్రితములైనవి యన్నది మరికొందరి ఆచార్యుల యభిప్రాయము.

గౌణభక్తి వలన కూడ భగవత్తత్త్వ పరిజ్ఞానము కలుగుటయు, తన్మూలమున భగవానుని యెడల ప్రేమ జనించుటయు కూడ సంభవమగుచుండును. కాని కేవలము భక్తినే యభిలషించువారు ఈ యభిప్రాయమునకు అంతగా ప్రాధాన్యమీయరు. కారణము ఏమన్న నిర్మలప్రేమ రూపమైన భక్తి పూర్తిగా ఉదయించినప్పుడు జ్ఞానము దానిని విడిచి భిన్నముగా నుండనేరదని వారు ఎరుగుదురు. ప్రేమించువాడు, ప్రేమింపబడువాడు - ఇరువురును ఒక్కటియైపోదురు. ఇక అప్పుడు దేని జ్ఞానము ఎవరికి కలుగవలయును?

"స్వయం ఫలరూపతేతి బ్రహ్మకుమారాః" (30)

బ్రహ్మకుమారుల (సనత్కుమారాదులు, నారదుడును) యభిప్రాయమును అనుసరించి భక్తి తానే ఫలస్వరూపమైనట్టిది.

కావుననే యీ భక్తి సాధనమును, సాధ్యమును అయినది. మూలమును అదియే, ఫలమును అదియే. భక్తులు భక్తి కొరకే భక్తిని అలవరచుకొందురు. కారణము ఏమనిన భక్తి తానే ఫలస్వరూపమయినది. అది యే సాధనము వలనను ప్రాప్తించునదియు గాదు, దానికన్న మిన్నయని యెన్నదగిన వస్తువు ఏదియును లేదు. అట్టి వస్తువును పొందజేయుటకు అది సాధనమును గాదు.

"అది స్వతంత్రమైనది. దానికి వేరుగా ఆలంబ మేదియును లేదు. జ్ఞానము, విజ్ఞానము సర్వము దాని యధీనమందే యుండును."

"రాజగృగభోజనాదిషు తథైవ దృష్టత్వాత్." (31)

రాజగృహము, భోజనము మున్నగువానియందు ఇట్లే చూడబడుచున్నది.

ఇది ముందు చెప్పబడిన భక్తియొక్క ఫలరూపత్వమును తెల్లమొనర్చుటకు చెప్పబడిన యుదాహరణము.

"న తేన రాజపరితోషః క్షుధాశాంతిర్వా." (32)

దానివలన (తెలిసికొన్నంత మాత్రమున) రాజునకు సంతోషము గలుగదు. ఆకలి తీరదు.

కేవలము రాజభవనము యొక్క వర్ణనమును ఆలకించినంత మాత్రమున, దానిని గూర్చి తెలిసికొన్నంత మాత్రమున ప్రయోజన

వేదియు నుండదు. రాజు ధర్మాత్ముడు, శక్తిశాలి. ప్రజాక్షేమము గోరువాడు. తగిన రూపగుణసంపద గలవాడు అని కూడ తెలిసికొందుము. కాని ప్రయోజనమేమి? ఈ విషయములను ఇట్లు తెలిసికొన్నంత మాత్రమున రాజునకు పరితోషము గలుగునా? ఇట్లే హల్వా తీయగా నుండును, అది నేతితో చక్కెరతో చేయబడును, చాలా రుచిగా నుండును అని తెలిసికొందుము. కాని యా తెలివి వలన మన క్షుద్బాధ తొలగునా? కాదు. ఇట్లే కేవల శబ్దజ్ఞానము వలన భగవానునకు ప్రసన్నత గలుగదు. మనకు ప్రశాంతియు లభించదు. భగవానుని దృష్టిలో అందరును సమానులే. అయినను ఆ స్వామి యొక్క అనుగ్రహము భక్తి వలననే ప్రాప్తించును. అతడు స్వయముగనే చెప్పియున్నాడు –

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్
(గీత. **9/29**)

'సర్వభూతములయందును నేను సమదృష్టి గలవాడను. నాకు ద్వేష్యుడును లేడు. ప్రీతిపాత్రుడును లేడు. అయినను నన్ను భక్తిపూర్వకముగా ఎవరు భజింతురో వారియందు నేనుందును. నాయందు వారుందురు.'

''తస్మాత్సైవ గ్రాహ్యా ముముక్షుభిః.'' **(33)**

కాబట్టి (సంసారబంధనము నుండి) ముక్తిని పొందగోరువారు భక్తినే గ్రహింపవలయును.

భక్తివలన భవబంధనము అనాయాసముగా విచ్ఛిన్నము గాగలదు. సాక్షాత్తు భగవానుడు భక్తునకు ప్రేమస్థానీయుడై యతనితోడ దివ్యలీలలను సాగించును.

"కైవల్య మనబడు పరమపదము అత్యంత దుర్లభమైనదని సాధుజనులు, పురాణములు, వేదములు, శాస్త్రములును తెలుపుచున్నవి. శ్రీరాముని భజించువారికి ముక్తియన్నది కోరకయే ప్రాప్తించును."

ఇతరేతరములైన గొప్పగొప్ప సాధనముల వలన కూడ సహజముగా ప్రాప్తించనట్టి యత్యంత దుర్లభమైన ముక్తి కోరకయే బలవంతముగా వచ్చిపడును. కాని భక్తుడు మాత్రము -

'ముక్తి యెడల అనాదరమును, భక్తియెడల ప్రలోభమును వహించును.'

అచ్చమైన భక్తుడు ముక్తివంకకు కన్నెత్తికూడ చూడడు. ఇట్టి సులభమైన, సర్వోత్కృష్టమైన, సర్వోన్నత స్థితి స్వరూపమైన భక్తిని కాదని యెవరైన ఏ యితర సాధనమునైన ఏల చేపట్టవలెను? శ్రద్ధాయుతులు బుద్ధిమంతులు నగువారు కేవలము ఈ భక్తినే యనుసరింపవలెను.



## ప్రేమరూప భక్తి యొక్క సాధనములు - సత్సంగ మహత్త్వము

''తస్యాః సాధనాని గాయంత్యాచార్యాః.'' **(34)**

ఆచార్యుల సమూహము చేత భక్తి సాధనములు తెలుపబడుచున్నవి.

కర్మమార్గము కంటెను, జ్ఞానమార్గము కంటెను భక్తికి ఉత్తమత్వమును ప్రతిపాదించి యిప్పుడు దేవర్షి నారదుడు భక్తిశాస్త్రము ప్రధాన ప్రవర్తకులు, అనుభవపూర్వకముగా భక్తితత్త్వమును ఎరిగిన యాచార్యుల బృందము, సాధుజనులు, భక్తులు ననేకులు గానము చేసిన (కొనియాడిన) ఉత్తమమైన భక్తి సాధనములను వివరించుచున్నాము.

''తత్తు విషయత్యాగాత్ సంగత్యాగాచ్చ.'' **(35)**

అది (భక్తి) విషయత్యాగము వలన, సంగత్యాగము వలనను పూర్ణమగును.

జీవుని మనములో సహజముగనే ప్రేమవాహిని పారుచుండును. అతడు పరమానంద స్వరూపుడు, పరమప్రేమ స్వరూపుడునగు భగవంతుని సనాతన చిదంశము అయినవాడు. కాని వాని ప్రేమ గాడి తప్పి, విషయముల దిక్కునకు పారుచుండుట వలన కలుషితము అయిపోయినది. ఈ కారణముననే ఆ ప్రేమ దుఃఖకారణమైన కామముగా మారుచున్నది. ఈ కారణముననే ఆ జీవునియందు ఉన్న పరమాత్మాభిముఖమైన దివ్యస్వరూపము వెలుగులోనికి రాకున్నది. అది

వెలుగులోనికి రావలెనన్న జీవుడు విషయాభిముఖముగా పారుచున్న తనలోని ప్రేమవాహినిని మరలించి యీశ్వరాభిముఖము గావింపవలసియున్నది. దీనికి రెండు మార్గములు ఉన్నవి. ఒకటి - విషయములను స్వరూప పూర్వకముగా పరిత్యజించుట. రెండు - విషయములందలి యాసక్తిని విడనాడుట.

మానవుడు విషయములందు ఆసక్తుడై కాలము గడుపుచుండగనే, యథేష్టముగా హద్దులేకుండ విషయముల సంగ్రహణము, ఉపభోగము సాగించుచుండగనే భక్తిపుట్టుకొని వచ్చుననియు, భగవద్భక్తి మార్గమందు విషయములను, వానియందలి యాసక్తిని విడనాడవలసిన పనిలేదనియు కొందరు వాదింతురు. వారి వాదము గ్రాహ్యమైనదికాదు. వారు ఈ విషయమున చాల పొరపడుచున్నారు. భక్తిమార్గమందు స్వకీయభోగమునకు వస్తువు ఏదియు ఉండనే ఉండదు. భోక్తయే లేనప్పుడు భోజ్యవస్తువు ఎటనుండి వచ్చును? ఆ మార్గమందు కేవలమొక్క ప్రాణాధారభూతుడైన భగవానుడే సర్వభోక్త. మనము మన సమస్తములైన యంగములతోను, సమస్తసామగ్రులతోడను ఆ భగవానుని భోగ్యవస్తువులము. కేవల మతడు ఒక్కడే పురుషుడు. తక్కిన దంతయు అతనికి భోగ్యమైన ప్రకృతియే. ఇట్టి పరిస్థితిలో భక్తునకు స్వకీయమైన భోగ్యవిషయము ఏదియు నుండనే యుండదు. ఇది యేదియో ఉన్నతస్థితి యని ఎవరైన దీనినుండి తప్పించుకొనుటకు యత్నింపవచ్చును. కాని సాధనకాలమందు అతడు కూడ క్రమక్రమముగా విషయములను, వానియందలి యాసక్తిని యథాసాధ్యముగా విడిచిపెట్టవలసినవాడు అగును. శరీరము విషయభోగములందు లగ్నమై, మనస్సు వానియందు సక్తమైయున్ననాడు ఇక ప్రియతమ భగవానుని సేవ ఏ తనువుతో, ఏ మనముతో చేయగలము? కావుననే విషయ పరిత్యాగము అత్యంతావశ్యకము. బాహ్యభోగములనే కాదు. మానసికముగా వాని చింతనమును కూడ

మానవలసియుండును. మనస్సు ఏ వస్తువును చింతనము చేయునో దానియందే దానికి ఆసక్తి జనించును. భగవానుడు శ్రీమద్భాగవతములో అన్నమాట ఇది।–

> విషయాన్ ధ్యాయతశ్చిత్తం విషయేషు విషజ్జతే
> మా మనుస్మరతశ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే. **(11/14/27)**

'విషయములను చింతనము చేయుట వలన మనస్సు విషయములయందు ఆసక్తమగును. పదేపదే నన్ను స్మరించుట వలన అది నాయందే లీనమగును.'

మనస్సును ఎందు లగ్నము చేసిన అందే లగ్నమైపోవును. ఆ లగ్నము చేయుట యన్నది యింద్రియముల వలననగు క్రియ. మనము మరల మరల ఏ విధమైన దృశ్యములను చూచుచుందుమో, ఎట్టి మాటలు వినుచుందుమో, ఎట్టి వస్తువుల నారగించుచుందుమో, ఏమి యాఘ్రాణించుచుందుమో, ఎట్టి వస్తువును స్పృశించుచుందుమో దానినే మనస్సు మాటికి మాటికి చింతించుట సంభవమగుచుండును. ఏ వస్తువు యొక్క ధ్యానము అధికముగా సాగునో దానియందే ఆసక్తి జనించుచుండును. మనము నాటకము చూచెదము, వేశ్యాగానము నాలించెదము. అందు మనలో ఆసక్తి కలగును. అటులనే భక్తులైనవారు లీలల నవలోకింతురు. కీర్తనముల నాలింతురు. వారికి అందు ఆసక్తి జనించును. కావుననే భక్తిని అభిలషించువారు భగవానునకు ప్రతికూలమైన విషయములను అన్నిటిని పూర్తిగా విడిచిపెట్టవలెనని చెప్పబడుచున్నది. ఈ సూత్రమందు ప్రయుక్తమైన విషయత్యాగము అను శబ్దమునుబట్టి ఏ విషయములు మన మనస్సును భగవానుని దిక్కునుండి మరలించి ప్రపంచము దిక్కునకు ఆకర్షించునో దానినే విడిచిపెట్టవలె నను అర్థమును గ్రహింపవలయును. ధ్యానము, చింతనము, కీర్తనము, భగవత్సేవ,

సాధుసత్కారము, సత్సంగము మున్నగు భగవదనుకూలములైన విషయములు అన్నిటిని ఇచ్ఛాపూర్వకముగా కాయికముగాను, మానసికముగాను కూడ అలవరచుకొనవలయును. వానిలో శరీరయాత్రకు, కుటుంబపోషణమునకు అత్యంతావశ్యకములైన విషయములున్నచో వానిని కూడ సాధ్యమగునంత వరకు తగినంత తక్కువ పరిమాణములో సంగ్రహణము, సేవనము చేయుచుండవలెను. దానిని కూడ శాస్త్రానుకూలముగా, భగవదాజ్ఞగా భావించి యెట్టి యితర ఫలాపేక్షయు లేకుండ కేవలము భగవత్ప్రీత్యర్థమే చేయవలెను. ఇట్టి విషయానుభవమే విషయ పరిత్యాగముతో తుల్యమైనది. ఏ విషయమునైన బాహిరముగా త్యజించి మానసికముగా దాని చింతనము చేయుచున్నచో అది యథార్థత్యాగము కానేరదు. ఆ కారణముననే యీ సూత్రమందు విషయపరిత్యాగముతో బాటుగా ఆసక్తిని పరిత్యజింపవలసిన అవసరము తెలుపబడినది. మహాభారతము ఏమనుచున్నదో చూడుడు! -

''త్యాగ స్నేహస్య యత్త్యాగో విషయాణాం తథైవ చ' (శాంతిపర్వ. 192/17)

విషయాసక్తిని, విషయములను రెండింటిని త్యజించుటయే త్యాగము అనబడును. అట్లు రెండింటిని త్యజించినప్పుడే విషయానురాగమును త్యజించినట్లగును. విషయానురాగరహితమైన హృదయమే భగవత్ప్రేమకు దివ్యధామము కాగలదు. భగవత్ప్రేమ ప్రాప్తించినప్పుడు స్వాభావికముగనే విషయపరిత్యాగము సాగుచుండును. -

'శ్రీరామ చంద్రుని ప్రేమించు మహాభాగ్యశాలియైన భక్తుడు సిరిసంపదల విలాసమును ఉచ్ఛిష్టమువలె పరిత్యజించివేయును.'

అమృతమును చవిచూచుటయు, దాని గుణమువలన లాభమును పొందుటయు సంభవమైన యప్పుడు ఎవని దృష్టియైన విషమువంకకు ఏలపోవును? కాని యీ యమృతము ప్రాప్తింపవలెనను ప్రవృత్తి కలుగుటకు

కూడ విషయములను విషమువలె విడనాడవలసియుండును. విషయాసక్తిని వీడి భగవంతుని యెడల ఆసక్తి వహించుటయందే పరమసుఖమున్నది. భగవానుడు స్వయముగా చెప్పియున్నాడు. –

మయ్యర్పితాత్మనః స్సభ్య నిరపేక్షస్య సర్వతః
మయాత్మనా సుఖం యత్తత్ కుతః స్యాద్విషయాత్మనామ్
(శ్రీమద్భాగ. **11/14/12**)

'ఉద్ధవా! నాయందే చిత్తమును లగ్నమొనర్చి సమస్త విషయాపేక్షలను వీడిన భక్తునకు ఆత్మస్వరూపుడనైన నా వలన ప్రాప్తించు సుఖము విషయాసక్త చిత్తులకు ఎట్లు లభించును?'

''అవ్యావృతభజనాత్.'' **(36)**

అఖండ భజనము వలన (ఈ భక్తిసాధనము సంపూర్ణమగును.)

భజన మన్నది భక్తికి ప్రధానాంగము. ఇది సాధ్యము, సాధనము రెండును అగును. భగవత్ప్రేమను పొందినవారికి అఖండభజనము స్వభావసిద్ధమైనదగును. ఈ భగవత్ప్రేమను పొందగోరువారు అఖండభజనము నలవరచికొనవలయును. హరిభజనము లేక ముక్తిని భగవత్ప్రేమను పొందగోరువాడు పొరపడుచున్నా డనవలయును. గోస్వామి తులసీదాసు అనుమాట యిది! –

తే. వారి మథియించి నేతిని బడయవచ్చు,
నిసుకవలనను దైలంబు నెనయవచ్చు,
హరిని గొలువక తరియింపనగునె భవము?
నిది యఖండిత సిద్ధాంత మీ ధరిత్రి.

కావుననే భజనము అనివార్యసాధనమైనది. భక్తిసాధన చేయువానికి ఇదియే ప్రధానవస్తువు. విషయములనుండి మనస్సును మరలించి భగవానునియందు లగ్నము గావింపకున్నచో అది పరుగిడిపోయి మరల విషయముల మీదనే సంలగ్నమగును. విషయ పరిత్యాగమే వైరాగ్యము. భగవద్భజనమే అభ్యాసము. ఈ యభ్యాసవైరాగ్యముల వలననే విశుద్ధమైన భగవత్ప్రేమ ప్రాప్తించును. కాని యే భజనము ఇప్పుడు జరిగి, ఒక ఘటిక గడచిన మీదట సాగకుండునో, ఏది యీనాడు చేయబడి రేవు చేయబడకుండునో అది యుక్తమైన భగవత్ ప్రేమయు కాదు. అఖండభజనమును గాజాలదు. భజనరూపమైన ఏ యభ్యాసము సర్వదా నిరంతరముగా సత్కారపూర్వకముగా సాగునో అదియే సిద్ధించును. ఈ మాటనే 'యోగదర్శనము'లో పతంజలి మహర్షి చెప్పియున్నాడు. -

స తు దీర్ఘకాల నైరంతర్య సత్కారాసేవితో దృఢభూమిః **(1/14)**

'దీర్ఘకాలపర్యంతము నిరంతరము సత్కారముతోడ చేసినప్పుడే అభ్యాసము బలపడును.' ఈ నిత్యము నిరంతరము అఖండముగా సాగు స్మరణము వలన భగవత్ప్రాప్తి సహజముగనే కలుగును. భగవానుడు కూడ గీతలో స్వయముగా నిట్లు తెలిపియున్నాడు. -

అనన్య చేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః. **(8/14)**

'ఓయి అర్జునా! ఏ పురుషుడు నా యెడల అనన్య చిత్తుడై నిత్యము నిరంతరముగా నన్నే స్మరించుచుండునో ఆ నిరంతరము నాయందు నిలిపిన మనసుకల యోగికి నేను సులభుడను.'

కాబట్టి యఖండముగా ప్రేమతో భగవచ్చింతనము చేయుచునే స్నానము, భోజనము, వ్యాపారము మున్నగు కార్యములను

నిర్వర్తించికొనవలయును. భగవత్స్మరణముతో కూడిన ప్రతికార్యము భజనతుల్యమేయగును. ఈ విధముగా భజనక్రమము తైలధారవలె అవిచ్ఛిన్నముగా సాగవలెను. క్షణము కూడ విచ్ఛిన్నము కారాదు. స్వరూప చింతనము శక్యము కాకపోయినను నిరంతరముగా భగవానుని నామస్మరణము చేయవలెను. ఈ నామస్మరణము వలన మనస్సు, ప్రాణములు పవిత్రము లగును. తద్వారా భగవానుని పాదపద్మములయందు అనన్య ప్రేమ యుద్భవించును. ఉత్తమమైన నామజపవిధానమేదన్న - ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములను అనుసరించి మానసికముగా, మందస్వరముతో, వాచికముగా కూడ భగవన్నామజపము చేయవలెను. ఈ సాధన లేచుచు, కూర్చుండుచు, నడచుచు, తిరుగాడుచు, నిదురించుచు, మేల్కొనుచు, నిలుచుచు అన్నిసమయములందును సాగించుకొనవచ్చును. అభ్యాసము బలపడిన మీదట మనస్సు విక్షేపశూన్యమై నిరంతరము తానే భగవచ్చింతనమందు లగ్నమగును. ప్రసిద్ధిగన్న సాధువులు, భక్తులు నెల్లరను ఈ సాధనా పద్ధతినే అనుసరించిరి. మహాత్ముడైన చరణదాసు శ్వాసకు, శ్వాసకు నడుమ నామజపము సాగించినచో ఎట్టి సందేహమునకును తావుండదని తెలిపియున్నాడు. ఉచ్ఛ్వాసనిశ్వాసముల నడుమ నామజపము చేయుట ఉత్తమమైన యుపాయమని కబీరు కూడ చెప్పియున్నాడు.

సారాంశమేమనిన భగవానుని స్వరూపమును, స్వభావమును, ప్రభావమును, రహస్యమును, గుణములను, లీలలను లేదా నామమును నిరంతరము తైలధారవలె చింతనము, స్మరణము చేయవలెను. ఇదియే యఖండభజన ప్రకారము.

''లోకేఽపి భగవద్గుణశ్రవణకీర్తనాత్.'' **(37)**

లోకమందు కూడ భగవద్గుణశ్రవణము వలన కీర్తనము వలన (భక్తిసాధన సంపూర్ణమగును.)

మానసికముగా నిత్యము భగవచ్చింతనము చేయవలసినదే. కాని చెవులతోను, వాక్కుతోను కూడ ఎల్లవేళల జనసమాజము నడుమను కూడ భగవద్గుణానువాదమును వినుచుండవలెను. వివరించుచుండవలెను. మన యింద్రియములు కూడ భగవత్సంబంధములైన కార్యములందు నిమగ్నములై యున్నప్పుడే మానసికముగా భగవచ్చింతన ప్రయత్నము సఫలము గాగలుగును. ప్రాయికముగా వినుచుండుటయే, వివరించు చుండుటయే ఎల్ల కార్యములకు నాధారమగుచుండును. కర్ణములందు సర్వదా విషయముల వార్తలు ప్రవేశించుచునే యున్ననాడు, వాచికముగా విషయప్రసంగములు వివరింపబడుచునే యున్ననాడు మానసికముగా భగవచ్చింతనము సాగుట యసంభవమైపోవును. అట్లుకాక కర్ణములు, వాక్కు రెండును భగవంతునియందే లగ్నములై యున్ననాడు, ఇతర విషయములందు ప్రవర్తించుటకు వానికి అవకాశమే చిక్కనినాడును ఇతరేతరములైన యింద్రియములు, మనస్సు కూడ స్వయముగనే భగవత్పరాయణములు అయిపోవును. కావుననే శ్రవణములను, జిహ్వను భగవానుని నామగుణలీలాదులను ఆలకించుటయందే, కీర్తించుటయందే నిరంతరము సంలగ్నము గావించి యుంచవలెను. ఇదియే జీవితమును సఫలము గావింపగల సాధనము. కేవలము జీవించుట యందే, శ్వాస ప్రక్రియను సాగించుటయందే, తినుట, త్రాగుట, మైథునము చేయుట మున్నగు క్రియలయందే జీవన సాఫల్యమున్నదని భావించినచో, ఏమి వృక్షములు జీవించుట లేదా? కమ్మరి వాని తోలుతిత్తి శ్వాసగ్రహణము చేయుట లేదా? పశువులు తిండి తినుటలేదా? మైథునము చేయుటలేదా? కావుననే శ్రీమద్భాగవతములో ఇట్లు చెప్పబడియున్నది. –

శ్వవిడ్వరాహోష్ట్రఖరైః సంస్తుతః పురుషః పశుః
న యత్కర్ణపథోపేతో జాతు నామ గదాగ్రజః.

బిలే బతోరుక్రమ విక్రమాన్ యే
న శృణ్వతః కర్ణపుటే నరస్య
జిహ్వాసతీ దార్దురికేవ సూత
న చోపగాయత్యురుగాయగాథాః. (2/3/19-20)

ఎవని కర్ణపథమందు భగవన్నామగుణానువాదనాద మెన్నడును ప్రవేశించియుండలేదో ఆ మానవరూప పశువు కుక్కలకంటెను, మలభక్షకములైన పందులకంటెను, ఒంటెలకంటెను, గాడిదల కంటెను, కూడ ఎక్కుడుగా నిందనీయుడు! సూతా! భగవల్లీలల నాలింపనేరని కర్ణములు పాము కలుగుల వంటివి. ఏ నాల్క భగవల్లీలలను, కథలను గానము చేయదో అది బెకబెక మను కప్ప నాల్కకు సాటియగును. ఈ మాటలనే తులసీదాసు కూడ అనువదించియున్నాడు. -

ఆ. విష్ణుకథల నెలమి విని యెరుంగని వీను
లరయ బాము కలుగు లనగవలయు.
రాము సుగుణగానరతి నెరుంగని నాల్క
కప్పనాల్క గాగ జెప్పవలయు.

శ్రీమద్భాగవతములో కడపట నిట్లు చెప్పబడియున్నది -

మృషా గిరస్తా హ్యసతీరసత్కథా
న కథ్యతే యద్భగవా నధోక్షజః
తదేవ సత్యం తదు హైవ మంగళం
తదేవ పుణ్యం భగవద్గుణోదయమ్.
తదేవ రమ్యం రుచిరం నవం నవం
తదేవ శశ్వన్మనసో మహోత్సవమ్.
తదేవ శోకార్ణవశోషణం నృణాం
యదుత్తమశ్లోకయశోఽనుగీయతే. (12/12/48-49)

'అధోక్షజుడైన భగవంతుని కథలను వివరింపక, విషయ ప్రసంగము లను వివరించు వాక్కు సద్వాక్కు గాదు. అది నిరర్థకమైనది. భగవానుని గుణములను ప్రకటించునట్టివి, పుణ్యకీర్తిశాలియైన యా పరమపురుషుని యశస్సును వర్ణించు వచనములే సత్యములని యెన్నదగినవి. అవియే మంగళమయములు. అవియే పుణ్యపూర్ణములు. అవియే మనోహరములు, రుచిరములు. అవియే నిత్యము వినూత్నరసమయములు. అవియే మనస్సునకు సర్వదా మహానందము నొదవించును. అవియే మానవుల శోకసముద్రమును శుష్కింపజేయును.'

కావుననే చెవులతో భగవానుని గుణనామశ్రవణము, నాల్కతో తత్కీర్తనము చేయుచుండవలెను. అట్లు చేసినప్పుడే నిర్మలమైన భగవత్ప్రేమ యుదయించుట సంభవమగును.

శ్రీమద్భాగవతములో ఇట్లు చెప్పబడినది. -

తా యే శృణ్వంతి గాయంతి హ్యనుమోదంతి చాదృతాః
మత్పరాః శ్రద్దధానాశ్చ భక్తిం విందంతి తే మయి. **(11/26/29)**
య ఏతద్దేవదేవస్య విష్ణోః కర్మాణి జన్మ చ
కీర్తయేచ్ఛ్రద్ధయా మర్త్యః సర్వపాపైః ప్రముచ్యతే.
ఇత్థం హరేర్భగవతో రుచిరావతార
వీర్యాణి బాలచరితాని చ శంతమాని
అన్యత్ర చేహ చ శ్రుతాని గృణన్ మనుష్యో
భక్తిం పరాం పరమహంసగతౌ లభేత **(11/31/27-28)**
భక్తిం లబ్ధవత స్సాధోః కిమన్యదవశిష్యతే
మయ్యనంతగుణే బ్రహ్మణ్యానందానుభవాత్మని **(11/26/30)**

- 'నాయందే మనస్సును సంలగ్న మొనరించి శ్రద్ధతోడను, ఆదరముతోడను నా నామగుణలీలాగాథలను ఆలకించుచు, కీర్తించుచు,

వానిని అనుమోదించుచు నుండువారికి నా యందు అనన్యభక్తి కుదురును.'

'శ్రీశుకయోగి యిట్లు చెప్పుచున్నాడు – ఓ రాజా! దేవదేవుడైన భగవానుని దివ్యములైన జన్మకర్మలను శ్రద్ధతో కీర్తించునట్టి మనుష్యుడు సమస్తపాప విముక్తిని పొందును. భగవానుడైన అత్యంత మనోహరములు, కల్యాణకారణములు నైన శ్రీహరి యవతారములను, పరాక్రమములను, బాలలీలలను వినుట వలన, వినుతించుట వలన మానవుడు భగవానుని యెడల, పరమహంసల లక్ష్యస్వరూపమైన పరాభక్తిని పొందును.'

'భగవానుడు చెప్పుచున్నాడు – ఈ విధముగా అనంతగుణ సంపన్నుడనైన, సచ్చిదానందఘన పరబ్రహ్మమునైన నాయందు భక్తి కుదురుకొన్న మీదట ఇక ఆ సాధు పురుషునకు ఏ వస్తువును పొందవలసిన యావశ్యకత మిగిలియుండును? అనగా అతడు కృతకృత్యుడు అయిపోవును.'

భగవన్నామమును శ్రవణము చేయుట వలన, కీర్తించుట వలన మహాఫలము ప్రాప్తించును. భగవన్నామధ్వని ఎంత దూరము ప్రాకిన అంతదూరము వాతావరణము పవిత్రమగును. మరణకాలమందు అంతిమశ్వాసతోడ ఏ భావముతో భగవన్నామము ముఖ వినిర్గతమైనను ఆ మానవునకు పరమపదము సిద్ధించును. ఏయెడ భగవన్నామ కీర్తనము సాగిన ఆ యెడకు యమకింకరులకు ప్రవేశముండదు. కాబట్టి దశవిధనామాపరాధముల నుండియు తప్పుకొనుచు భగవన్నామము యొక్క జపము, కీర్తనము, శ్రవణము అవశ్యము చేయవలెను.

ఈ యపరాధములను వివరించు శ్లోకమున్నది. అది యిదిగో! –

సన్నిందాసతి నామవైభవకథా శ్రీశేశయోర్భేదధీః
అశ్రద్ధా శ్రుతిశాస్త్రదైశికగిరాం నామ్న్యర్థవాదభ్రమః
నామాస్తీతి నిషిద్ధవృత్తివిహితత్యాగో హి ధర్మాంతరైః
సామ్యం నామ్ని జపే హరస్య చ హరేర్నామాపరాధా దశ.

1. సాధునింద, 2. దుర్జనుని ముందు నామవైభవమును చెప్పుట, 3. శివకేశవులలో భేదబుద్ధి కలిగించుట, 4. శ్రుతినింద, 5. శాస్త్రనింద, 6. గురునింద, 7. నామమందు అర్థవాద బుద్ధి, 8. నామావలంబనముతో నిషిద్ధకార్య ప్రవృత్తి, విహిత త్యాగము, 9. ఇతర ధర్మములతో (యజ్ఞదానతపఆదులతో) నామసామ్యమును చెప్పుట, 10. హరినామమును హరనామముతో పోల్చుట.

శ్రీమద్భాగవతములో ఏమని చెప్పబడినదో చూడుడు। -

సాంకేత్యం పారిహాస్యం వా స్తోభం హేలనమేవ వా
వైకుంఠనామగ్రహణ మశేషాఘహరం విదుః.
అజ్ఞానాదథ వా జ్ఞానాదుత్తమ శ్లోకనామ యత్
సంకీర్తితమఘం పుంసో దహేదేధో యథానలః **(6/2/14,18)**

'పుత్రాదుల పేర్ల రూపములో గాని, పరిహాసార్థముగా గాని, స్తోభము లేక అవహేళన పూర్వకముగా గాని భగవన్నామమును ఏ విధముగా గ్రహించినను మానవుని సమస్తపాపములు డుల్లిపోవును. అగ్నియందు పడవైచిన ఏ యింధనమైనను ఎట్లు భస్మమయిపోవునో అట్లే జ్ఞానపూర్వకముగా గాని, అజ్ఞానపూర్వకముగా గాని యే విధముగా గ్రహింపబడినను భగవన్నామము మానవుని సమస్తపాపములను కాల్చివేయును.'

సద్గ్రంథము లన్నిటియందును, సాధుజనుల వాక్కులందును భగవన్నామమహత్త్వము కీర్తింపబడినది. క్రింద నుదాహరింపబడుచున్న

శ్రీమద్భాగవతగతమైన శ్లోకము మననము చేయదగినది. దేవి దేవహూతి కపిలునితో నిట్లులన్నది. -

అహో బత శ్వపచోఽతో గరీయాన్
యజ్జిహ్వాగ్రే వర్తతే నామ తుభ్యమ్
తేపు స్తపస్తే జుహువు స్సస్నురార్యా
బ్రహ్మానూచుర్నామ గృణంతి యే తే **(3/33/7)**

'అహో! ఎవని నాలుక మీద నీ పవిత్రనామ ముండునో అతడు చండాలుడైనను శ్రేష్ఠుడే. నీ నామమును కీర్తించువారు శ్రేష్ఠులైన పురుషులు. వారు తపములు, యజ్ఞములు, తీర్థస్నానములు, వేదాధ్యయనము సర్వము నాచరించినవారే యగుదురు.'

పతితః స్ఖలితశ్చార్తః క్షుత్త్వా వా వివశోఽబ్రువన్
హరయే నమ ఇత్యుచ్చైర్ముచ్యతే సర్వపాతకాత్.
సంకీర్త్యమానో భగవాననంతః
శ్రుతానుభావో వ్యసనం హి పుంసామ్
ప్రవిశ్య చిత్తం విధునోత్యశేషం
యథా తమోఽర్కోఽభ్రమివాతివాతః. **(12/12/46-47)**

'క్రింద పడిపోవుచున్న వేళ, తడబాటు వలన కాలుజారిపోవుచున్న వేళ, తుమ్ముమవచ్చిన వేళ, దుఃఖగ్రస్తుడై పీడింపబడు వేళ ఏ మానవుడు పరవశుడై బిగ్గరగా 'హరయే నమః' అని ఉచ్చరించునో అతడు సమస్త పాపవిముక్తి పొందును. సూర్యభగవానుడు పర్వతగుహాగతమైన యంధకారమును సైతము పటాపంచలు గావించును. ప్రచండవాయువు మేఘములను ఛిన్నభిన్న మొనర్చివేయును. ఇట్లే యనంతుడైన భగవానుని నామకీర్తనము, లేక తత్ప్రభావము (శ్రవణ ద్వారమున) హృదయములో ప్రవేశించి సమస్త దుఃఖములను అంతమొందించివేయును.'

మానవుడు వివశత్వదశయందైనను భగవన్నామ స్మరణము చేయగా గలుగు ఫలము. ఇది ప్రేమపూర్వకముగా స్మరించినచో ఇక వేరుగా జెప్పవలెనా? తులసీదాసు ఇట్లన్నాడు -

తే. నరుడు వివశుడై వాకొన్న నామ మెన్నొ
పుట్టువుల పాపతతులను గిట్టజేయు.
ప్రియత స్మరియించువారు తరించిపోరొ?
భయదభవసాగరంపు గోష్పదము భంగి

కాబట్టి భక్తిని పడయుటకు నిత్యము నిరంతరముగా భగవానుని నామగుణకీర్తుల కీర్తనము, శ్రవణము, చింతనము, పరమసాధన మనుట సత్యము.

''ముఖ్యతస్తు మహత్కృపయైవ భగవత్కృపాలేశాద్వా.''

**(38)**

కాని (ప్రేమభక్తిప్రాప్తి) ముఖ్యముగా (ప్రేమభక్తులైన) మహాత్ముల కృపవలననో, భగవానుని కృపాలేశము వలననో కలుగును.

ఇంత వరకు విషయములను, వానియందలి యాసక్తిని వీడి యఖండభజనము, కీర్తనము, శ్రవణము సాగించు విధము తెలుపబడినది. ఇప్పుడు మరియొక ప్రముఖ సాధనము తెలుపబడుచున్నది. కేవలమీయొక్క దాని ప్రభావము వలన ముందు చెప్పిన మూడు అంశములును తమ యంత తాము కూడివచ్చును. ఆ సాధనము మహాపురుషుల కృపయే!. మహాపురుషులు కృపామయులు. కాని శ్రద్ధావిశ్వాసములతోడ వారితో సాంగత్యము సాగించుట బహుకష్టసాధ్యమైన విషయము. మహాపురుషుల సాంగత్యమును పడసిన మీదట విషయములు తమంత తామే వీడిపోవును.

వారి సాంగత్యము కారణముగా కీర్తన శ్రవణములు కూడ ఎట్లును కొనసాగెడివే! రేబవళ్ళు విన్నవానిని, చెప్పినవానిని, చూచిన యంశములను తలపులో నుంచుకొనుట తప్పనిసరి. అయినను ఇక్కడ ఒక్క విషయము దృష్టిలో నుంచుకొనవలసియున్నది. - ఏ మహాపురుషుల కృపామాత్రముననే ఫలరూపమగు భక్తి ప్రాప్తించునని చెప్పబడినదో వారు కేవలము శాస్త్రజ్ఞానము గలవారు, సదాచార పరాయణులు మాత్రమే కారు, భగవానుని స్వరూపతత్త్వమును యథార్థముగా నెరిగి, ఆ స్వామియందు అనన్య ప్రేమ గల భక్తులై యుందురు. ఇట్టి పరమభక్తుల సాంగత్యమునకు విశేషమహత్త్వమున్నది. కావుననే యజ్ఞధూమముల చేత పొగచూరిన శరీరములు గలవారు, ఎన్నదగినయట్టి కర్మకాండనిష్ఠులు, విజ్ఞానవేత్తలునగు ఋషులు భగవచ్చరణకమలరసామృతపానము చేయు ప్రేమమూర్తియునగు సూతునితో ఈ విధముగా అనినారు. -

తులయామ లవేనాపి న స్వర్గం నా పునర్భవమ్
భగవత్సంగి సంగస్య మర్త్యానాం కిముతాశిషః.

**(శ్రీమద్భాగ. 1/18/13)**

"ఋషిపుంగవా! భగవత్సాంగత్యము గల పరమభక్తులతో సాగించిన సాంగత్యము ఒక్క నిమేషకాలము మాత్రమే యైనను దానికి స్వర్గాదుల మాట యటుంచి పునర్జన్మ లేకుండ జేయునట్టిముక్తి కూడ సాటి కాజాలదు. అట్టి యెడ మానవలోకములోని రాజ్యాది సంపదలు సాటి కాజాలవని వేరుగా చెప్పవలెనా?"

ఈ భావముల నాధారముగా జేసికొనియే తులసీదాసుచే ఇట్లు చెప్పబడినది. -

తే. స్వర్గసుఖమును మరి యపవర్గసుఖము
నొక్క దెస దుల నుంచి, వేరొక్క దెసను

సాధుజనసంగసౌఖ్య లేశంబు నిలిపి
చూడ రెండవ దెసకె ముల్ సూపు జుమ్ము!

ఈ సత్సంగమహత్త్వము చిత్తశుద్ధిని గలిగించి మోక్షమును ప్రసాదించునట్టి పరిమిత సత్సంగమహత్త్వము వంటిదికాదు. కారణమేమన్న ఇక్కడ మోక్షముతోడ లవలేశమాత్రపు సత్సంగమునైన పోల్చుట యుక్తము కాదని చెప్పబడినది. కావుననే యిక్కడ భగవత్తత్త్వ పరిజ్ఞానము, భగవత్ప్రేమ రసరంజితస్వాంతములు, మోక్షమును సైతము తృణీకరించినవారు, భగవానుని తోడ సాంగత్యము గలవారు (సర్వైశ్వర్య పరిపూర్ణుడు మధురతమలీలావిహారియు నగు భగవానుని తోడ నిత్య లీలాసాంగత్యము గలవారు) నగు పరమభక్తులైన సాధుపురుషుల కృప ప్రత్యేకముగా నొక్కి వక్కాణింపబడినది. ఈ కృప కేవలము ముక్తిని మాత్రమే కాదు. భగవత్ప్రేమ స్వరూపమగు భక్తిని కూడ అనాయాసముగా ప్రాప్తింపజేయగలదు. ఇట్టి ప్రేమిభక్తులు ముక్తిని కోరనేకోరరు. వారు ముక్తికాంక్షను భగవత్ప్రేమరూపమైన భక్తి కలుగుటలో అవరోధమును గలిగించు పిశాచినిగా భావించి పరిత్యజించివేయుదురు. ఇట్టి ప్రేమిభక్తుల కృపకు పాత్రులైనవారికి, ఇట్టి భక్తప్రవరుల సాంగత్య భాగ్యము పొందినవారికి యోగమువలన గాని, జ్ఞానము వలన గాని ప్రాప్తించనట్టి భగవంతుడు అనాయాసముగా వశీభూతుడగును. కావుననే స్వయముగా భగవానుడు తన ప్రియభక్తుడైన యుద్ధవునితో నిట్టులన్నాడు. -

న రోధయతి మాం యోగో న సాంఖ్యం ధర్మ ఏవ చ
న స్వాధ్యాయస్తపస్త్యాగో నేష్టాపూర్తం న దక్షిణా.
వ్రతాని యజ్ఞశ్ఛందాంసి తీర్థాని నియమా యమాః
యథావరుంధే సత్సంగః సర్వసంగాపహో హి మామ్.
(శ్రీమద్భాగ. 11/12/1-2)

'ఓయి ఉద్ధవా! ఇతరములైన సమస్త (అనావశ్యక) సాంగత్యములను నివారించునట్టి 'సత్సంగము' వలన నేను వశీభూతుడనగు విధముగా, యోగము గాని, జ్ఞానము గాని, ధర్మము, వేదాధ్యయనము, తపము, త్యాగము, ఇష్టాపూర్తము, దక్షిణ, వ్రతము, యజ్ఞము, వేదములు, తీర్థములు, యమములు, నియమములు ననబడు వీనిలో నేదియు వశీభూతుని జేయజాలవు.'

దీనికి కారణము ఏమనగా ఇతర సాధనలు అన్నియు సకామ భావముతో సాగినప్పుడు భోగములను, స్వర్గాదికమును గలిగించును. నిష్కామభావముతో సాగినప్పుడు అంతఃకరణ శుద్ధిని, మోక్షమును గలుగజేయును. సర్వతంత్రస్వతంత్రము, అనన్యము, విశుద్ధము నైన ప్రేమయే సూటిగా లీలావిహారి యైన భగవానుని వశీకరింపగలుగును. అది మొదట చెప్పబడిన సాధనములతో దేనివలనను ప్రాప్తముగాదు. అది కేవలము భగవత్సాంగత్య భాగ్యమును గన్న భక్తిమార్గవర్తనులైన మహాపురుషుల పరమానుగ్రహము వలననే లభించును.

భక్తి స్వతంత్రమైనదని, సమస్తసుఖముల గని యని, దానిని ఒక్క సత్సంగము వలన గాక మరి యే విధముననను ప్రాణులు పొందలేరని భగవంతుడు సంకల్పించుకొన్నచో స్వయముగనే తన యెడల ప్రేమభక్తిని ప్రసాదించగలడు. అతని కృపాలేశమాత్రముననే ఆ ప్రేమ లభింపగలదు. గోస్వామి తులసీదాసు ఏమనెనో చూచితిరా? –

తే. ఎవని కారుణ్యలవలేశ మెనసి తులసి
దాసుడతిమందమతి యయ్యు దాను గాంచె
పరమవిశ్రామ మట్టి సత్ప్రభుడు రామ
చంద్రునకు నెవ్వ డిల నుండు సాటి నరుడు?

కాని నిత్యము కృపావృష్టి గావించుచుండు భగవానుని కృపాలేశము కూడ భాగవతులైన మహాత్ముల కృపవల్లనే జీవులకు ప్రాప్తింపగలదు. కావుననే యట్టి ప్రేమమార్గానుగాములైన సాధుపురుషుల సాంగత్యమే ప్రధానసాధనమైనది. కాని యట్టి సాంగత్యము ప్రాప్తించుట మన వశములోనిది కాదు. ఆ కారణముననే దేవర్షి నారదుడు ముందు సూత్రములో మహాపురుషులతోడి సాంగత్యము దుర్లభమైనదని తెలుపుచున్నాడు. -

''మహత్సంగస్తు దుర్లభోఽగమ్యోఽమోఘశ్చ.'' **(39)**

కాని మహాపురుషుల సాంగత్యము దుర్లభము, అగమ్యము, అమోఘము.

లోకములో స్వధర్మపరాయణులు, సదాచారనిష్ఠులు, సాధుశీలురు, దైవీసంపద గలవారును అయిన పురుషులు లభించుట కష్టము. గనులలో అచ్చమైన వజ్రముల వలె, ఉపదేశకులందును అచ్చమైన సాధుజనులు బహుతక్కువగా నుందురు. కాని యన్వేషణము సాగించినచో లోకములో సదాచారనిష్ఠ గలవారు, కర్మకాండల యభినివేశము గలవారు, జ్ఞానులు నగు మహాపురుషులు కొందరు లభింపకపోరు. కాని వారియందు కూడ తమ కృపాకటాక్షమాత్రమున యోగులు జ్ఞానులు నగువారు కోరుకొనునట్టి భగవత్ప్రేమను ప్రాప్తింపజేయగల యచ్చమైన పరమభక్తులు చాల తక్కువగా నుందురు. అరుదుగా లభింతురు. కావుననే యట్టి మహాపురుషులతోడి సమాగమము బహు దుర్లభమని చెప్పబడినది. ఎందైన అట్టి మహానుభావులున్నను వారిని గుర్తింపగలుగుట చాల కష్టము. కారణము ఏమనిన నేడు బాహ్యప్రవర్తనము అంతయు సాధారణముగా బూటకమే యగుచున్నది. ఈ ప్రేమభక్తి లక్షణములను నాటకపు పాత్రలయందుకూడ ప్రదర్శించుట సంభవమగుచున్నది కదా! కాని యది నిజము కాదు.

కన్నులు కన్నీరు నించుట, ఏడ్చుట, నవ్వుట, అరచుట - ఇవి మాత్రమే నిజమైనభక్తునికే లక్షణములు గావు. అనేక బాహ్యకారణముల చేత కూడ ఆ లక్షణములు ప్రకటము గావచ్చును. ఒక్కొక్క యచ్చమైన ప్రేమిభక్తుడు ఈ లక్షణముల దశను కూడ అధిగమించి బాహిరముగా సాధారణ జనుల బుద్ధికి అందనట్టి యాచరణము గలవాడై కూడ ఉండవచ్చును. శ్రేష్ఠులగు భక్తులు తామే నిజమైన భక్తులమని ఎవరితోను చెప్పుకొనబోరు. చెప్పినను విని విశ్వసించువాడెవ్వడు? కావుననే స్పృహారహితులైన భగవజ్జనులను గుర్తించుట కష్టమనియు, అట్టివారితోడి సాంగత్యము దుర్గమమనియు చెప్పబడినది. ఎప్పుడైన యట్టి మహానుభావులు మన సౌభాగ్యవశమున మనకు లభించినచో వారి యా యనూహ్యమగు సమాగమము కూడ వ్యర్థము గాజాలదు. అది యమోఘమైనది. సాధారణులైన సదాచారపరులు, విద్యావంతులు నగు సాధుజనులతోడి సమాగమము సైతము అంతఃకరణశుద్ధిని గలిగించి పాపములను, తాపములను, దైన్యమును హరింపజాలినది యగుచుండగా భగవత్ప్రేమరసామృతము తొణికిసలాడు చిత్తము గలిగి, ప్రేమానందమయమూర్తులై, తమను స్మరించినంత మాత్రమున స్మరించినవారి పాపములను హరించివేయజాలిన భాగవతులు, పరమభక్తులునగు మహాత్ముల దర్శనము మహాఫలదాయకమగునని వేరుగా జెప్పవలెనా? అమావాస్యనాటి యంధకారపు రాత్రియందు నిద్రించిన వ్యక్తి సూర్యోదయమైన మీదట కూడ నిద్రించుచునే యుండెనేని యతనికి మెలకువ రానంతవరకు ప్రకాశము యొక్క యనుభవము గలుగదు. కాని యా ప్రకాశము సూర్యుడు ఉదయించుటతోనే మొదలగును.

మరియొక్క ఉదాహరణము. - ఒక మహాధనవంతుడు ఉండెననుకొనుడు. అతడు కోట్లు విలువచేయు తన సంపదను అంతను తనకు అత్యంత ప్రీతిపాత్రుడైన యొక దరిద్రుని పేర మార్చివైచె ననుకొనుడు! ఆ దరిద్రుడు ఆ క్షణము (అపని జరిగినప్పటి) నుండియే

ధనవంతుడు అయిపోవును. కాని యా విషయము తనకు తెలియనంత వరకు అతడు తనను దరిద్రునిగానే భావించికొనుచుండును. అట్లే ఎవరైన ప్రేమభక్తి సంభరితస్వాంతులైన మహానుభావుల యజ్ఞాతసాంగత్య ప్రభావ వశమున గూడ పాపరూపము, అజ్ఞానరూపమునగు అంధకార మంతరించి జ్ఞానసూర్యుని ప్రకాశము, భగవత్ప్రేమరూపమైన పరమనిధియు మానవునకు లభ్యము కావచ్చును. కాని యా విషయమును ఎరుగనంత వరకు అతడు దానివలన గలుగు నానందమును పొందలేడు. తప్పనిసరిగా ఆ విషయము తెలియుటకు ఎంతయో ఆలస్యము కాకపోవచ్చును. కావుననే మహాపురుషులతోడి సాంగత్యము అమోఘము (అవశ్యఫలదాయి) యని చెప్పబడినది.

## ''లభ్యతేఽపి తత్కృపయైవ.'' (40)

తప్పనిసరిగా నీ విధమైన సాధుపురుషుల సాంగత్యము భగవత్కృప వలననే ప్రాప్తమగును. భగవంతుడు ఎవనిపై కృపజూపి యెవనిని తనవానిని గావించికొననెంచునో వానిని తన ప్రేమపాశమందు బంధించి యుంచగల శక్తి గలవాడు, తన స్వరూపమే యగువాడు నగు తన ఆప్తుడగుభక్తుని ఎవనినైన దాని కడకు పంపును. నిజమునకు భగవత్కృపయు, మహాపురుషులతోడి సాంగత్యమును ఒకదానిపై ఒకటి యాధారపడి యుండునవి. మహాపురుషులతోడి సాంగత్యము భగవత్కృపాప్రసారము లేక అనుభవములోనికి రాదు. మహాపురుషులు లభించిన గాని భగవత్కృప అనుభవనమునకు రాదు. విభీషణునకు హనుమంతుడు లభించిన మీదటనే భగవత్కృపానుభవము గలిగెను. కావుననే అతడు హనుమతో (తులసీరామాయణములో) ''హనుమా! నిన్ను దర్శించిన మీదట హరికృప లేనిదే సాధుజనులు లభింపరు అన్న నమ్మకము నాకు ఇప్పుడు కలిగినది'' యని పలుకును.

''తస్మింస్తజ్జనే భేదాభావాత్.'' (41)

కారణము ఏమనగా భగవానునకు, అతని భక్తునకును భేదము లేదు.

భాగవతులు భగవత్స్వరూపులే యగుదురు. (బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి) భగవద్భక్తులను సేవించువారు భగవానుని సేవించినవారే యగుదురు. భక్తులు భగవానుని హృదయములో నెలకొని యున్న, వారిలో భగవానుడు నెలకొని యుండును. భగవానుడే చెప్పియున్నాడు. –

సాధవో హృదయం మహ్యం సాధూనాం హృదయం త్వహమ్
మదన్యత్తే న జానంతి నాహం తేభ్యో మనాగపి
(శ్రీమద్భాగ. 9/4/68)

'సాధుజనులు నాకు హృదయమైన నేను వారికి హృదయమును. నన్ను దక్క వారు అన్యము ఏదియు నెరుగరు. వారిని దక్క నేను అన్యమెరుగను.' – 'నిరంతరము 'రామ,రామ' యని రామనామమును జపించునట్టి భరతునకు సాటియగు రామభక్తుడు ఎందు ఉండును?' (తులసీదాసు) ఎందుకనగా సకల ప్రపంచము రాముని 'రామ రామ'యని జపించుచుండగా రాముడు మాత్రము భరతుని జపించెను.

భగవానుడు ప్రేమస్వరూపిణులైన గోపికల విషయములో ఏమనెనో చూడుడు! –

మన్మాహాత్మ్యం మత్సపర్యాం మచ్ఛ్రద్ధాం మన్మనోగతమ్
జానంతి గోపికాః పార్థ! నాన్యే జానంతి తత్త్వతః

'ఓ యర్జునా! నా మాహాత్మ్యమును, నా సేవను, నా యందలి శ్రద్ధను, నా మనోగతాభిప్రాయమును తాత్త్వికముగా గోపికలు ఎరిగియున్న విధముగా అన్యులు ఎవ్వరును ఎరుగరు సుమా!'

ఇట్టి పరమభక్తులకు, భగవానుననకును భేదము ఏముండును? భగవానుడు చెప్పియే యున్నాడు -

'యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్'
(గీత. 9/29)

'నన్ను ప్రేమతో భజించువారు నాయందు ఉందురు. నేను వారియందు ఉందును.'

ఇట్టి భక్తులు భగవత్ప్రేమలో ఎంత తాదాత్మ్యమును పొందియుందు రనగా - వారు తమ బాహ్యరూపమును మరచిపోయి సాక్షాత్తు భగవత్స్వరూపమునే అనుభవములో నిలిపికొందురు. గోపికలు భగవాను నన్వేషించుచు తన్మయత్వమును పొంది యతనిని లీలలనే యాచరింపసాగిరి. -

'రసనిధియైన శ్యామసుందరుని లీల వీరియందే శోభిల్లుచున్నదే! ఈ గోపికలు తాము ఎవరో ఎరుగజాలనంతగా తన్మయత్వమును పొందియున్నారు గదా!' (నందదాసు)

''తదేవ సాధ్యతాం తదేవ సాధ్యతామ్.'' (42)

కాబట్టి యా (మహత్సంగము కొరకే) సాధన చేయుము! దానినే సాధించుము!

కావున భగవత్ప్రేమ ప్రాప్తిని అపేక్షించి మహాపురుషుల సాంగత్యమునే అధికముగా కోరవలెను.! భగవత్కృప వలన అట్టి సాధుజనులు ప్రాప్తింపగలరు. వారితోడి సాంగత్య ప్రభావము వలన మనము పాపతాపముల నుండి విడివడి నిర్మలమైన భగవత్ప్రేమను పడయగలము. ఇందు ఒక రహస్యము ఉన్నది. - మహాప్రతాపవంతుడైన మహారాజా

ఒకడుండె ననుకొనుడు! అతడు గొప్ప ప్రేమపూరిత స్వాంతుడు. కాని అతని యాప్రేమ ప్రతి వ్యక్తి ముందును ప్రకటమగునది కాదు. అతడు తన రాజసభయందు, రాజ్యమందును కూడ తన ప్రభావమును, ఐశ్వర్యమును చక్కగా ప్రదర్శింపగలవాడే. కాని తనలోని ప్రేమరహస్యమును ఎవని ముందును వ్యక్తము చేయడు. మనము ఆ మహారాజును గలిసి విధానానుసారము ప్రజాసమస్యలు గూర్చి యేమైన అతనితో మాటలాడగలము. కాని యతనిలోని ప్రేమరహస్యమును గూర్చి యతనిని ఏమియు ప్రశ్నింపనుజాలము. మనము అడిగినను అతడు చెప్పడు. అతని గుప్తమైన ప్రేమరహస్యమును తెలిసికొనవలెనన్న, అతని ప్రేమ రాజ్యములో ప్రవేశింపవలె నన్న మనము అతనితోడ అనన్య ప్రేమ సంబంధము గలవానిని ఎవనినైన చేరి యతనితో సంబంధమును గల్పించి కొనవలెను. ఆ వ్యక్తి మహారాజుతోడ వ్యక్తిగతముగా ( రాజ్యవిధానములకు అతీతముగా) నిర్మలమైన ప్రేమబంధము కలవాడై ఉండవలెను. అతనితోడ మహారాజు హృదయపూర్వకముగా ప్రేమప్రసంగము గావించువాడై యుండవలెను. అట్టివాని హృదయములో దృఢమైన విశ్వాసము గలిగించి యతని మూలమున మహారాజు యొక్క ప్రేమరహస్యమును తెలిసికొనవలసియుండును. అతని ద్వారముననే మహారాజు సన్నిధికి మన ప్రేమసందేశమును పంపవలసి యుండును. తన్మూలమున మన పాత్రత వ్యక్తమొనర్చికొనవలసియుండును. మన పాత్రత మహారాజు ఎప్పుడు గ్రహించిన అప్పుడు మనలను కూడ ఆ వ్యక్తిని వలె తన ప్రేమగోష్ఠిలో పాల్గొనజేయును.

ఈ విధముగానే భగవానుడు కూడ తన ప్రేమరహస్యమును తన నోటితో వ్యక్తము చేయడు. అతడు ప్రేమశిక్షణ మిచ్చు నిమిత్తము ఉద్ధవుని గోపికల కడకు అంపియుండెను. ప్రియతముని ప్రేమరహస్యము, అతని ప్రేమకు సంబంధించిన గుప్తవిషయములును ఏ విధముగా అతని

విశ్వాసపాత్రలైన సకియలకు అతని ప్రియతమురాలి వలననే తెలియు శక్యమగునో, భగవానుని ప్రేమరహస్యము కూడ అతనిని అనన్య భావముతో ప్రేమించునట్టి భక్తులవలననే సాధకులకు తెలియసాధ్యమగును. భగవానుడు కూడ ఎవనిని అర్హునిగా దలచునో, ఎవనిపై కృప జూపునో వానికే తన ప్రేమరహస్యమును ఎరిగింప నిచ్చగించును. కారణము ఏమన్న ప్రేమిభక్తులైనవారు తమ ప్రేమకు స్థానభూతుడైన ప్రియతమ భగవానుని సంకల్పమో, అనుమతియో లేకుండ అతని ప్రేమరహస్యమును ఎవని ముందును బహిర్గతము చేయజాలరు. కాబట్టి సాధకుడు తొలుత పాత్రతను సాధించుకొనవలెను. నిర్మలము, అత్యున్నతము నగు భగవత్ప్రేమకు సంబంధించి ఏకాగ్రమగు కోరిక సాధకుని మనములో ఆవిర్భవించినప్పుడు అతని హృదయము ఆ ప్రేమకై తహతహపడ నారంభించును. అతని హృద్గతమైన యార్తనాదమును అంతర్యామియు, ఆనందమయుడునగు ప్రభువు ఆలకించును. అప్పుడు అతనిపై కృప వహించి తన ప్రియభక్తునకు ఎవనికైన సందేశమో, సంకేతమో కావించి యతనిని ఆ సాధకునితోడి సమాగమమునకు పంపును. అప్పుడు అక్కడ తొలుత ఆ సాధకుని ప్రేమ పరీక్షించబడును. అతని ప్రేమ కామనారహితము, అనన్యమును అయినచో, అతడు తన యాచరణముల మూలమున, వ్యవహారవిధము చేత ఆ ప్రేమిభక్తుని హృదయములో తన పాత్రత విషయమున తగిన విశ్వాసమును గలిగింపగలిగినచో ఆ భక్తుడు అతని సందేశమును భగవానుని కడకు చేర్చును. భగవానుని సెలవు గొని క్రమముగా స్వామియొక్క ప్రేమరహస్యమును ఆ సాధకుని ముందు బహిర్గతము చేయును. క్రమక్రమముగా అతని పాత్రత యెంత యెంతగా పెరుగుచుండునో అంతయంతగా భగవదాజ్ఞకు లోబడిన భక్తుడు అతనిని భగవానుని ప్రేమరాజ్యము దిక్కుగా నడపించికొనిపోవును. కడకు అతనిపై భగవానుని కృపావర్షము కురియుటయు, భగవత్ప్రేమను పొంది యతడు ధన్యుడగుటయు సంభవమగును. ముందు చెప్పిన ఉదాహరణగాథలోని

మహారాజా, అతనిని ప్రేమించువాడు ఇరువురును పరేంగితజ్ఞులు కాని కారణమున ఎవరిచేతనైన వంచింపబడవచ్చును. కాని భగవానుడు, అతని చేత ఇచ్ఛాపూర్వకముగా నియుక్తులైన భక్తులు ఎన్నడును వంచితులు గారు. కాబట్టి భగవత్ప్రేమను అపేక్షించువాడు దేవర్షియగు నారదుడు పేర్కొన్న సాధనములయందు అధ్యవసాయము వహించి తొలుత పాత్రతను సమకూర్చుకొనవలయును. అట్లయిననాడు వానిపై భగవానుని కృప ప్రసరించును. అతడు భగవానుని ప్రేమించు భక్తులతోడి సాంగత్యమునకు అర్హుడుగా భావింపబడును. అప్పుడు భగవత్ప్రేమి భక్తులతోడి సంగమునకై యాకాంక్షను ప్రబలము గావించుకొనవలెను. అట్టివారి సంగములేనిదే భగవత్ప్రేమ ప్రాప్తి కష్టమగును. ఈ కారణముననే భగవానుడు తన నిర్మలప్రేమను ప్రచారము చేయు నిమిత్తము ఇట్టి భక్తులకు వారు ముక్తిని పొందుటకు పూర్తిగా అర్హులేయైనను వారి మనస్సులలో ప్రేమవాసనను జాగృతముగా నిలిపి సాయుజ్యరూపముక్తిని ప్రసాదింపకుండును. ఈ కారణముననే ప్రియభక్తులు ఈ ప్రేమలీలా ఆనందమును వీడి మోక్షము నెన్నడును అపేక్షింపకుందురు. వారు ముక్తులై యుండీ కూడ లోకములోనికి వచ్చుచు పోవుచునుందురు. ఇందు నివసించుచుందురు. వారు నిర్హేతుకజాయమానకరుణాపరులై యుందురు. మనలోని కాంక్షాతీవ్రతను పరికించినచో వారు భగవానుని కృప వలన ఆ స్వామి యొక్క సంకేతము నిలుపుకొన్న పవిత్రమైన తమ దర్శన స్పర్శ భాషణములతో తమ మహత్తరమైన కృప చేత ప్రేరితులై మనకు అవశ్యము భగవత్ప్రేమను ప్రసాదింతురు. కారణమేమన్న వారు ప్రేమిజనులనే అన్వేషించుచుందురు. వారి పనియే ప్రేమను ప్రసాదించుట యైయుండును. కాబట్టి సాధకులారా! భగవత్సంగము గలవారు, ప్రేమిభక్తులు నగు అట్టి మహానుభావుల సాంగత్యమునే యభిలషింపుడు! వారి యనుగ్రహమునే కోరుకొనుడు.

* * * * *

# ప్రేమరూపభక్తియందు ప్రధానము దుస్సంగ నిర్మూలనము

## ''దుస్సంగః సర్వథైవ త్యాజ్యః.'' (43)

దుస్సంగమును సర్వవిధముల పరిత్యజించివేయవలెను.

ఇంతవరకు సత్సంగమహత్త్వమును వివరించి దేవర్షి యిప్పుడు దుస్సంగమును నిషేధించుచున్నాడు. ఏ విధముగా సత్సంగము వలన భగవత్కథ, భగవద్విషయబోధ, భగవన్నామము, భగవత్ప్రీతి, సదాచారము, శాస్త్రము, వివేకము, వైరాగ్యము, సదభ్యాసము, సేవ, సారళ్యము, నమ్రత, క్షమ, తితిక్ష, శౌచము, దయ, అహింస, సత్యము, బ్రహ్మచర్యము, అభిమానరాహిత్యము, శాంతి మున్నగువానియందు మనఃప్రవృత్తి కలుగుట, మానవుడు సదాచార పరాయణుడై పరమభక్తుడగుట సంభవమగునట్లుగా, దుస్సంగము వలన విషయప్రసంగము, లౌకిక విషయముల సంభాషణ, లోకనింద, భోగప్రీతి, దురాచారము, విశృంఖలత్వము, అవివేకము, విషయలంపటత్వము, దురభ్యాసము, దురభిమానము, దంభము, దర్పము, క్రోధము, అసహనము, అపవిత్రత, నిర్దయత్వము, హింస, అసత్యము, ఇంద్రియలోలత, అభిమానము, అశాంతి మున్నగు దుష్టవిషయములందు మనఃప్రవృత్తి గలిగి మానవుడు పాపాచారపరుడు, విషయాసక్తుడు అగును. దుస్సంగము వలన ఆసురీసంపదకు సంబంధించిన దుర్గుణములు, దురాచారములును అన్నియు అంకురించి, విస్తరించ నారంభించును. మానవుని సమస్త సద్గుణములును నశించి క్రమముగా అతడు భ్రష్టుడైపోవును.

పరమసౌశీల్యవంతురాలు, స్నేహమయి, ప్రేమమూర్తి యైన దేవి కైకేయి మంథరతోడి దుష్టసంగతి కారణముగా దశరథ మహారాజునకు, భరతునకు, తనకు, అయోధ్యావాసులకు ఎల్లరకు మహాదుఃఖము గలుగుటకు కారణభూతురాలైనది. ఈ కారణముననే ఆమె కడకు దుఃఖదాయకమైన వైధవ్య దురవస్థకు గురియయ్యెను. ప్రాణప్రియుడైన భరతుని అప్రసన్నతకు లక్ష్యభూతురాలయ్యెను. శకునితోడి దుస్సాంగత్యమే మహాభారత సంగ్రామమునకు ఒక ప్రధానకారణమయ్యెను. శ్రీమద్భాగవతములో భగవానుడైన కపిలదేవుడు దేవహూతితో ఏమనెనో చూడుడు. -

యద్యసద్భిః పథి పునః శిశ్నోదరకృతోద్యమైః
ఆస్థితో రమతే జంతుః తమో విశతి పూర్వవత్
సత్యం శౌచం దయా మౌనం బుద్ధిః శ్రీర్హ్రీర్యశః క్షమా.
శమో దమో భగశ్చేతి యత్సంగాద్యాతి సంక్షయమ్
తేష్వశాంతేషు మూఢేషు ఖండితాత్మస్వసాధుషు
సంగం న కుర్యాచ్ఛోచ్యేషు యోషిత్క్రీడామృగేషు చ

**(3/31/32-34)**

"శిశ్నోదరపరాయణులైన (స్త్రీలంపటులు, ధనాసక్తులు) నీచ మానవులతో గూడి వారివలెనే ప్రవర్తిల్లువాడు, వారివలెనే అంధకారమయములైన నరకముల పాలగును. కారణము ఏమనగా దుష్టసాంగత్యము వలన సత్యము, పవిత్రత, దయ, మనన ప్రవృత్తి, బుద్ధి, లజ్జ, శ్రీ, కీర్తి, క్షమ, మనోనిగ్రహము, ఇంద్రియనిగ్రహము, ఐశ్వర్యము, మున్నగు ఉత్తమగుణము లన్నియు అంతరించిపోవును. కాబట్టి యశాంతచిత్తులు, మూర్ఖులు, దుష్టులు, నగు నా మానవులతోడ సాంగత్యమునకు ఎన్నడును పాల్పడరాదు.'

దుష్టసాంగత్యమును ఎల్లరును పరిత్యజింపవలసినదే. భగవత్ప్రేమను అపేక్షించువారు మాత్రము ఈ దుస్సంగమును మిక్కిలి జాగరూకత వహించి పరిత్యజింపవలసియున్నది. శ్రీరామచంద్ర భగవానుడు. విభీషణునితో ఒక సందర్భమందు ''విభీషణా! నరకమునకు పోవుట యైనను మంచిదే. కాని దుర్జనసాంగత్యమునకు మాత్రము పాల్పడుట మంచిది కాదు సుమా!'' అని పలికి యున్నాడు. దుర్జన సాంగత్యమనగా కేవలము దురాచార పరాయణులైన వారి తోడి సాంగత్యము మాత్రమే కాదు. మన మనస్సులో చెడుభావనలను గలిగించునట్టిది, విషయవాంఛలను ఉదయింపజేయునది, మన మనస్సును భగవత్ప్రాప్తి మార్గమునుండి మరలించునదైన ఇంద్రియ విషయము ఏదియైనను దుస్సంగహేతువేయగును. మనము మన చిత్తములో విషయ చింతనమును ప్రబల మొనర్చునట్టి చేతనవస్తువును కాని, జడదృశ్యమును కాని చూడరాదు. అట్టి మాటల నాలకింపరాదు. అట్టి విషయములను చర్చింపరాదు. అట్టి యెడకు పోరాదు. అట్టి పుస్తకములను, పత్రికలను పఠింపరాదు. అట్టి చిత్తరువులను చూడరాదు. అట్టి పదార్థములను తినరాదు, తాకరాదు. ఆఘ్రాణింపరాదు. అట్టి యాలోచన మేదియు చేయరాదు. స్థానము, అన్నము, జలము, పరివారము, ఇరుగుపొరుగు, దృశ్యము, సాహిత్యము, ఆలోచన క్రమము, జీవికా నిర్వహణకార్యము, ఉపాసనయును పది యంశములును మానవునిలో ఉత్తమభావాలను కాని అధమ భావాలను కాని ఉత్పన్నము చేసి పెంపొందించుటకు ప్రధానకారణములగుచుండును. ఈ యంశములు అన్నియు సాత్త్వికములైననాడు వీని సేవనము వలన సాత్త్వికత్వము పెంపొందును. వీని (సాత్త్వికములైనవాని) సేవనమే సత్సంగమగును. అట్లు కాక యీ యంశములు రాజసములో, తామసములో అయినపుడు వీని సేవనము దుస్సంగము అగును. దాని వలన అజ్ఞానము పెంపొంది సమస్త దోషములు వికాసము చెందును. కాబట్టి సర్వవిధముల దుస్సంగమును వదలివేయవలెను.

''కామక్రోధ మోహాస్మృతిభ్రంశ బుద్ధినాశ సర్వనాశ కారణత్వాత్.'' **(44)**

ఏలయనగా అది (దుస్సంగము) కామము, క్రోధము, మోహము, స్మృతిభ్రంశము, బుద్ధినాశము, సర్వనాశమునను దురవస్థలకు కారణమగును.

భగవత్సంబంధమైన తత్త్వరహస్యము, లీలాచరిత్రములను కాదని భోగకాలమందు మాత్రమే ఇంద్రియతృప్తి గలిగించు లౌకికవిషయములను చింతించుచున్నచో అది సర్వనాశమునకు మూలకారణమగును. చిత్తము నిరంతరముగా గాని, అధికసమయము వరకుగాని యే విషయమును చింతించిన దానియందే దానికి ఆసక్తి కలుగును. దుస్సంగము వలన అనగా సాంసారిక విషయములతోను, విషయలంపటుల శరీరములతోను, వాక్కుతోను, మనస్సుతోను సాగింపబడు సంగము వలన స్వాభావికముగనే విషయాసక్తి పెంపొందును. దానివలన కామన కలుగును. ఈ కామనయే పాపములకు మూలకారణము. కామనాతృప్తి వలన ఇంకను ఎక్కుడు తృప్తిని పొందవలెనన్న లోభము ఉదయించును. అతృప్తి వలన ఆ కామన క్రోధముగా పరిణతమగును. ఈ కారణముననే భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు రాగ(ఆసక్తి)రూపమైన రజోగుణము వలన ప్రాదుర్భవించిన కామమే పాపములకు ప్రధానకారణమని తెలిపియుండెను. – ''మానవుడు తాను కోరకున్నను బలవంతముగా ప్రవర్తిల్లజేయబడుచున్నవానివలె దేనిచేత ప్రేరితుడై పాపము చేయుచున్నాడు? అని'' అర్జునుడు కృష్ణుని ప్రశ్నించును. దానికి బదులుగా భగవానుడు ఇట్లు పలికెను. –

**కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ (గీత. 3/37)**

'రజోగుణము వలన ప్రాదుర్భవించిన యీ కామమే క్రోధమగుచున్నది. ఈ మహాపాతకభూయిష్ఠమైన కామమునకు కడుపునిండుట యన్నది యెన్నడు నుండదు. ఈ విషయములో నీవు ఈ కామమునే నీ శత్రువుగా భావించుము!' కామమువలన లోభము, క్రోధము రెండును పుట్టుకొనివచ్చును. కాని లోకములో సాధారణముగా అనుకొన్న కోరికలు చాల తక్కువగా ఫలించుచుండును. అధికభాగము కోరికలు విఫలములే యగుచుండును. అవి విఫలములైన వేళ క్రోధముదయించును. అది యుదయింపగా మానవుడు వివేకశక్తిని కోల్పోవును. ఆ స్థితిలో వానికి హితాహితములు ఏవియు తెలియవు. అతడు పిశాచమువలె వినాశమునకే ప్రయత్నించును. ఈవ్యామోహములో చిక్కుకొనియున్నవాని స్మృతి భ్రష్టమైపోవును. స్మృతిభ్రంశమైన మీదట బుద్ధి భ్రష్టమగును. బుద్ధి కూడ భ్రష్టమయిపోయిననాడు మానవుడు ఇహపరములనుండి, కల్యాణ మార్గమునుండి పతితుడు అయిపోవును. కడకువాడు సర్వనాశమును పొందును. ఈ విషయమునే భగవానుడు గీతలో 2వ అధ్యాయములో 62-63 శ్లోకములలో చెప్పియున్నాడు. -

ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే.

క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః
స్మృతి భ్రంశాద్బుద్ధినాశః బుద్ధినాశాత్ ప్రణశ్యతి.

'విషయముల చింతనము వలన మానవులకు వానియందు ఆసక్తి జనించును. ఆసక్తి వలన కామన కలుగును. (ఆ కామన యొక్క తృప్తికి అవరోధము కలుగగా) దానినుండి క్రోధ ముదయించును. ఆ క్రోధము వలన సమ్మోహము, దానివలన స్మృతిభ్రంశము, దానివలన బుద్ధినాశము, ఆ బుద్ధినాశము వలన (పురుషునకు) సర్వనాశము సంప్రాప్తమగును.'

సర్వనాశనమునకు కారణభూతములైన విషయముల చింతనమునకు విషయములతోను, విషయలోలురైన పురుషులతోను కొనసాగు సాంగత్యమే మూలకారణము. ఇదియే దుస్సంగము. కావుననే దీనిని సర్వథా పరిత్యజించివేయవలయును.

''తరంగాయితా అపీమే సంగాత్ సముద్రాయంతి.'' **(45)**

ఇవి (కామక్రోధాదులు) మొదట తరంగములవలె (అల్పాకారములతో) వచ్చి కూడ (దుస్సంగ ప్రభావమున విశాలమైన) సముద్రము రూపమును దాల్చును.

దోషము లన్నియు సమూలముగా నశించిపోనంత వరకు ఏ కొంచెము దోషమున్నను భయపడుచునే యుండవలెను. ఇంధనమందు అణగియున్న యల్పమైన యగ్నికణము వాయువీచికలచేత పెచ్చరిల్లజేయబడి విరాడ్రూపమును దాల్చువిధముగా, అల్పమైన దోషమైనను దుస్సంగ ప్రభావము చేత పెరిగి పెరిగి విశాలరూపమును దాల్చును. తొలుదొల్త కామక్రోధములకు సంబంధించిన వికారము ఒక చిన్నతరంగము వలె నావిర్భవించును. అనంతర మది దుస్సంగప్రభావము చేత సముద్రమంతగా మారిపోవును. పిమ్మట అది నాలుగు వంకల నుండియు హృదయమును క్రమ్మివేయును. ఇక అందు ఉత్తమభావముల ప్రవేశమునకు అవకాశమే యుండదు. అట్లు కాగా సర్వనాశమగును. కాబట్టి యెన్నడు మాలో సద్గుణములే అధికముగా నున్నవి, దోషములు బహు తక్కువగానే యున్నవి, కావున దుస్సంగము వలన మాకెట్టి హానియు కలుగదు అని మాత్రము భావించుకొనరాదు. ఎల్లవేళల జాగరూకత వహించి సర్వ విధముల దుస్సంగమును పరిహరించుటకే ప్రయత్నించు చుండవలెను.

* * * * *

## మాయను ఎవడు తరించును?

కస్తరతి కస్తరతి మాయామ్? యస్సంగాంస్త్యజతి, యో మహానుభావం సేవతే, నిర్మమో భవతి. **(46)**

ఎవడు తరించును? (దుస్తరమైన) మాయను ఎవడు తరించును? ఎవడు సర్వసంగములను పరిత్యజించునో, ఎవడు మహానుభావులను సేవించునో, ఎవడు మమతారహితుడు అగునో (వాడు తరించును).

నదిలో ఈదుచున్న మానవునకు చేతులతోను, కాళ్లతోను నదినీటిని బలముగా తొలగద్రోయుటయు, నిరంతరము నీటిని చీల్చుకొనుచు ముందునకు బోవ పరిశ్రమించుటయు ప్రధానకర్తవ్యమగును. అట్లు చేసినప్పుడే అతడు నదిని దాటిపోగలుగును. నీటిని తొలగద్రోయుట మానివైచినచో అతడు వెంటనే నీటిలో మునిగిపోవును. ఆ విధముగనే మహాభయంకరము, దుస్తరమునైన మాయానదిని తరించిపోనెంచువాడు అందున్న యహంకారరూపము, విషయాసక్తి రూపము నగు జలమును అవిరామముగా తొలగద్రోయుచునే యుండవలెను. అహంకారము, ఆసక్తి యనెడు జలముతో ఈ మాయానది నిండియున్నది. ఈ యహంకారమును, ఆసక్తిని దూరముగా తొలగద్రోయక, వానిని పరిత్యజించుటకు పూనుకొనక నుండువాడు ఈ మాయానదీజలముతో ఆసక్తి కారణముగా మునిగిపోవును. కావున సంగపరిత్యాగము అవశ్యకర్తవ్యము. కాని యీ చర్యయందు ఒక్కొక్క యెడ కాళ్లతో, చేతులతో పరిశ్రమించి, పరిశ్రమించి యలసిపోవుట, ఊపిరి యాడని పరిస్థితికి గురియగుట సంభవమగును. కాబట్టి యట్టి పరిస్థితిలో నడుమ నడుమ ఒకింత సేపు ఒకచోట నిలిచి ఒకింత యలత దీర్చుకొనుటకు అనువగు ఆధారము ఏదియైన కావలయును. ఈ మాయానదిలో కూడ

కేవలము సంగపరిత్యాగమాత్రమున కార్యసాధనము గాదు. ఇందు కూడ విశ్రామస్థలము కావలయును. అట్టి విశ్రామస్థలములు ఏవి? సాధుపురుషుల సుధామయవచనములే యట్టి విశ్రాంతి స్థానములు. వానిని సహాయముగా మానవునకు నూతనబలము ప్రాప్తించును. ఆ బలముతో అతడు మాయాసాగరమును తరించిపోగల్గును. నిజము చెప్పవలెనన్న సాధుజనసేవనము చేయు మనుజుడు తన బలముతో ఈద నక్కరలేదు. అతడు సాధుపురుషుల కృపయను ఓడను అధిరోహించి యనాయాసముగా మాయాసముద్రమును తరించిపోగలుగును. కావుననే దేవర్షి మహానుభావులను సేవింపవలెనని చెప్పుచున్నాడు. శ్రీమద్భాగవతములో భగవానుడు కూడ ఏమనెనో చూడుడు!

> నిమజ్జ్యోన్మజ్జతాం ఘోరే భవాబ్ధౌ పరమాయనమ్
> సంతో బ్రహ్మవిదశ్శాంతా నౌర్దృఢేవాప్సు మజ్జతామ్.
>
> శ్రీమద్భాగవత (11/26/32)

'నీటిలో మునిగిపోవువారికి దృఢమైన నౌక యెట్లు ఆధారమగునో అట్లే యీ భయంకర సంసారసాగరమందు మునిగిపోవుచున్నవారికి శాంతచిత్తులు, బ్రహ్మవేత్తలు నగు సాధుపురుషులే పరమావలంబ మగువారు'.

మహానుభావులైన సాధుజనులను సేవించుట వలన పాపతాపములు, మోహమును అనాయాసముగా తొలగిపోవును.

> యథోపశ్రయమాణస్య భగవంతం విభావసుమ్
> శీతం భయం తమోఽప్యేతి సాధూన్ సంసేవతస్తథా.
>
> శ్రీమద్భాగవత (11/26/31)

భగవానుడైన యగ్నిదేవు నాశ్రయింపగా శీతము, భయము, అంధకారము అను మూడును అంతరించిపోవును. అట్లే సాధుజనులను సేవించుట వలన పాపము అనెడు శీతము, జనన మరణరూపమైన భయము, అజ్ఞానరూపమగు నంధకారము నంతరించిపోవును.

నిర్మలమైన హరిభక్తిని పొందుటకు మహాపురుషుల చరణసేవయే ప్రధానసాధనము. శ్రీమద్భాగవతములో భక్తప్రవరుడు ప్రహ్లాదుడు, దివ్యజ్ఞానసంపన్నుడు, అవధూత శిరోమణియు నగు జడభరతుడును పలికిన పలుకులు ఇవిగో। పరిశీలింపుడు।

నైషాం మతిస్తావదురుక్రమాంఘ్రిం
స్పృశత్యనర్థాపగమో యదర్థః
మహీయసాం పాదరజోఽభిషేకం
నిష్కించనానాం న వృణీత యావత్.

శ్రీమద్భాగవత **(7/5/32)**

'ప్రహ్లాదుడు అన్న మాటలు - తండ్రీ। భగవానుడైన శ్రీహరియొక్క చరణకమల సంస్పర్శము సర్వానర్థములను తొలగించునట్టిది. అకించనులైన (భగవానునకు సర్వస్వమర్పణము గావించుకొన్న) మహానుభావులగు సాధుపురుషుల పాదధూళితో మస్తకము అభిషిక్తము కానంత వరకు మానవునకు ఆ శ్రీహరి చరణములపై ప్రేమ యుదయింపదు.'

రహూగణైతత్తపసా న యాతి
న చేజ్యయా నిర్వపణాద్గృహాద్వా
నచ్ఛందసా నైవ జలాగ్నిసూర్యైః
వినా మహత్పాదరజోఽభిషేకమ్

శ్రీమద్భాగవత **(5/12/12)**

మహాత్ముడు జడభరతుడు మహారాజైన రహూగణునితో అన్న మాటలు. -

'రహూగణా! భగవత్తత్త్వ పరిజ్ఞానము, భగవత్ప్రేమ యనునవి తపస్సు, యజ్ఞము, తర్పణము, గృహస్థధర్మము, వేదాధ్యయనము, జలము, అగ్ని, సూర్యోపాసనము అను వీని వలన ప్రాప్తించునట్టివి కావు. ఇవి మహాపురుషుల పాదధూళితో స్నానమాచరించినప్పుడే (వారికి పాదసేవ చేయుటవలననే) ప్రాప్తించును.'

కాని ఒక్క విషయము గుర్తుంచుకొనవలసియున్నది. మహాపురుషుల సేవ యనగా కేవలము వారి సమీపమందు ఉండుటయో, వారికి శరీరసేవ చేయుటయో మాత్రమే కాదు. అదియు కొంతమేరకు ఆవశ్యకమే. కొంతవరకు అందు కూడ సార్థక్యమున్నది. కాని వారి యాజ్ఞానుసారము క్రియ సాగనంత వరకు, వారి సంకేతానుసారము నడచుకొననంత వరకు, వారి యిచ్ఛానుసారము జీవన నిర్మాణము గావించుకొననంత వరకు సేవలో లోపము ఉన్నదనియే భావింపవలయును. కాబట్టి యీ విషయమును దృష్టియందు ఉంచుకొని అన్నివిధములా మహానుభావుల సేవ చేయుచుండవలెను.

కాని మమకారము ఒక పెద్ద యవరోధము కాగలదు. మమతాబంధముండగా సాధుజనసేవ సాగనే సాగదు. ఇల్లు నాది, శరీరము నాది. కుటుంబము నాది. బంధువులు నావారు. భూమి నాది - అని యీ విధముగా నాది, నాది యనునట్టి యసంఖ్యాకబంధములలో జీవుడు బద్ధుడు. ఈ మమతాబంధములను త్రెంచుకొనవలయును. సత్సంగము వలన, సాధుజనసేవ యనెడు మణిదీపము యొక్క ప్రకాశము వలన మమకారమనెడు అంధకారమయమైన రాత్రియందలి చీకటి యొకింత మేరకు అవశ్యము క్షీణించుననుట నిజము. అయినను ముందు

సత్సంగములో చేరుటకు కూడ మమకారమును క్షీణింపజేసికొనవలసిన యావశ్యకత యున్నది. కాబట్టి లౌకికముగా ఈ మమకారమునకు సంబంధించిన విషయములను దుఃఖస్వరూపములుగాను, అజ్ఞానమూలకములు గాను భావించుకొని, సర్వవిధముల వాని యెడల మమకారమును విసర్జించివేయవలెను. లోకములో నాదియనునది ఏదియు లేదనియే భావించుకొనుచుండవలెను. ఏ శరీరమును మానవుడు నాది యనియే కాక నేను అని కూడ వ్యవహరించుచుండునో అది కూడ కడకు నశించిపోవునదే!. అట్టి యెడ ఇతర వస్తువులతోడ మమతాబంధములను కల్పించుకొనుట మూర్ఖత్వము కాక మరేమగును? మాయను తరింపవలె నన్న ఈ మమకారమును అంతరింపజేసికొనవలెను. అట్లు చేసినవాడే యీ మాయను తరించిపోవగల్గును.

'యో వివిక్తస్థానం సేవతే, యో లోకబంధ మున్మూలయతి, నిస్త్రైగుణ్యో భవతి, యోగక్షేమం త్యజతి.'' **(47)**

నిర్జన ప్రదేశమందు నివసించువాడు, లోకబంధములను త్రెంచుకొన్నవాడు, త్రిగుణములకును అతీతుడైనవాడు, యోగక్షేమ పరిత్యాగము గావించినవాడును ఎవడో (వాడు మాయను తరించును.)

మాయను తరించుటకు ముందు సూత్రములో మూడు ఉపాయములు చెప్పబడినవి. ఇప్పుడు ఈ సూత్రములో నాలుగు ఉపాయములు చెప్పబడుచున్నవి. ముందు రాబోవు రెండు సూత్రములలోను ఇంకను అయిదు ఉపాయములు, లేక లక్షణములును తెలుపబడును.

రేబవళ్ళు మమకారమునకు కారణభూతములైన వస్తువుల నడుమ నివసించుచుండగా ఈ మమకారము అంతరించదు. పైగా మరియింత పెంపొందును. కాబట్టి సాధకుడు ఏకాంతసేవనము చేయువలెను. భగవానుడు గీతలో - ''వివిక్తదేశసేవిత్వ మరతిర్జనసంసది'' అని చెప్పియున్నాడు. అనగా ఏకాంత స్థానమందు ఉండవలెనని, జనబాహుళ్యమందు ప్రీతి యుండరాదని భావము. మానవుడు ఎంతగానైన సాధన చేయువచ్చును. కాని యతడు ఎంత వరకు విషయవాసనలతో బంధితులైన జనుల నడుమను, మోహమును గలిగించు విషయములతో నిండిన స్థానములందును నివసించునంత కాలము అతని మనస్సు భగవానుని యందు లగ్నమగుట చాల కష్టము. కావుననే సాధకుడు ఏకాంతప్రదేశమందు ఉండి భక్తిసాధన చేయవలెనని చెప్పుట! జరిగినది. సాధనతోబాటు భగవానునితోడ ప్రేమబంధనము బలపడుటకై ప్రయత్నపూర్వకముగా లోకబంధనమును త్రెంచికొనవలసియున్నది. ఏకాంతవాసమందు లోకసంబంధముండదు. కాబట్టి లోకబంధము స్వయముగనే సడలిపోసాగును. ఇంతియే కాక భగవానుని రహస్యము, తత్త్వము, ప్రభావము వంటి విషయములతో వ్యుత్ప్యమయమై, దుఃఖమయమైన యీ లోకమును పోల్చి మాటికి మాటికి విచారణ చేయుచుండుట వలన యీ లోకబంధము తనయంత తానే విడిపోవును.

దీని యనంతరము సాధకుడు సత్త్వరజస్తమోగుణములను మూడింటిని అతిక్రమింపవలయును. ఈ గుణముల వలననే లోకము ప్రకటమగుచుండును. ఈ గుణముల కార్యమే యీ సమస్తలోకము. కాబట్టి యీ లోకమునకు సంబంధించిన పదార్థములయందు అనాసక్తి, విరక్తి కలుగుటయే నిస్త్రైగుణ్యత్వము, లోకసంగరాహిత్యము నగును. విషయాసక్తుడు, విషయములను కామించువాడును ఎవడో వాడే త్రిగుణములచేత బంధింపబడినవాడు. భగవదాసక్తుడు, భగవానుని

ప్రేమించువాడే త్రిగుణాతీతుడు. త్రిగుణాతీతుడైనవానికి యోగక్షేమ చింత యేల కలుగును? లోకము విషయమున ప్రలోభనము కలుగనే కలుగదు. ఏలయన అతడు త్రిగుణాతీతుడు. మోక్షసిద్ధి విషయమున కూడ వానికి అపేక్ష యుండదు. ఏలయన అతడు భగవానుని ప్రేమిభక్తుడు. అప్రాప్తమైనదాని ప్రాప్తి, యోగమనబడును. ప్రాప్తమైనదాని రక్షణము క్షేమ మనబడును. ఇందు కేవలము భోజనాచ్ఛాదనాదులు అన్నభావము మాత్రమే లేదు. పారమార్థికమైన యర్థమందు భగవత్ప్రాప్తి, లేక భగవత్ప్రాప్తికి సంబంధించిన సఫలసాధన యోగమని యెరుగవలెను. భగవత్ప్రాప్తి సాధనను సంరక్షించుకొనుట క్షేమమని యెరుగవలెను. భగవానుని ప్రేమిభక్తుడు ఈ రెండు అర్థములందును కూడ యోగక్షేమమును లెక్కచేయడు. అతడు భగవత్ప్రేమయందు తన్మయుడై యుండుచు భగవత్ప్రేరణను అనుసరించి సర్వదా భగవదనుకూలముగా స్వాభావికముగా కర్మలను ఆచరించుచుండును. భక్తుని యోగక్షేమభారమును స్వయముగా భగవానుడే వహించుచుండును. భగవానుడు గీతలో చెప్పియున్నాడు. -

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. (9/22)

'ఏ అనన్యభక్తులు నిరంతరము నన్నే స్మరించుచు నిష్కామభావముతో నన్నే ఉపాసించుచుందురో అట్టి నిత్యము నాయందు లగ్నమైన మనసు కలవారై యుండు భక్తుల యోగక్షేమమును నేను స్వయముగా వహించుచుందును.' ఇక్కడ ఈ యోగక్షేమ భారవహనమునకు సంబంధించిన ఒక గాథను క్రింద నుదాహరించుచున్నాము. గ్రహింపుడు!

# యోగక్షేమభారవహనము - ఉదాహరణగాథ

శ్రీజగన్నాథస్వామికి నెలవైన పురీక్షేత్రమునందు పూర్వము సరళ హృదయుడు, సదాచారపరుడు అయిన బ్రాహ్మణుడు సకుటుంబముగా నివసించుచుండెను. అతనికి భగవద్గీతయందు ప్రీతి మెండు. అతడు రాత్రింబవళ్ళు ఆ గ్రంథమును అధ్యయనము, మననము చేయువాడు. అతనిలో యింకను కోరికలు నశించలేదు. కాని యతనికి భగవానుని యందు గాఢమైన విశ్వాసముండెను. ఒకనాడు అతడు భగవద్గీతలోని ప్రతి శబ్దార్థము వ్యవహారమందు ఎంతవరకు సమన్వయపడునో తెలిసి కొనవలె నని సంకల్పించుకొని యా దృష్టితో గీతను అధ్యయనము చేయనారంభించెను. అట్లు పఠనము చేయుచుండగా ఒకనాడు 'అనన్యాశ్చింతయంతో మాం' అన్న శ్లోకములోని 'వహామ్యహమ్' అన్న శబ్దము అతని దృష్టికి వచ్చెను. అప్పుడు ఆ బ్రాహ్మణుడు ఇట్లు ఆలోచింపసాగెను. - ''ఏమి? భగవానుడు భక్తునకు అవశ్యకములైన వస్తువులను మూటగట్టి భుజాన వైచికొనిపోయి అతని యింటి కడకు స్వయముగా చేర్చునా యేమి? కాదు. కాదు అట్లు సంభవము గాదు. భగవానుడు అన్యమైన యే సాధనము మూలముననైన ఆ వస్తుసంగ్రహమును భక్తుని యింటికడకు చేరునేర్పాటు చేయవచ్చును.'' ఇట్లు ఆలోచించి యా బ్రాహ్మణుడు 'వహామ్యహమ్' అను శబ్దము యొక్క అర్థము వ్యవహారమందు సమన్వయము కాదని యెంచి యా శబ్దమును కొట్టివైచి దాని స్థానమందు 'కరోమ్యహమ్' అని వ్రాసికొనెను. దీనికి చేయుదునని అర్థము. చేయుట యన్నది యే యితర సాధనము చేతనైనను సాధ్యమగును అన్నది యా బ్రాహ్మణుని యభిప్రాయము. అతడు భిక్షావృత్తితో జీవన నిర్వహణము చేయువాడు. భగవానుని మాయ మేరలు లేనిది. ఒకనాడు రోకటి లావున వాన కురియ నారంభించెను. ఆ నాడు బ్రాహ్మణుడు భిక్షకై బయటకు

పోలేకపోయెను. ఆ కారణమున అతడు సకుటుంబముగా ఆనాడు ఉపవాసము చేయవలసినవచ్చెను. మరునాడు వాన తగ్గెను. అప్పుడు అతడు భిక్షార్థము బయలువెడలెను. అతడు ఇల్లు విడిచి యొకింత దూరము వెడలినంతలో ఒక అత్యంత సుందరాకారుడైన బాలకుడు రక్తలిప్తమైన శరీరముతో ఆ బ్రాహ్మణుని యింటికివచ్చి యతని భార్యతో - ''అమ్మా! పండితులవారు ఈ ప్రసాదమును మీకు అందజేయుమని నన్ను పంపిరమ్మా!'' యని పలికెను. అంతట నా బ్రాహ్మణి యా బాలకుని ముగ్ధమనోహరరూపమును జూచి, వాని మధురవచనముల నాలకించి యానందభరితురాలాయెను. కాని వాని శరీరము రక్తలిప్తమై యుండగా చూచి దుఃఖపూరితురాలయ్యెను. కన్నుల నీరు జారతెచ్చుకొని యామె - ''నాయనా! ఇట్లు నిన్ను ఏకఠినాత్ముడు కొట్టెను?'' అని యా బాలకుని ప్రశ్నించెను. బాలకుడు అప్పుడు ''అమ్మా! పండితులవారే నన్ను కొట్టిరమ్మా!'' యని బదులు చెప్పెను. ఆ మాట విని యా బ్రాహ్మణి యాశ్చర్యమును పొందెను. ఆమె మరల - 'బిడ్డా! ఆయన బహుసాధుస్వభావులే! పరమభాగవతోత్తములే! నీవంటి నయనమనోహరుడగు సుకుమారబాలకుని ఆయన ఎందులకు కొట్టును?' మరల ఆ పిల్లవాడు 'తల్లీ! నేను నిజము చెప్పుచున్నానమ్మా! ఆయనయే ఒక శూలమువంటి దానితో నా శరీరమును గీరి గాయపరచెనమ్మా! అట్లు ఎందులకు చేసెనో ఆయనకే తెలియవలె నమ్మా!' అని బదులు చెప్పెను.

అట్లు పలికి ఆ పిల్లవాడు ప్రసాదమునిచ్చి అటనుండి వెడలిపోయెను. అన్యమనస్కురాలైయున్న కారణమున బ్రాహ్మణి యా బాలకుడు వెడలుటను గమనించలేకపోయెను. ఆమె యేమియు నర్థముగాక దుఃఖాకులచిత్తయై పతి యాగమనమునకై ప్రతీక్షింపసాగెను. సమయము కాగా బ్రాహ్మణుడు మరలి వచ్చెను. బ్రాహ్మణి వినయముతోను,

రోషముతోను, విషాదపూరిత స్వరముతోను భర్తకు వృత్తాంతమంతయు నివేదించెను. భార్య చెప్పిన విషయమును విని భర్త మారుమాటలేక నిశ్చేష్టుడయ్యెను. భగవద్గీతా శ్లోకమును తాను కలముతో గొట్టివైచిన సంగతిని దలచుకొని యతడత్యంత వ్యాకులత చెందెను. అతని కన్నులనుండి యశ్రుధారలు పారసాగెను. భగవానుడు తనను విశ్వసించు భక్తునకై ఆహారాదికమును మోసికొనివచ్చునని యిప్పుడు అతడు తెలిసికొనగలిగెను. గీత యన్నది భగవానుని శరీరము. అందలి శ్లోకమును ఖండించుట వలన భగవానుని శరీరమందు గాయమయ్యెను. బ్రాహ్మణుడు తన పనిని గూర్చి చింతించి, చింతిచి మూర్ఛితుడై క్రిందపడిపోయెను. భగవానుడప్పుడు అతనికి దర్శనమిచ్చి యతనిని కృతకృత్యుని గావించెను. కొంత తడవైన పిమ్మట ఆ బ్రాహ్మణుడు లేచి భగవానుని క్షమాభిక్ష కోరుటయే కాక భావవిహ్వలుడై యా భగవద్గీతకు నాలుగు వంకల 'వహామ్యహమ్, వహామ్యహమ్' అని వ్రాయుట మొదలు పెట్టెను.

కాబట్టి సాధారణ విశ్వాసము గల భక్తుడు కూడ భోజనాదికమును గూర్చి చింతింపనవసరము లేదు. భోజనాదికమును గూర్చి భగవానునిపై ఆధారపడక న్యాయమునను, సన్మార్గమును, సదాచారమును వీడి పాపమార్గము నవలంబించినవారిని నాస్తికులనియే తలపవలయును. ఈ విషయము శాస్త్రమందు చెప్పబడియున్నది కూడ. -

భోజనాచ్ఛాదనే చింతాం వృథా కుర్వంతి వైష్ణవాః
యోఽసౌ విశ్వంభరో దేవః స కిం దాసానుపేక్షతే?

(జ్ఞానసారము)

'వైష్ణవులు ఆహారాదికమును గూర్చి వ్యర్థముగా చింతించుచుందురు. ఎల్ల విశ్వమందును ఉన్న సమస్తజీవులను భరించువాడు, పోషించువాడు నగు భగవానుడు తన సేవకులను ఉపేక్షించునా?'

''యః కర్మఫలం త్యజతి, కర్మాణి సన్న్యస్యతి తతో నిర్ద్వంద్వో భవతి.'' (48)

కర్మఫలమును పరిత్యజించినవాడు, కర్మలను కూడ వీడినవాడు, సర్వమును పరిహరించి శీతోష్ణాదులను సహించువాడు. (అతడు మాయను తరించిపోవును.)

యోగక్షేమ చింతను వీడివాడుకర్మఫలమును త్యజించినవాడే యగును. లేదా యోగక్షేమ త్యాగము గావించుటకు కర్మఫలమును త్యజింపవలసియుండును అని కూడ చెప్పవచ్చును. నిజము చెప్పవలెనన్న ఇటనుండి పరమభక్తుని లక్షణములు మొదలైనవని తలపవచ్చును. ఇవి భక్తిసాధన చేయువారికి ఆదర్శప్రాయములైన సాధనములు. సిద్ధిగన్న ప్రేమిభక్తుల స్వాభావిక గుణములు. భక్తుడు ఏమి చేసినను భగవానుని కొరకే చేయును. అతడు చేసినదాని ఫలమును తా నేమియు కోరడు. అతనికి కర్మయందును ఆసక్తి యుండదు. దాని ఫలమందును ఉండదు. అతడు యంత్రమువలె కర్మ చేయుచుండును. నేను యంత్రమును, భగవానుని కొరకు కర్మ చేయుచున్నాను అన్న పరిజ్ఞానము ఉండునంత వరకు అతడు కర్మఫలమును మాత్రమే త్యజించినవాడు అగును. నేను ఏమియో చేయుచున్నాను అన్న పరిజ్ఞానము కూడ తొలగినప్పుడు అతడు కర్మను కూడ త్యజించిన వాడగును. మానవుడు తన మనోబుద్ధులను పూర్తిగా భగవదర్పణము గావించినప్పుడు భగవానుడు వాని యహంకారమును హరించివైచి వాని హృదయమందిరములో ప్రవేశించి యుండి కర్మలను చేయుట, చేయించుట సాగించును. ఆ దశయందు మానవుడు సంపూర్ణముగా కర్మపరిత్యాగము జేసినవాడై ప్రకృతి బాధలను సహించువాడు అయిపోవును. ఇక వానికి సుఖదుఃఖములు, నిజ పరభేదములు, నేను, నీవు అన్న భావాలు ఆదిగా గల జంటలతో ప్రయోజన మేదియు నుండదు. కాని అట్టి సహజస్థితి ప్రాప్తించనంత

వరకు అతడు సాధనరూపముగా కర్మఫలత్యాగము, భగవద్విరుద్ధములు, ననావశ్యకములు నగు కర్మలను స్వరూపపూర్వకముగా పరిత్యాగమును గావించి సహింపుస్థితిని పడయుటకు ప్రయత్నము చేయుచుండవలెను. భగవానుడు కూడ చెప్పియున్నాడు.-

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్. (గీత 2/45)

'ఓ యర్జునా! వేదములు త్రిగుణములయు వ్యక్తరూపమగు లోకమును ప్రకాశింపజేయునవి. కావున త్రిగుణరహితుడవు, లేక నిష్కామునడవు, సుఖదుఃఖాదిద్వంద్వముల నధిగమించినవాడవు, యోగక్షేమాపేక్షలేనివాడవు, నిత్యము సత్త్వమందు ఉండువాడవు, పరమాత్మ పరాయణుడవును గమ్ము!'

''వేదానపి సన్న్యస్యతి, కేవలమవిచ్ఛిన్నానురాగం లభతే.'' **(49)**

వేదములను కూడ పరిత్యజించినవాడు, కేవలము (తైలధారవలె) విచ్ఛిన్నము కానట్టి నిరంతర భగవత్ప్రేమను పడసినవాడును ఎవడో (అతడు మాయను తరించిపోవును.)

సాధన దృష్టితో పై నుదాహరింపబడిన భగవద్గీతాశ్లోకము (2/45) ను అనుసరించి త్రిగుణముల ప్రకాశరూపమైన లోకమును ప్రకటించునట్టి వేదముల పరిత్యాగము చేయవలెను అనుటనుండి నిష్కాముడు కావలెను అను నర్థమును గ్రహించుట బాగుగా నుండును. సకామభావత్యాగమే వేదపరిత్యాగము. కాని యిక్కడ నారదుడు వివరించు ప్రేమావస్థయందు భక్తుడు కేవలము ఒక యవిచ్ఛిన్నము, నఖండమునైన

భగవత్ప్రేమ మహాసముద్రములో మునిగి తన్మయత్వమును పొందును. ఆ స్థితియందు వేదముల యాశ్రయలక్షణము స్వయముగనే తొలగిపోవును. ఆ పరిస్థితికి జేరిన భక్తుని వలన లౌకికము, వైదికమునైన యే క్రియయు యథావిధిగా సంపన్నము గాదు. ఎల్ల నియమములు తమంతతాము తొలగిపోవుటయే యీ ప్రేమ యొక్క నియమము. శాస్త్రవిధానము కూడ నిదియే. ఈ స్థితిలో వేదములు తమ యాశ్రితుని వేదముల పరమఫలము నందుకొనగా జూచి యతని పరమము, చరమమునైన తృప్తి యెడల సంతుష్టములై యతనిని వదలివేయును. ఈ వేదత్యాగము తిరస్కారమూలకమైనది కాదు. తృప్తి మూలకమైనది. బుద్ధి పూర్వకముగా అతడు వేదములను విడిచిపెట్టుట కాదు. వేదములే అతనిని పూర్ణకాముడని యెంచి వాని పైనుండి తమ యాధిపత్యమును తొలగించికొనును. ఈ దశలో భక్తుడు విధి నిషేధమయములైన వేదమును అధిగమించి కేవలము ఒక విధమగు అనిర్వచనీయ ప్రేమదశలో తాదాత్మ్యమును పొందును. అతడు సజీవమైన యొక భగవత్ప్రేమ స్వరూపము అయిపోవును. స్వయముగా భగవానుడే యతని శరీరమందు దివ్యప్రేమరూపమున ప్రకటమై లీలను సాగించును.

''స తరతి స తరతి స లోకాంస్తారయతి.'' (50)

అతడు తరించును. అతడు తరించును. అతడు లోకములను తరింపజేయును.

ఈ విధముగా భగవత్ప్రేమలో మత్తిల్లినవాడు తాను తరించుటయే కాక లోకములను అన్నిటిని తరింపజేయును అని దేవర్షి నారదుడు ముక్తకంఠముగా చెప్పుచున్నాడు. అతడే నిజముగా తరించినవాడు, తరింపజేయువాడు నగును. భగవానుడు శ్రీమద్భాగవతములో

'మద్భక్తియుక్తో భువనం పునాతి' - 'ఇట్టి నా భక్తుడు మూడు లోకములను పవిత్రములను గావించును' అని చెప్పియున్నాడు.

నలుబదియారవ సూత్రములో 'మాయను ఎవడు తరించును?' అని ప్రశ్నించి యింతవరకు ఆ ప్రశ్నకు బదులు చెప్పుట యైనది. నాలుగు సూత్రములలో ప్రేమయొక్క సాధనలు, పరమభక్తుల లక్షణములు వివరింపబడినవి. ఇటుపై పరమభక్తులైన మహానుభావులు ఏ ప్రేమను పొంది సహజగుణముల రూపములో ఈ దుర్లభస్థితిని అందుకొనగలుగుదురో దాని స్వరూపము వివరింపబడును.



## ప్రేమభక్తి స్వరూపము - గౌణభక్తి స్వరూపము

''అనిర్వచనీయం ప్రేమస్వరూపమ్.'' (51)

ప్రేమ స్వరూపము అనిర్వచనీయమైనది.

ప్రేమకు, పరమాత్మకు భేదము లేదు. వాక్కుతో బ్రహ్మస్వరూపమును వర్ణింపగలుగుట యసంభవము. వేదములు 'నేతి నేతి - అదికాదు, అదియును కాదు' అని పలికి, యా బ్రహ్మస్వరూపము ఇట్టిదని చెప్పుటకు శక్యము గాక యూరకుండుచున్నది. అట్లే ప్రేమస్వరూప వర్ణనము కూడ వాక్కు వలన సాధ్యము కాదు. ఏదియైన ప్రియమవస్తువు మనకు ప్రాప్తించినప్పుడు, తత్సమాచారము తెలియవచ్చినప్పుడు, తత్సంస్పర్శము, తదాలింగనము, తత్ప్రేమాలాపమునకు సదవకాశము వచ్చినప్పుడు బహుధా మన హృదయము ఆనందభరితమయిపోవుచుండుట లోకములో మనము చూచుచునే యుందుము. ఆ యానందమును వర్ణించుట వాక్కునకు సంభవము కాదు. వాక్కుతో వర్ణింపసాధ్యమగు ప్రేమ సర్వవిధముల ప్రేమయొక్క బాహ్యస్వరూపమే యగును. ప్రేమ అనుభవైకవేద్యమైనది. భగవానుడు శ్రీరామచంద్రుడు లంకలో ఉన్న జగజ్జననియగు జానకికి ఇట్లు సందేశ మంపియుండెను. -

దేవీ! మనిద్దరి మధ్యనున్న ప్రేమతత్త్వము ఒక నా మనసునకే తెలియును. ఆ నా మనసు నీ వద్దనే యున్నది. దీనిలోనే నీవు ప్రేమతత్త్వమును తెలిసికొనగలవు.

ప్రేమానుభవము మనస్సులో నుండును. మనస్సు సర్వదా తన ప్రేమిక చెంత నుండును. ఆ దశలో మనస్సే లేనప్పుడు వాక్కునకు

ఒకింతయైన వర్ణనమునకు అవసరమైన సామగ్రి ఎక్కడనుండి ప్రాప్తించును? కాబట్టి ప్రేమకు సంబంధించిన వర్ణనము కేవలము సాంకేతికము (బాహ్యము) మాత్రమే యగును. ప్రేమ ప్రాప్తించక ముందు దానిని ఎవ్వడును ఎరుగడు. అది ప్రాప్తించిన మీదట మానవుడు మనస్సును కోలుపోవును. నీటిలో వెలుపలగా శిరస్సు యున్నంతవరకు మాత్రమే శబ్దమును ఉచ్చరించుట సాధ్యమగును. మానవుడు నీటిలో నడుగుభాగము వరకు మునిగిపోయినప్పుడు వాని శవమును కూడ వెదకి పట్టుకొనుట దుస్సాధ్యమే. ఆ విధముగనే ప్రేమసముద్రములో మునిగిపోయినవాడు ఏమియు పలుకజాలడు. అట్లుకాక పైపైని మునిగి తేలుచున్నవాడు ఏమైన పలుకగలుగును. కాని వాని మాటలు పైపై మాటలే యగును.-

## ''మూకాస్వాదనవత్.'' (52)

మూగవాని రుచి చూచుటవలె

మూగవాడు బెల్లము తిని యానందించును. కాని దాని రుచిని మాత్రము చెప్పజాలడు. అట్లే ప్రేమిభక్తుడైన మహానుభావుడు ప్రేమానుభవమును పొంది యానందానుభూతి నందగలడు. కాని యా యనుభవ స్వరూపమును ఎవని ముందును మాటలతో తెలుపజాలడు. ఈ ప్రేమయందు తన్మయత్వముండును. కాబట్టి ప్రేమికుడైనవాడు తాను ఏమో, తాను ఏమి యెరిగెనో తెలిసికొనజాలడు. ఈ కారణముననే శ్రీరాధికాదేవి ఒకప్పుడు తన సకియతో - ''సకియా! శ్రీకృష్ణ ప్రేమ విషయము ఏమియో నాకు తెలియదు. నేను ఎరిగినదానిని ప్రకటించుటకు నావద్ద మాటలు లేవు. నా హృదయములో ఆ ప్రేమస్పందనము కలుగుటతోడనే నాలోని జ్ఞానమంతయు నంతరించిపోవుచున్నది.'' (లుప్తమయిపోవుచున్నది.)

''ప్రకాశతే క్వాపి పాత్రే.'' **(53)**

అరుదుగా ఎవడో యోగ్యుడు, పాత్రుడు నయినవానియందు (పరమభక్తుని యందు) అట్టి ప్రేమ ప్రకటమగును.

వాక్కుతో ప్రేమస్వరూపమును వర్ణింపనలవి కాదు అనుట నిజమే!. కాని భాగ్యశాలియైన ఏ మహాపురుషుడైన భక్తిరసముతో తాదాత్మ్యమునొంది తనువు, మనము మరచి దివ్యోన్మాదముతో నున్మత్తుని చేష్టలవంటి చేష్టలకు పాల్పడినప్పుడు ఆ ప్రేమయొక్క ప్రకాశము జనుల ముందు కొంచెము, కొంచెము తెలియవచ్చును. ఆ స్థితిలో నట్టి మహాత్ముని వాక్కు నుండి, కన్నులనుండి మాత్రమే కాక రోమరోమము నుండియు ప్రేమకిరణములు తమంత తాముగా బహిర్గతమగుట మొదలగును. ఈ ప్రేమప్రకాశము సాక్షాత్తు భగవానుని ప్రకాశమే యగును. ఇట్టి ప్రకాశము అరుదుగా పరమభక్తుడైన యే మహాపురుషునియందో సంభవమగును.

''గుణరహితం కామనారహితం ప్రతిక్షణవర్ధమానమవిచ్ఛిన్నం సూక్ష్మతరం అనుభవరూపమ్.'' **(54)**

ఈ ప్రేమ గుణరహితమైనది. కామనారహితమైనది. క్షణక్షణ ప్రవర్ధమానమగునది. విచ్ఛేదరహితమైనది. సూక్ష్మాతిసూక్ష్మమయినది. అనుభవరూపమగునది.

ఏదియేని ఒక గుణమును చూడగా గలిగిన ప్రేమ యా గుణము కానరానప్పుడు లోపించిపోవును. కాని యథార్థమైన ప్రేమ యందు గుణాపేక్ష యుండదు. ప్రేమిభక్తునకు తన ప్రేమస్థానీయునియందు గుణదోష పరిశీలనమునకు అవకాశ మెచ్చట నుండును? అచ్చట స్వాభావికమైన సహజ ప్రేమయే యుండును. లేదా యీ ప్రేమ

గుణాతీతమయి యుండునని కూడ చెప్పవచ్చును. ఇది మూడు గుణముల పరిధిని అతిక్రమించినట్టిది.

ప్రేమయందు కామన లేశమైనను నుండదు. తనకు ప్రియుడైనవానిని సుఖవంతునిగా చూడవలెనన్న యిచ్ఛ యొక్కటి దక్క అన్యమైన స్వార్థవాసన యేదియు నుండదు. దానికి పరమప్రియుడే పరమ లక్ష్యము. ఒకింతయైన ప్రతిఫలవాసన యెచ్చటనున్న అచ్చట ప్రేమయొక్క పవిత్రాసనము కుటిలమైన కామన కారణముగా కళంకితము అయిపోవును. కాబట్టి యీ ప్రేమయందు కామనాలేశము కూడలేదు.

అచ్చమైన ప్రేమ యెన్నడును తరిగిపోదు. అది నిరంతరము పెరుగుచునే యుండును. ప్రేమయందు ఎందును ముగింపుయుండదు. ప్రేమిభక్తుడు సర్వదా తనయందు ప్రేమ కొరవడియున్నదనియే భావించుకొనుచుండును. ఎట్టి దశయందును అతనికి తనలోని ప్రేమ పెరిగినట్లు తోచదు. ఆ కారణమున దానిని పెంపొందించుకొనుటకే అతని ప్రతి చేష్టయు సాగుచుండును. ఈ విచ్ఛేదరహితమైన ప్రేమయొక్క నిరంతర పరివృద్ధి క్రమము యెన్నడును నిలిచిపోవుట సంభవము గాదు. ఈ విశుద్ధప్రేమ రేబవళ్ళు పెరుగుచునే యుండును.

ఈ ప్రేమ హృదయ గుహయందు రహస్యముగా నిహితమైయున్న కారణమున సూక్ష్మాతి సూక్ష్మమై యుండును. ఇది కేవలము అనుభవైకవేద్యమైనది. ఈ ప్రేమపథము ననుసరించినవాడగు 'రసఖాను' కవి యొక విధముగా ఈ సూత్రమునే అనువదించుచు నిట్లు చెప్పియున్నాడు -

తే. విమలమగు ప్రేమ కామనావిరహితంబు,
హితకరము, సర్వరసఖని యిలను దలప
కారణంబులు దానికి గావు రూప
యౌవనస్వార్థవిత్తగుణాదు లరయ

తే. ఎంతయో కోమలము, సూక్ష్మ మెంతయేని,
ఎంతయో దూరగము, పల్చ నెంతయేని,
నిండుగా నేకరసమయి యుండునట్టి
ప్రేమ సాధ్యమె యెల్లవారికి ధరిత్రి

తే. సహజముగ స్వార్థరహితంబు సరస మరయ
పరమ మచలంబు నయి సదా పెరుగుచుండు
నేకరసమయి శుద్ధమై యెసగు ప్రేమ
యిద్ది 'రసఖాను' వాణి వింటే? జనుండ!

ఈ ప్రేమ పరమానందమయమైనది. ఇది ప్రేమిభక్తుని ఆనంద మయుడైన శ్రీహరితోడ అనుసంధానము గావించి యానందమూర్తిని జేసివేయును.

**''తత్ప్రాప్య తదేవావలోకయతి తదేవ శృణోతి తదేవ భాషయతి తదేవ చింతయతి.'' (55)**

ఈ ప్రేమను పొంది మధురభక్తుడగువాడు ఈ ప్రేమనే చూచును. దీనినే యాలకించును. దీనినే వర్ణించును. దీనినే చింతించును.

దివ్యమైన యీ ప్రేమరసమందు మునిగి ప్రేమానందమయుడైన భక్తుడు సర్వత్ర తన ప్రేమమయుడు, రసమయుడునగు ప్రియతమునే దర్శించును. అతనికి ఎందును అన్యవస్తువు ఏదియు గానరాదు. ఇట్టిదశయందే యుండి యొక గోపికయన్న మాటలు ఇవిగో! చూడుడు!

బహుళపాది - సీసము

సీ. ఎందెందు నే గందు నందందు శ్యామప్ర
భామయంబయి కానవచ్చె నెల్ల.
శ్యామాలు కుంజాలు, శ్యామాలు వనములు,
శ్యామంబు చదలున జలదపంక్తి.
శ్యామంబులై చన్న వఖిలవర్ణము లంద్రు
ప్రజ లిద్ది నూతనవార్త యయ్యె.
నిఖిలలోకశ్యామనేత్రకసీనికల్
మారెనో? యిది మదున్మాద మగనొ?
శ్యామంబు సితచంద్రసారంబు, శ్యామమై
చనియె నౌరా! రవిసార మిదియు,
శ్యామమయ్యెను కామజయకారణంబైన
మృగమదం బిది కూడ నెంత వింత?,
కలితకంశేకాలు కంఠంబు శ్యామంబు,
శ్యామతావల్లి నా స్వాంత మయ్యె.

తే. నీలమై తోచె శ్రుత్యక్షరాల పంక్తి.
దీపశిఖఁ గ్రమ్మె శ్యామంపు దీప్తి యేదో?
నరులు, నమరులు ననసేల? పరమమైన
బ్రహ్మ మది కూడ శ్యామమై పరగెఁ జూడ
మరియొక భక్తుని వాణియిదిగో చూడుడు!-

బహుళపాది - సీసము

హట్టంబులం దెల్ల ఘట్టంబు లందెల్ల
వీథులందును వనవితతియందు,

పాదపంబులయందు వల్లికావ్రజమందు
వాటికలం దెల్ల తోటలందు,
కుడ్యమ్ములం దెల్ల గుమ్మమ్ములం దెల్ల
గడపలం దెల్ల కంబడుల యందు
హీరంబులం దెల్ల హారంబులం దెల్ల
మేని భూషలయందు మేనులందు
కలితకుంజములందుఁ గాననస్థలులందు
గోపికలం దెల్ల గోవులందు
గోకులంబున సర్వగోధనంబున మేఘ
మాలలందును తటిజ్జాలమందు

ఆ. ఎందు నెందుఁగన్న నందునందే తోచు
సొబగు మీర శ్యామసుషమ యేదొ,
మాదు కన్నుదోయి, మదిని సాలగ్రామ
కాంతిపుంజమేదొ క్రమ్మివైచె

ఆ. స్థలజలాలఁ జదలఁ జరముల నచరాల
శ్యామువుఁ దొండె కాననగుచు నుండె,
అలవి కాదు నుడువ నతని దివ్యప్రేమ
విధము వాకుతోడ విశదభంగి

తే. లేదు బ్రహ్మంబు, మాయయులేదు లేదు,
లేదు జీవుండు, కాలుండులేదు లేదు,
లేదు మా జ్ఞానమే మాకు లేశమైన,
నెందునందుండె నొక నందనందనుండె

ఆ. ఎవడు తెలుపనేర్చు నెవని కెబ్బంగి మా
హృద్గతంపు సుద్ది యింత కిద్ది?

హరి హరించె మనము, హరి కాంచెడున్, మాకు
హరియ కానవచ్చు నన్ని యెడల

ఈ దశలో అతని చెవులాలకించునది కేవల మొక్క ప్రేమమయుని ప్రేమసంగీతమునకు సంబంధించిన సుమధురస్వరలహరి మాత్రమే. అతడు సర్వదా ప్రియతముని మధుర మురళీనాదమందు ఒడలు విస్మరించు చుండును. ఇట్లే అతని నోట ప్రియతముని ప్రసంగము కాక యన్యశబ్దము ఏదియు వెలువడదు. అతడు అవిరామముగా ప్రియతముని గుణములను కీర్తించుచుండును. ఎంత కీర్తించినను అలత చెందకుండును. మాటమాటకు, మాటికి మాటికి అతడు కేవలము దివ్యప్రేమ రసామృతము యొక్క అనుపమస్వాదమును పొందుచుండును. అతని చిత్తమునందు అన్యమునకు స్థానమే యుండదు. అక్కడ కేవల మొక్క అతని ప్రియతముని అఖండ సామ్రాజ్యమే సాగుచుండును. అందే యతని సంపూర్ణాధికారము చెల్లుచుండును. అన్యస్మృతి ఛాయామాత్రముగా కూడ అందు ప్రవేశించుటకు తావుండదు. చిత్తము సాక్షాత్తు ప్రియతముని ప్రేమస్వరూపముగా మారిపోవును. ఈ పరిస్థితినే యనుమానించి యొక కవి చేసిన వర్ణన మిదిగో! చూడుడు!

తే. అన్యనామమ్ముఁ గర్ణమ్ము లాలకింప,
పేకరసరంజితంబులై యొసఁగు నివ్వి,
యేమరియు నన్యనామమ్ము నెనయు నాల్క
ముఖగతంబుగ గరళాన ముంపవలదొ?

తే. ఆర్య! మా చిత్తగతి యిట్టిదయ్య! మే మ
మాయికల మెట్టులీ నీతి వాయఁగలము?
కన్ను లివి నల్లనయ్యను గాదటంచు
నెఱనయ్యను గాంచునే నెరియుఁగాత!

సర్వాంగములును ఆ శ్యామతత్త్వమునే యనుభవించుచుండును. సర్వేంద్రియములకు అదియే విషయమగును. కన్నులు విశ్వమునంతను శ్యామసుందరమయముగా జూచును. చెవులు మధురాతి మధురము, శబ్దబ్రహ్మమయము నైన యతని వేణునాదమునే యాలకించును. నాసిక నిత్యము నిరంతరముగా నతని సౌరభమునే యాఘ్రాణించును. జిహ్వ యవిచ్ఛిన్నముగా ఆ ప్రేమామృతమునే యాస్వాదించును. శరీరము సర్వదా యఖిలసౌందర్యరససముద్రము, రసరాజు, స్పర్శమాత్రమున పరమ సుఖమును ప్రసాదించువాడు, ఆనందకందభూతుడునగు నందనందనుని సుఖస్పర్శము ననుభవించుచుండును. ఆకాశమందు అదియే శబ్దము. వాయువునందు అదియే స్పర్శము. అగ్నియందు అదియే తేజస్సు. జలమందు అదియే రసము. పృథివియందు అదియే గంధము. సర్వమును ఆ తత్త్వమయమే. సర్వమునందు నతడే తన విలక్షణరూపమాధుర్యమును ప్రదర్శించుచుండును. ఎటుచూచిన ప్రేమయే ప్రేమ. ఆనందమే యానందము. విశ్వమంతయు ప్రేమమయము, ఆనందమయము, రసమయము లేక శ్రీకృష్ణమయమును అయి ప్రకాశమానమగును. సర్వము ఆనందభరితము, సౌందర్యభరితము నయి యనుభూతమగును. దృశ్యము మధురము. ద్రష్ట మధురము. నీవు మధురము. నేను మధురము. సర్వము మధురమే. ఆ పరమానందరససుధామయుడైన మధురాధిపతికి సంబంధించినదెల్ల మధురమే. ''మధు వాతా ఋతాయతే, మధు క్షరంతి సింధవః, మాధ్వీర్నః సంత్వోషధీః, మధుమత్పార్థివగ్ం రజః'' (వాయువులు మధుమయములు, సాగరములు మధువులను స్రవించుచున్నవి. ఓషధులు మనకు మధుమయము లగుచున్నవి.) ఈ విధముగా పరమభక్తుని దృష్టిలో సర్వత్ర ప్రేమమయుడైన భగవానుడే నిండియుండును. భగవానుని దృష్టిలో భక్తుడుండును. భగవానుడు కూడ చెప్పియున్నాడు. -

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి.
తస్యాహం న ప్రణశ్యామి స చమే న ప్రణశ్యతి. (గీత 6/30)

'సర్వత్ర నన్ను జూచువాడు, సర్వమును నాయందు జూచువాడు నగు మనుజుని దృష్టినుండి నేను అదృశ్యుడను గాను. నా దృష్టినుండి యతడు నశింపడు.'

ఈ దశలో ప్రేమిభక్తుడు నిత్యము, నిమగ్నుడై యుండు మహత్తరము, దివ్యము నైన ప్రేమామృతరససాగరము యెల్ల విధముల యిట్టిదని చెప్పనలవి కానిది. ఇదియే ప్రేమభక్తి స్వరూపము. ఇదియే పరాభక్తిస్వరూపము. ఇదియే మహాభూమానందము. సర్వవ్యాపియైన యీ భూమానందముతోడ అల్పసుఖమును పోల్చగా గోచరించు తారతమ్యమును వెల్లడించుచు శ్రుతి ఇట్లనుచున్నది. -

''యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమాథ యత్రాన్యత్పశ్యత్యన్య చ్ఛృణోత్యన్యద్విజానాతి తదల్పమ్. యో వై భూమా తదమృతమథ యదల్పం తన్మర్త్యమ్.'' (ఛాందోగ్య 7/24/1)

'ఎందు అన్యమును జూడక, యన్యమును వినక, యన్యము నెరుగకయు నుండుట సంభవమో అది భూమా. ఎందు అన్యమును గనుటయు, వినుటయు, నెరుగుటయు సంభవమగునో యది యల్పమ్. భూమా అమృతమగును. అల్పమ్ నశించిపోవునది.' కాబట్టి యీ ప్రేమ సదా మధురమైనది. నశింపనిది. సనాతనమైనది. సత్యమైనది.

''గౌణీ త్రిధా గుణభేదాదార్తాదిభేదాద్వా.'' (56)

గౌణభక్తి గుణభేదము చేతను, ఆర్తాదిభేదము చేతను మూడువిధములుగా నుండును.

వెనుకటి సూత్రము వరకు పరాభక్తి లేక ముఖ్యభక్తి వివరించబడినది. అందు ప్రేమిభక్తుడు ప్రేమభక్తితో తన ప్రియతమభగవానుని ప్రేమమయ స్వరూపమును పడయగల్గును. దీనినే శ్రీమద్భాగవతము అహైతుక నిర్గుణభక్తియని పేర్కొన్నది. భగవద్గీత జ్ఞానభక్తియన్నది. అహైతుకభక్తి యందు భక్తుని చిత్తవృత్తియు, కర్మగతియు స్వాభావికముగాను, అవిచ్ఛిన్నముగాను భగవానుని దెసకే ప్రవహించుచుండును. అతని చిత్తమెల్లవేళల నిరంతరముగా కామనారహితమైన యనన్యప్రేమభావముతో భగవానునియందే లగ్నమైయుండును. అతని కర్మలన్నియు భగవానుని కొరకే. (శ్రీమద్భాగవత. 3/29/11/12) గీతయందు చెప్పబడిన విధమును అనుసరించి దుర్లభమైన తత్త్వజ్ఞానమును పొందిన మహాభక్తుడు కూడ సర్వమును వాసుదేవమయముగా నవలోకించును. (అధ్యాయ. 7/17) వీరు ఇరువురును భగవత్స్వరూపులే.

ఇక ఇప్పుడిక్కడ ఈ భక్తిప్రసంగమును వీడి నిమ్నశ్రేణికి చెందిన గౌణభక్తిని వివరించుచున్నాము. ఈ గౌణభక్తి సాత్త్వికము, రాజసము, తామసము నను భేదములచేత గాని, లేక ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థియను భేదముల చేతగాని మూడు విధములు.

పాపములను తొలగింపనెంచుకొని సమస్తకర్మ ఫలములను భగవదర్పణము గావించునట్టిది సాత్త్వికభక్తియగును. లేదా పూజ చేయుటయే ప్రధాన కర్తవ్యముగా నెంచుకొని నిత్యము భేదదృష్టితో భగవానుని పూజ చేసికొనుచుండు విధముగా సాగింపబడు భక్తి కూడ సాత్త్వికభక్తియే యగును. (శ్రీమద్భాగవత. 3/29/10)

విషయాభిలాషతోనో, కీర్తికాంక్షతోనో, ఐశ్వర్యాపేక్షతోనో భేదదృష్టి పూర్వకముగా కేవలము ప్రతిమాదులను పూజించుకొనుచుండు విధముగా సాగుభక్తి రాజసభక్తియగను. (శ్రీమద్భాగవత. 3/29/9)

హింసను, దంభమును, మాత్సర్యమును మనసున నిలిపి క్రోధముతో

భేదదృష్టితో సాగించెడు భక్తి సాధన తామసభక్తిసాధన యగును. (శ్రీమద్భాగవత. 3/29/8)

ఈ విధముగానే ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి యనబడు పురుషులు మువ్వురును మూడు విధముల యుపాసనలతో, మూడు విధముల భక్తిసాధన చేయుదురు. అనగా భక్తుల భావభేదము ననుసరించి గౌణభక్తి మూడు విధములగుచున్నది.

గౌణభక్తి సాధన వలన సాక్షాత్తు భగవత్ప్రాప్తి కలుగదు. అయినను ఇట్టి భక్తిసాధన చేయువారు కూడ సుకృతాత్ములే యగుదురు. ఈ యనుష్ఠానము సాగించుచుండగా భగవదనుగ్రహము వలన వారికి కూడ కడకు భగవత్ప్రాప్తికి ముఖ్యసాధనము లేక భగవత్స్వరూపము నగు అనన్యభక్తి ప్రాప్తించును. అంతిమ ఫలముగా భగవత్ప్రాప్తి కలుగుటయే యా భగవద్భక్తి యందు ఉన్న వైశిష్ట్యము. ఆ కారణముననే యీ గౌణ భక్తికూడ ఉత్తములు, పుణ్యాత్ములు నగు పురుషులు అనుసరించునట్టిదిగానే భావింపబడినది. ఏలయన్న భక్తిమాత్రమందే భగవద్భజనము, భగవదాశ్రయము, భగవద్ధ్యానము నను నంశములు ఏదియో యొక విధముగా ఇమిడియే యుండును. భగవత్ప్రాప్తియే ఆ యంశములకు కడపటి ఫలమగును. కాబట్టి మానవుడు ఏవిధముగా నైనను తప్పక భక్తిమార్గము నవలంబింపవలెను. కాని సాధ్యమగునంత వరకు సాత్త్విక భక్తిని, త్రిభువన వైభవమును కూడ అనర్థముగాను, భగవానునే పరమార్థము లేక పరమధనముగాను భావించుకొని యతని ప్రేమ నపేక్షించియే అచ్చమైన యర్థార్థి భావముతో నిష్కామముగా సాత్త్వికభక్తిసాధన చేయవలెను.

''ఉత్తరస్మాదుత్తరస్మాత్పూర్వపూర్వా శ్రేయాయ భవతి.'' **(57)**

**(వానిలో)** ముందు ముందు ఉన్నవాని క్రమముకంటె వెనుక వెనుక నున్నవాని క్రమమును అనుసరించిన భక్తి కల్యాణాత్మకము కాగలదు.

తామసభక్తి కంటె రాజసభక్తియు, దానికంటెను సాత్త్వికభక్తియు నుత్తమమైనది. ఈ విధముగనే అర్థార్థిభక్తికంటె జిజ్ఞాసుభక్తి దానికంటెను ఆర్తభక్తి పరమకల్యాణ కారకమైనది.



# భక్తియొక్క సౌలభ్యము, దాని మహత్త్వము

## ''అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ.'' (58)

ఇతరములు అన్నిటికంటెను భక్తి సులభమైనది.

ఇంతకుముందు భక్తి మహత్త్వము, కర్మయోగజ్ఞానాదులకంటెను భక్తికి గల వైశిష్ట్యము నిరూపింపబడినది. ఇప్పుడు సూత్రకారుడు ఈ విధముగా భక్తి సర్వశ్రేష్ఠమైనదే కాక దాని ప్రాప్తి యితరేతరములైన ఫలములు అన్నిటికంటెను సహజము, సులభము నని నిరూపించుచున్నాడు. ఈ భక్తిప్రాప్తించుటకు విద్యయొక్క యావశ్యకత లేదు. ధనము అక్కరలేదు. ఉన్నత వర్ణాశ్రమముల యక్కరలేదు. వేదాధ్యయనము, కఠినమైన తపస్సు, వివేకము, కఠోరవైరాగ్యము ననునవి యేవియు అవసరము లేదు. కేవలము సరళభావముతో భగవానుని యపారకృపను విశ్వసించి నిరంతరముగా ఆ స్వామిని స్మరించుచుండుటయే కావలయునది. అట్లు చేసినప్పుడు సౌలభ్యము ప్రత్యక్షముగనే తెలియ నారంభించును. ఈ భగవత్కృప సర్వదా యెల్లరయందును ప్రవహించుచునే యుండును. కాని మానవుడు అందు విశ్వాసము వహింపక మోసపోవుచున్నాడు. భగవానుడు గీతలో - 'నేను సమస్త ప్రాణులకును సుహృదుడను, నన్ను తన సుహృదునిగా నెరిగినవాడు తత్కాలమందు శాంతిని పడయగలుగును అని ఢంకా మ్రోగించి చెప్పుచున్నాడు. -

సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి' (5/29)

మానవుడు చేయవలయునది యింతమాత్రమే - అతడు భగవత్కృపను విశ్వసించి తత్సముద్రమందు తాను మునుగుచున్నట్లు భావించికొనవలయును. తనకు పైని క్రింద, పార్శ్వములందు,

చుట్టుపట్టుల, భూతమందు, భావియందు, సర్వస్థానములందు, సర్వకాలములందును ఆ కృప నిండుగా యున్నదని తలపవలయును. అట్లు తలచినంతనే యతడు సమస్త పాప తాపవిముక్తి పొంది భగవద్భక్తికి అధికారి యైపోవును. ఈ విధముగా భగవత్కృపను విశ్వసించి నిశ్చయాత్మకబుద్ధి వహించి బాలకులేమి, వృద్ధులేమి, యువకులేమి, స్త్రీలేమి, పురుషులేమి? బ్రాహ్మణులేమి, శూద్రులేమి యెల్లవారును అనన్యభావముతో భగవత్స్మరణము నభ్యసింపవచ్చును. ఇందు విడువ వలయునది, గ్రహింపవలయునది యేదియును లేదు. సర్వమునందును భగవత్కృపాప్రసరణము సాగుచునే యున్నను ఆ విషయమందు మనలో లేని విశ్వాసమును కల్పించుకొని స్థిరపరచికొనవలసియున్నది. అట్లు చేసిననాడు భక్తిప్రాప్తికి సంబంధించిన సాధనములు అన్నియును వానియంతట నవియే సమకూరును. ('తస్యాహం సులభః పార్థ' - గీత 8/14) భక్తియన్నది యే సాధనము వలనను ప్రాప్తము గాదు. కేవలమొక్క భజనము వలననే లభించును.

''ప్రమాణాంతరస్యానపేక్షత్వాత్ స్వయం ప్రమాణత్వాత్.'' **(59)**

ఏలయన్న భక్తి స్వయముగా ప్రమాణరూపమైనది. దీనికి అన్యప్రమాణముల యావశ్యకము లేదు.

భక్తిమార్గము నవలంబించిన పురుషులకు భక్తిసుఖమునకు సంబంధించిన ప్రమాణము స్వయముగనే ప్రాప్తించును. వారికి తత్సంబంధమైన యనుభూతి స్వయముగనే కలుగుచుండును. అన్యప్రమాణము యొక్క యావశ్యకము యిందు ఆవంతయును లేదు. భర్తృసుఖానందానుభూతి భార్యాత్వమును పొందినప్పుడే ప్రాప్తించును.

ఈ విషయమును కన్యకు ప్రత్యేకముగా తెలియజెప్పవలసిన పనిలేదు. ఆ విధముగనే భక్తి సుఖానుభవము భక్తులకే ప్రాప్తించును. ఇది ఒకరు తెలుపవలసిన విషయము కాదు. పుణ్యాత్ములైన మహానుభావులు సర్వకామనా పరిత్యాగము గావించి కేవలమొక్క భగవత్ప్రేమనే యభిలషించి భగవత్కృప నాశ్రయించి సర్వదా పులకిత చిత్తములతో ప్రేమపూర్వకముగా భగవానుని భజించుచుందురు! వారికే భక్తిసుఖానుభవము ప్రాప్తించును.

''శాంతిరూపాత్పరమానందరూపాచ్చ.'' (60)

భక్తి శాంతిరూపము, పరమానందరూపము నగునది.

శాంతియు, పరమానందమును సాక్షాత్తు భగవత్స్వరూపము! తన ప్రేమరూపమున స్వయముగా భగవానుడే యవతరించుచుండును. కాబట్టి యీ భగవత్ప్రేమ కూడ శాంతిరూపము, పరమానందరూపమే. ఆనందమయుడగు భగవానుడు స్వయముగనే హ్లాదిని యనబడు తన యానందశక్తిని నిమిత్తము గావించుకొని ప్రేమ రూపమున, ప్రేమించువాని రూపమున ప్రకటమగును. తానే ప్రేమ స్థానీయుడైన ప్రియతముడై తన యానందమును తానే యనుభవించుచుండును. ఇదియే యా స్వామియొక్క యానందలీల. ఇక్కడ ఒక్క విషయము గుర్తుంచుకొనవలయునది యున్నది. ఏ భగవానుని యందలి భక్తి లేక ప్రేమ శాంతిరూపము, పరమానందరూపము నైనట్టిదగునో ఆ భగవానుడు నిర్గుణవాదులచేత భావింపబడువాడు, ప్రకృతి సంభవములైన సత్త్వరజస్తమోగుణము లనబడు మూడు గుణములతోను కూడియుండు సగుణబ్రహ్మము కాదు. భగవానుని దివ్యశరీరము అతని స్వకీయమైన యానందాంశము. అతని యోగమాయ కారణముగా నిత్యము ప్రకటమయియే యున్నది. ఆ కారణముననే యాత్మారాములైన మునీశ్వరులు, జీవన్ముక్తులైన

మహాపురుషులు, వ్యాస నారద శుక జనక సనకాదులగు మహాత్ములును ఆ భగవానుని యొక్కొక్క దివ్యగుణము నెడలనో, దివ్యాభరణముల యెడలనో, దివ్యగంధము నెడలనో, దివ్యమురళీనాదము నెడలనో, దివ్యసౌందర్యము నెడలనో ముగ్ధులగుచుందురు. అట్లు కాక ఆ భగవానునియందు ఈ జగత్తు నంతను ప్రసవించునదియు, ఆవరించి యుండునదియు, మలినమైన మాయయొక్క గుణములే వికాసము చెందియుండుట సంభవమైనచో లేక యా దివ్యశరీరము ఈ మాయచేతనే నిర్మితమైనదగుచో మాయాగ్రంథిబంధనమును త్రెంచికొన్నవారు, బ్రహ్మస్వరూపులు నగు మహాత్ములకు ఆ దివ్యమంగళమూర్తి వంకకు అంతగా ఏల యాకర్షితులగుదురు? నిర్గుణవాదులు ఏ భగవత్స్వరూపమును శుద్ధసచ్చిదానంద ఘనబ్రహ్మముగా తలపోయుదురో, వేదములు ఏ స్వరూపమును 'అదికాదు, అదియును కాదు' అని నిషేధించుచు పోయి కడకు సాంకేతికముగా తెలియజెప్పబూనుచున్నవో, ఆ మాయాతీత విజ్ఞానఆనందఘనపరబ్రహ్మమే భక్తులకు ప్రియతముడైన భగవానుడు. ఆ స్వామిని శాంతిసముద్రము, ఆనందసాగరము నన్నంత మాత్రమున కూడ అతని స్వరూపము వాస్తవముగా వివరింపబడినట్లు కాదు. అతని ప్రేమ యేదో అదే పరమశాంతి స్వరూపమైనది. అదే పరమానంద స్వరూపమైనది. ఈ ప్రేమ స్వరూపమునే దేవర్షి నారదుడు ఈ సూత్రములో వివరించినాడు.



## భక్తి యొక్క సాధనములు, అంతరాయములు

''లోకహానౌ చింతా న కార్యా నివేదితాత్మలోకవేదత్వాత్.'' (61)

(భక్తుడు) లోకహానిని గూర్చి చింతింపరాదు. ఏలయన్న అతడు తాను తనను, లౌకికములు, వైదికములు నగు సమస్తకర్మలను భగవదర్పణము చేసివైచినవాడు.

భక్తుడు సర్వమును భగవదర్పణము చేసివేయును. కావున వాని విషయమున అతడు ఏ విధముగను చింతింపవలసినవాడు గాడు. అతడు కేవలము ఒక్క ప్రియతమ భగవానుని చింతనమును గూర్చియే చింతింపవలయును. భార్య, బిడ్డలు, ధనము, జనము, గౌరవము మున్నగు పదార్థములు నిలుచు గాక! నిలువకపోవుగాక! వానిని గూర్చి యతడు చింతింపడు. కారణము ఏమన్న వీనిని అతడు ముందే భగవానునకు అర్పించివైచి యకించనుడై యున్నవాడు. ఇక అతని చెంత వీనిని గూర్చి చింతించుటకు సమయము, చింతించు చిత్తము నెక్కడ నుండును? అతని చిత్తమును కేవలము సమస్త చింతాపహారియగు చింతామణికి సంబంధించిన చింతయే హరించివేసె నన్నమాట. పరమచతురుడైన యాచోరశిఖామణి తానుగైకొన్న చిత్తమును ఇక నెన్నడును మరలించి యిచ్చుటకు ఇష్టపడడు. ఇక ఆ చిత్తమే లేనియప్పుడు ఏదియో హాని కలుగు నన్న చింత మాత్రమెట్లు కలుగును? కాబట్టి యీ మార్గము ననుసరించినవాడు లోకహానిని గూర్చి చింతింపరాదు. అతడు సర్వసారస్వరూపుడైన భగవానుడి చింతనమే చేయవలెను. భక్తుని హృదయమందు అట్టి చర్యయే జరుగుచుండును కూడ.

''న తదసిద్ధౌ లోకవ్యవహారో హేయః కింతు ఫలత్యాగస్తత్సాధనం చ కార్యమేవ.'' (62)

(కాని) భక్తియందు సిద్ధి లభించనంత వరకు లోక వ్యవహారము వీడరాదు. కాని ఫలమును వీడి (నిష్కామభావముతో) ఆ భక్తిసాధన చేయవలయును.

ప్రేమ ప్రాప్తించిన మీదట లౌకికములైన (వైదికములైన) కర్మలతో సంబంధము తెగిపోవును. బుద్ధిపూర్వకముగా వానిని మౌలికముగా త్యజింపవలసిన పని కలుగదు. సమర్పణము అనగా వానిని మానసికముగా సమర్పించుట. పిమ్మట ఈ ప్రేమకు సంబంధించిన యున్నతస్థితి ప్రాప్తించినప్పుడు మానవుడు విధినిషేధములను అతిక్రమించిపోవును. అప్పుడు సహజముగనే వానినుండి కర్మలు దూరమై వానిని విధిబంధనమునుండి విముక్తుని గావించివేయును. ఈ స్థితికి ఇదియే నియమము. కాని భగవత్ప్రేమ పేరున బుద్ధిపూర్వకముగా శాస్త్రవిధిని త్యజించువాని భక్తికి సిద్ధి సులభముగా గలుగదు. ఆ కారణముననే సూత్రకారుడు బుద్ధిపూర్వకముగా లోకవ్యవహారమును విడువరాదని చెప్పుచున్నాడు. ఫలాపేక్షారహితముగా కర్మ చేయుచునే యుండవలెను. నిష్కామకర్మాచరణము చేయువాడు స్వయముగనే లోకహాని చింతనుండి విముక్తుడగును. భగవత్ప్రీత్యర్థముగా నిష్కామభావముతో అతడు ఆచరించు కర్మలు అన్నియు అతనికి భక్తిప్రాప్తికి సాధకము లగును.

''స్త్రీధననాస్తికవైరి చరిత్రం న శ్రవణీయమ్.'' **(63)**

స్త్రీలు, ధనము, నాస్తికులు, వైరులు - వీరి చరిత్రమును ఆలకింపరాదు.

62వ సూత్రములో లోకవ్యవహారమును విడువరాదని చెప్పుట యైనది. కాబట్టి లోకవ్యవహారమును అనుసరింపవలసినదే. కాని ప్రేమ మార్గానుగామి యైనవాడు లోకవ్యవహారమందు స్త్రీ, ధన, నాస్తిక, వైరి చరిత్రముల శ్రవణమునకు దూరముగా నుండవలెను.

(1) స్త్రీ చింతయందు లగ్నమైన మనస్సు గలవాడు ఏ విధముగను భగవచ్చింతనము చేయజాలడు. స్త్రీ చింతనము వలన కామ ముదయించును. కామము ప్రేమమార్గమునకు పెద్ద యవరోధమగును. స్త్రీ సంబంధమగు విషయముల నాలకించుట, చదువుట, చూచుట వలన స్త్రీ చింతనమే జరుగును. కావున సాధకుడు స్త్రీల విషయములను భాషించరాదు. వారి గానముల నాలింపరాదు. వారి చిత్తరువులను విలోకింపరాదు. వారికి సంబంధించిన పుస్తకములను, ఇతర సాహిత్యమును చదువరాదు. తత్సంబంధములైన నాటకములను, సినిమాలను చూడరాదు. స్త్రీ చరిత్రమును గూర్చి ఆవంతయు నాలోచింపరాదు. వారిని గూర్చి వ్రాయరాదు. వారి నడుమ నుండరాదు. అనావశ్యముగా వారిని గలిసికొనరాదు. గృహస్థులైన సాధకులు సాధ్యమగునంత వరకు తాము పెండ్లి యాడిన తమ భార్యలను దక్క తదన్య స్త్రీలను గలిసికొనరాదు. స్త్రీ చర్చలు చేయుట, వినుట, వారి చిత్తరువులను చూచుట వంటివి ఎల్లరకును హానికారకములే. శ్రీమద్భాగవతము ఏమనుచున్నదో చూడుడు!

న తథాస్య భవేన్మోహో బంధశ్చాన్యప్రసంగతః
యోషిత్సంగాద్యథా పుంసో యథా తత్సంగిసంగతః **(3/31/35)**

"స్త్రీలతోడి సంగము వలన వారితో సంగము చేయువారితోడి సంగము వలన గలుగునంత మోహము కాని, బంధము కాని మానవునకు వేరే దేని తోడి సంగము వలనను గలుగదు.' ఇంకను ముందునకు పోవగా పంచమస్కంధములో స్త్రీయందు ఆసక్తులై యుండు పురుషుల తోడి సాంగత్యము 'నరకద్వార' మని చెప్పబడినది. పురుషులకు స్త్రీసంగమెట్లు త్యాజ్యమో, స్త్రీలకు పురుషసంగము కూడ అట్లే త్యాజ్యమగును.

(2) ధనచింతనము వలన లోభము ఉదయించును. ధనసంబంధమైన లోభము ప్రవేశించిన మనస్సులో న్యాయాన్యాయ వివేచనము పోవును. అట్లు లోభగ్రస్తుడైన మనుష్యుడు సన్మార్గమును వీడి దుర్మార్గమందు, అన్యాయమార్గమందు చరింప నారంభించును. కావున ధనమును గూర్చి, ధనికుల భోగములను గూర్చి, దర్పభరితములైన ప్రసంగముల వంక మరలరాదు.

(3) భగవానుని, శాస్త్రములను విశ్వసింపనివారు ఎవరో వారే నాస్తికులు. లోకములోని జీవులకు భగవానుని అస్తిత్వము నంగీకరింపని నాస్తికులతో సమానుడగు శత్రువు వేరొకడు ఉండడు. 'ఇందులో ఏమున్నది?, అందులో ఏమున్నది?, దేవుడు అనుట కేవలము బూటకము, ఆ దేవు నెవరు చూచినారు?, ఆత్మయా? అది యొక యభూతకల్పన.' – ఇట్టి ప్రలాపము లాడువారితోను, భగవానుని, శాస్త్రములను నిందించువారితోను సంగము పెట్టుకొనుట వలన, కుతర్కములు చేయువారిని గూడుట వలనను భగవానునియందు అశ్రద్ధ యేర్పడును. దైవమునందు అశ్రద్ధ, అవిశ్వాసము కలుగుటతో సమానమైన పతనసాధనము మానవునకు వేరొకటి యుండదు. కాబట్టి సర్వదా నాస్తికులకు దూరముగా నుండవలెను.

(4) నిజముగా భక్తుని మనస్సులో అతనికి శత్రువు అనదగువాడు ఎవ్వడు నుండడు. లోకమునందు ఎల్లయెడల తన అంతర్యామియైన పరమాత్మను పరివ్యాప్తునిగా జూచువాడు, జగత్తునంతను శ్రీకృష్ణమయముగా పరికించువాడు ఎవనిని తన శత్రువుగా భావించగలుగును? దేవదేవుడైన మహాదేవుడు ఏమనెనో చూడుడు –

తే. పార్వతీ! రామపదపద్మభక్తు లెవరు
ప్రకటకామమదక్రోధరహితు లెవరు
మహిని గంద్రు నిజప్రభుమయము గాగ
వారు వహియింతు రేరితో వైర మెటుల?

భక్తి సిద్ధించు వరకు సాధకుడు ఈ భావమునే కలిగియుండవలెను. లోకమంతయు తన ప్రభుని స్వరూపమే యని యతడు మానసికముగా నిశ్చయము చేసికొనవలెను. అట్టి దశలో నున్న యా సాధకునితో నెవడైన అన్యుడు భ్రాంతివశమున ద్వేషమును, వైరమును గల్పించుకొనుట సంభవమైనచో వానివైరవార్తలను సాధ్యమగునంత వరకు నాలకింపకుండవలెను. వాని నాలకించుట వలన క్రోధముద్భవింపవచ్చును. కాబట్టి సాధకుడు తన పక్షమునుండి గెలువరాక యున్న ఒక్క తన మనస్సును దక్క మరియెవ్వరిని శత్రువుగా భావింపరాదు. అన్యుడు ఎవడైన శత్రుత్వము వహించువాడున్న వానిని గూర్చి విచారింపరాదు.

స్త్రీ చింతనము వలన కామము, ధనచింతనము వలన లోభము, నాస్తికచింతనము వలన భగవానునియందు అవిశ్వాసము, వైరి చింతనము వలన క్రోధమును ఉత్పన్నమగును. కాబట్టి యీ నాలుగు చరిత్రములను యథాసాధ్యముగా ఆలకించరాదు.

''అభిమానదంభాదికం త్యాజ్యమ్.'' **(64)**

అభిమానము, దంభము మున్నగు వానిని విసర్జించవలెను.

ఇంతకు ముందు సూత్రములో స్త్రీ ధన నాస్తిక వైరి చరిత్రములను ఆలకింపరాదని యాదేశింపబడినది. కాని యట్లు చేసి సాధకుడు తన మనములో 'నేను కామినీకాంచనములను పరిత్యజించినవాడను, పరమమైన యాస్తిక్యబుద్ధి కలవాడను, అజాతశత్రుడను' అన్న యభిమానమునకు ఆవంతయు తావీయరాదు. ఈ యభిమానము సర్వవిధముల పతనహేతు వగునట్టిది. సంపద, సంతానము, శక్తి, స్వాస్థ్యము, విద్య, బుద్ధి, బలము, కులము, వర్ణము, ఆశ్రమము, ఆచారము, రూపము, పదవి, పురుషార్థము మున్నగువానిలో దేనిని గూర్చియు అభిమానము వహింపరాదు. ఏదైన

సద్వస్తువు లేక సద్గుణము ప్రాప్తమైనను, లేక తన సాధన సక్రమముగా సాగుచున్నను దానికి భగవానుని కృపనే కారణముగా నెంచుకొనవలెను. అభిమానము వలన హాని కలుగును. కాబట్టి సర్వవిధముల దానిని పరిత్యజించివేయవలెను. కడకు నేను అభిమానరహితుడను అన్న యభిమానమును కూడ విసర్జించివేయవలెను. ఈ యభిమానము నశించుటకు దీనత్వము, వినయము, నమ్రత యన్నవి చక్కని యుపాయములు. వందనభక్తి వలన కూడ అభిమాన మంతరించును.

ఇట్లే దంభమును కూడ పరిత్యజింపవలెను. తనలోలేని గుణాలను, ధనలోభము చేతనో, గౌరవ లోభము చేతనో, స్వభావదోషము చేతనో ప్రదర్శింపబూనుటయు, బాహిరముగా తనను ధర్మాత్మునిగాను, భక్తునిగాను, త్యాగిగాను ప్రదర్శించుకొనునట్టి బూటకపు వృత్తికి పాల్పడుటయు దంభమనబడును. దంభవర్తనుడైనవాని సాధన దారుణముగా నాశనమైపోవును. అట్టివాడు బాహిరమైన తన కపట వేషమును కాపాడుకొనుట యందే తనకు ఉన్న బుద్ధిని, విద్యను, కార్యకౌశలమును సర్వమును వెచ్చించివేసికొనును. అభిమానరాహిత్యము, సారళ్యము నను రెండు గుణములును భక్తిసాధనయందు ఎంతయో సహాయకము లగునట్టివి. అభిమానము, దంభము పెద్ద యవరోధములు. ఈ రెండును ఆసురీసంపదకు చెందిన దుర్గుణములు. వీనితోడ 'ఆది' శబ్దమును ప్రయోగించి సూత్రకారుడు ఆసురీసంపదకు సంబంధించిన యితరదుర్గుణముల వంకకు సంకేతము చేయుచున్నాడని తలపవలెను. కాబట్టి ఆసురములైన దుర్గుణములను అన్నిటిని పరిత్యజించివేయవలెను.

(శ్రీమద్భగవద్గీతలో 16వ అధ్యాయమందు 7 మొదలు 20వ శ్లోకము వరకు ఆసురీసంపద వివరింపబడినది. దాని భావార్థమిది.-

ఆసురలక్షణములు గల మానవులు ధర్మాధర్మవిషయకమగు ప్రవృత్తిని, నివృత్తిని ఎరుగనేరరు. ఆ కారణమున వారియందు పవిత్రత

యుండదు. ఆచారముండదు, సత్యముండదు. వారు ఈ జగత్తు అంతయు అసత్యము, అప్రతిష్ఠము (ధర్మాధర్మ వ్యవస్థావిరహితము), ఈశ్వరరహితమైనదని, అన్యోన్య సంపర్క సంభూతము అనగా స్త్రీ పురుష మిథున సంజనితము అయినదని చెప్పుచుందురు. ఈ జగత్తునకు వేరు కారణము ఏదియు లేదని, ఇది కేవలము స్త్రీ పురుషుల కామజనిత సంయోగము కారణముగా ఉత్పన్నమైనదని వారందురు. అల్పబుద్ధులైన యా మానవులందరు నిట్టి దృష్టియే కలిగియుండి మలినచిత్తులై, ఉగ్రకర్ములై, అహితకారులై కేవలము జగద్వినాశనము కొరకే పుడమిపై పుట్టుచుందురు. వారు ఏవియో నెరవేరని కోరికలు పెట్టుకొని దంభమునకు, అభిమానమునకు, మదమునకు, మోహమునకును వశీభూతులై దురాశలకు లోబడి) అపవిత్రములను అనగా మద్యమాంససేవనము, చౌర్యము, కల్ల-కపటము మున్నగువాని మూలమున, వ్రతములను కేవలము నరకకారణములైన వానిని అవలంబించి శాస్త్ర విరుద్ధములైన పాపకర్మములందు ప్రవర్తిల్లుచుందురు. కడవటి శ్వాస వరకు మేర లేనన్ని విషయచింతలు కలవారై కామోపభోగమునే పరమపురుషార్థముగా స్థిరనిశ్చయము చేసికొని యాశాపాశముల చేత బద్ధులై కామక్రోధపరాయణులై కామోపభోగముల కొరకు అన్యాయ భక్తి యొక్క సాధనములు, అంతరాయములుపూర్వకముగా (చౌర్యము, విశ్వాసఘాతము మున్నగువాని మూలమున) ధనమును కూడబెట్టుటకు ప్రయత్నింతురు. నేను ఈనాడు ఇదిగో! దీనిని పొందితిని. నా యీ కోరిక కూడ సఫలము అగును. ఇదిగో! ఈ ధనము నాది. ఇంకను ఆ ధనము కూడ ప్రాప్తించును. నేను ఫలాన శత్రువును చంపివైచితిని. ఇప్పుడు మిగిలియున్న ఆ శత్రువులను కూడ అంతమొందించెదను. నేను ఈశ్వరుడను. (ఈశ్వరునివలె సర్వశక్తులు గలవాడను.) నేను భోగిని. సిద్ధుడను. బలవంతుడను. సుఖవంతుడను. ధనవంతుడను. నేను పెద్ద కులమువాడను. నాకు సాటి యెవడు? నేను యజ్ఞము చేసెదను. నేను

(పేరు ప్రవతిష్ఠల కొరకు, స్వార్థసిద్ధికై) దానములు చేసెదను. నేను భోగవిలాసములలో మునిగి తేలెదను - అను భావములు గలిగి యజ్ఞానమోహితులై వారు అనేక విషయ చింతనములందు నిమగ్నులై, విభ్రాంత చిత్తులై, మోహజాలసమావృతులై, కామోపభోగపరతంత్రులై, కడకు మహాక్లేశకారణభూతములైన యపవిత్రములైన నరకములలో గూలుదురు. వారు అభిమానపూరితులై తమను తాము పూజ్యులుగాను, శ్రేష్ఠులుగాను భావించుకొనుచుందురు. సర్వదా కరకుదనము వహించినవారై, ధనమాన మదమత్తచిత్తులై కేవలము దంభముతో జనులముందు తమలోలేని ధర్మాత్మత్వమును అభినయించుటకై (ఈశ్వరప్రీత్యర్థము కాక, శ్రద్ధాపూర్వకముగా కాక) అవిధిపూర్వకముగా నామమాత్రపు యజ్ఞముల నాచరించుచుందురు. అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము వంటి యవలక్షణముల నాశ్రయించి వారు తమ శరీరములందు, పరుల శరీరములందును (ఆత్మరూపముగా) ఉన్న (భగవానుడనగు) నన్ను ద్వేషించుచుందురు. సత్యమార్గమందు చరించు సాధువులయందు దోషముల నారోపించుచుందురు. అట్టి నరాధములు, క్రూరులు, పాపాత్ములు, నన్ను ద్వేషించువారు నగు దుష్టులను నేను మాటికి మాటికి ఆసురయోనులయందే పడద్రోయుచుందును. ఓయి అర్జునా! ఆ మూర్ఖులు ఈ విధముగా జన్మజన్మమునందు ఆసురయోనిని పొంది భగవానుడ నగు నన్ను పొందక మత్ప్రాప్తి కర్హమగు మానవ శరీరమును కూడ పొందక, మరి యింత నిమ్నయోనులలోనికి దిగజారి పోవుచుందురు.

''తదర్పితాఖిలా చారస్సన్ కామక్రోధాభిమానాదికం తస్మిన్నేవ కరణీయమ్.'' **(65)**

సర్వాచారములను భగవదర్పణము చేసిపైచిన మీదట ఇంకను కామక్రోధాభిమానాదులు మిగిలియున్నచో వానిని కూడ అతనిని (భగవానుని) ఉద్దేశించియే ఆచరింపవలెను.

సర్వమును భగవదర్పణము గావించివైచినప్పుడు ఇక కామ క్రోధాదులను ఎవ్వరి కర్పింతుము? ప్రియతముడైన భగవానుడు తన ప్రియభక్తుని ప్రేమకు ఎట్లు పాత్రుడగునో అట్లే వాని కామక్రోధాదులకు గూడ అతడే పాత్రుడగును. మరియొకడు ఎవ్వడును ఆ భక్తుని మనస్సులో లేడు కదా! మరి వీనికి ఇక నెవ్వరు పాత్రులగుదురు? ఇట్టులనుటకు - భగవానుని ప్రేమిభక్తులలో కూడ విషయలంపటులైన పురుషులయందు వలెనే కామక్రోధాభిమానములు ఉండు నన్న యర్థమును గ్రహింపరాదు. ఆసురీసంపదకు సంబంధించిన కామక్రోధాభిమానాది దుర్గుణములను విసర్జింపవలెనని ముందే చెప్పుటయ్యెనది. మరి ప్రేమిభక్తులైన మహాపురుషులలో ఈ తుచ్ఛమైన కామప్రవృత్తి ఎట్లు సంభవము? వారిలో విషయాసక్తి, హింస, ద్వేషము, క్రోధము నెక్కడ? మానరహితులైన వారియందు మానలేశమైన ఎటనుండి వచ్చును? వీని బీజమైన వారియందు ఉండదే! స్వీయసుఖసంబంధమైన వాసనయైన లేనప్పుడు వారియందు ఈ దోషములు ఎటనుండి వచ్చును? ఆ భక్తుల జీవనలక్ష్యము కేవలమొక్క తమ ప్రియతముని సుఖపెట్టుటయే. 'కృష్ణసుఖైకతాత్పర్య! గోపీభావవర్య!' వారి చిత్తములో సాంసారిక సంస్కారము లేనేలేదు. వారు లజ్జ, ఘృణ, కులము, శీలము, మానము, దేహము, గేహము, భోగము, మోక్షము - వీని నన్నిటిని తలపులో నిలిపికొనక సర్వమును తమ ప్రియతమ భగవానునకై త్యాగము చేసివైచినవారు. కావున ఈ భక్తులు ఎట్లు దివ్యభావములు గలవారు అగుదురో అట్లే వారి కామక్రోధాభిమానములు కూడ దివ్యములే యగును. ఆ కారణముననే పరమవిరాగులు, జీవన్ముక్తులు నైన మునివరులు ఇట్టి భగవద్రాగరంజితస్వాంతులైన ప్రియభక్తుల వలన అయిన యిట్టి లీలలను గానము చేయుటయందు, ఆలకించుటయందు తమను తాము కృతకృత్యులనుగా భావించుకొనుట సంభవమైనది. ఎల్ల వంకలనుండియు

తొలగిపోయిన చిత్తములు గలవారై, కేవలమొక్క భగవానునే తమ కామనాలక్ష్యము గావించికొన్నవారైన యా భక్తులు, తమ ప్రియతమ భగవానుని దర్శింపవలె నన్న నిలువరించలేని కుతూహలమునకు లోబడి వ్యథాభరిత చిత్తములతో ఏడ్చి ఏడ్చి యా స్వామిని ఎట్లు పిలుచుచుందురో చూడుడు! –

హే దేవ హే దయిత హే భువనైక బంధో
హే కృష్ణ హే చపల హే కరుణైకసింధో
హే నాథ హే రమణ హే నయనాభిరామ
హా హా కదా ను భవితాసి పదం దృశోర్మే (శ్రీకృష్ణకర్ణామృత)

ఓ దేవా! ఓ ప్రియతమా! ఓ లోకైకబంధూ! ఓ కృష్ణ! (మా మనములను నీ వంకకు ఆకర్షించువాడా!) ఓ చపలుడా! ఓ కరుణకు ఏకమాత్ర సముద్రమగువాడా! ఓ నాథా! ఓ రమణా! ఓ నయనాభిరామా! అయ్యో! అయ్యో! నీవు ఎప్పటికి మా కనులకు కనపడెదవు?

శ్రీకృష్ణగత మనస్కయైన రుక్మిణి యాడిన పలుకు లివిగో! పరికింపుడు! –

శ్రుత్వా గుణాన్ భువనసుందర శృణ్వతాం తే
    నిర్విశ్య కర్ణవివరైర్హరతోఽఙ్గతాపమ్
రూపం దృశాం దృశిమతా మఖిలార్థలాభం
    త్వయ్యచ్యుతావిశతి చిత్త మపత్రపం మే.
కా త్వా ముకుంద మహతీ కులశీల రూప
    విద్యావయోద్రవిణధామభిరాత్మతుల్యమ్
ధీరా పతిం కులవతీ న వృణీత కన్యా
    కాలే నృసింహ నరలోక మనోఽభిరామమ్.

యస్యాంఘ్రిపంకజరజఃస్నపనం మహాంతో
వాంఛం త్యుమాపతిరివాత్మతమోఽపహత్యై
యర్హ్యంబుజాక్ష న లభేయ భవత్ప్రసాదం
జహ్యామసూన్ వ్రతకృశాన్ శతజన్మభిః స్యాత్
(శ్రీమద్భాగవత. 10/52/37,38,43)

ఓ అచ్యుతా! ఓ త్రిభువనసుందరా! కర్ణద్వారమున హృదయములో ప్రవేశించి ఆలకించిన వారి అంగతాపమును హరించువాడవగు నీ దివ్యగుణముల యొక్కయు, కన్నులు ఉన్నవారి కన్నులకు పరమలాభమును చేకూర్చునట్టి నీ దివ్యస్వరూపము యొక్కయు ప్రశంస నాలకించి నా చిత్తము లోకలజ్జ నెల్ల తిరస్కరించి నీయందు యాసక్తమైనది. ఓ ముకుందా! కులము, శీలము, రూపము, విద్య, వయస్సు, ద్రవ్యము, ప్రభావము ననబడు నంశములందు నీకు నీవే సాటి. ఓ పురుషోత్తమా! నీవు మానవలోకము యొక్క మనములను మోహింపజేయువాడవు. ఓ పురుషసింహా! వివాహకాలము (నిన్ను గూడునట్టి తరుణము) సమీపించి నప్పుడు (ప్రేమభక్తి యుక్తాంతరంగయై) కులవతియు, గుణవతియు, బుద్ధిమతియునగు ఏ కన్య నీతోడ దాంపత్యబంధమును కల్పించుకొనుటకు ఇచ్ఛగింపకుండును? ఓ కమలలోచనా! ఉమాపతి యగు శంకరునివంటి మహాదేవుడు కూడ తన హృదయములోని తమస్సును తొలగించుకొనుటకై నీయే చరణధూళియందు స్నానము చేయ నభిలషించుచుండునో ఆ చరణధూళి ప్రసాదరూపముగా నాకు లభ్యము కాకపోయినచో నేను వ్రతాదుల మూలమున శరీరమును శుష్కింపజేసికొని వ్యాకులపడుచున్న ప్రాణములను పరిత్యజించెదను. ఇట్లు చేయుచు చేయుచునుండగా నూరు జన్మలు గతించిన మీదట నైనను నీ అనుగ్రహము అవశ్యము ప్రాప్తించగలదు. (అని నమ్ముచున్నాను.)

శ్రీకృష్ణభగవానుని పట్టమహిషులు ద్రౌపదితో అన్నమాటలు ఇవి.

-

న వయం సాధ్వి సామ్రాజ్యం స్వారాజ్యం భోజ్య మప్యుత
వైరాజ్యం పారమేష్ఠ్యం చ ఆనంత్యం వా హరేః పదమ్.
కామయామహ ఏతస్య శ్రీమత్పాదరజః శ్రియః
కుచకుంకుమగంధాఢ్యం మూర్ధ్నా వోఢుం గదాభృతః.
(శ్రీమద్భాగవత. 10/83/41,42)

"ఓ సాధ్వీ! మాకు పృథివీ సామ్రాజ్యమందు గాని, స్వర్గరాజ్యమందు గాని, యీ రెండింటి భోగములందు గాని, అణిమాదుల రూపమందుండు నైశ్వర్యమందు గాని, బ్రహ్మపదమందు గాని, మోక్షమందుగాని, వైకుంఠమందు గాని యిచ్ఛలేదు. మేము కేవలము కమలావక్షఃకుంకుమగంధబంధురమైన శ్రీకృష్ణభగవానుని చరణధూళిని మాత్రమే మా శిరములపై సర్వదా ధరింపగోరుచున్నాము."

ముక్తియన్నది ఇట్టి భక్తుల చరణప్రాంతమున దొరలుచుండును -

యది భవతి ముకుందే భక్తిరానందసాంద్రా
విలుఠతి చరణాగ్రే మోక్షసామ్రాజ్యలక్ష్మీః

ముకుందుని చరణములందు పరమానందరూపమగు భక్తి యెవనికి కలుగునో వాని పాదముల ప్రాంతమందు మోక్షసామ్రాజ్యలక్ష్మి దొరలాడుచుండును.

ఆదర్శప్రేమమయస్వరూపిణులు, భక్తశిరోమణులు నగు గోపికలు తమ ప్రియతమ భగవానుడు అగు శ్రీకృష్ణుడు తమ దృక్కులనుండి యదృశ్యమైన తరుణమున విలపించుచు నిట్లు పలికిరి -

విరచితాభయం వృష్ణిధుర్య తే చరణ మీయుషాం సంసృతేర్భయాత్
కరసరోరుహం కాంత కామదం శిరసి ధేహి నః శ్రీకరగ్రహమ్.
వ్రజజనార్తిహన్! వీర యోషితాం నిజజనస్మయధ్వంసనస్మిత
భజ సఖే భవత్కింకరీః స్మ నో జలరుహాననం చారు దర్శయ.
ప్రణతకామదం పద్మజార్చితం ధరణిమండనం ధ్యేయ మాపది
చరణ పంకజం శంతమం చ తే రమణ నః స్తనేష్వర్పయాధిహన్.
(శ్రీమద్భాగవత. 10/31/5-6, 13)

'ఓ యదుకుల శిరోమణీ! సంసారభీతితో నిన్ను శరణుగన్న వారికి నీ కరసరోజములు అభయమొసగి వారి యభిలాషను సఫలము గావించును. ఓ ప్రియతమా! లక్ష్మీపాణిగ్రహణ మొనర్చినట్టి నీ యాకర కమలములనే మా శిరములపై నుంపుమా! వ్రజవాసుల దుఃఖములను హరించునో వీరా! నీ మధుర మందహాసము భక్తుల గర్వమును హరించునది. ఓయి సఖా! మేము నీ సేవికలము. దయ వహించి మమ్ము స్వీకరింపుమా! నీ సుందరముఖారవిందమును మాకు జూపుమా! ఓ రమణా! ఓ యార్తిహరణా! నీ చరణారవిందములు ప్రణతజనుల కామితములను ఫలింపజేయునవి. బ్రహ్మచేత నారాధింపబడినవి. భూదేవికి ఆభరణములగునవి. ఆపత్కాలమందు ధ్యానించిన శుభమును జేకూర్చునవి. ఓ ప్రియతమా! ఆ పరమకల్యాణ మయములైన చల్లని నీ చరణములను మాతప్తహృదయములపై నిలుపుమా!'

ఈ విధముగా శ్రీకృష్ణ సంబంధమగు కామముతో పీడింపబడి ప్రేమిభక్తులు సర్వదా ఆ స్వామి కొరకే రోదించుచుందురు. అతనినే పిలుచుచుందురు. అట్లు పిలువగా పిలువగా దాగుడుమూతల వంటి లీలను ప్రదర్శించువాడగు నా లీలావిహారి, యా భగవానుడు వారి ప్రేమ పూర్వకమైన పిలుపును ఆలకించును. త్రిభువనకమనీయరూపుడు,

యోగిజనదుర్లభుడు, దేవదేవుల చేత కూడ కోరబడువాడు, ఋషులయు, మహర్షులయు, మహాపురుషులయు చిత్తములను ఆకర్షించువాడు, నిఖిల సౌందర్య మాధుర్యరసామృత సారభూతుడు, ఆనందకందుడు నగు నా మదనమోహనుడు, మన్మథమన్మథాకారధారియై మందమందముగా నగుచు మురళియందు దివ్యమోహన స్వరములను పూరించుచు తటాలున ప్రకటమై తన ప్రేమానందరసమాధురిని నాలుగు దిక్కుల వెదజల్లును. అట్లు ఆ స్వామి తన సౌందర్య మాధుర్యసుధాసంభరితమై చలువలను వెలిగ్రక్కు వదనచంద్ర శుభ్రచంద్రికను ఎల్లయెడల విస్తరిల్లజేయ నారంభించినప్పుడు అక్కడ ఆ భాగ్యశాలులు, దివ్యనేత్ర సంపన్నులు, దివ్యభావాపన్నులు నగు భక్తులు అయిన మహాత్ముల చిత్తముల దశ యెట్లుండునో ఎవరు వర్ణింపగలరు? ఇది యనిర్వచనీయమైన రహస్యము.

ఆ సమయమందు భక్తుని స్వకీయమైన సర్వము నా స్వామి చరణములందు స్వయముగనే సమర్పితమయిపోవును. అతడు ఆనందోల్లాసముతో నున్మత్తుడై లోకమును లెక్కచేయక వ్రజగోపికవలె నీ విధముగా చెప్పుకొనును. –

బహుళపాది - సీసము

సీ. త్యజియింతు నునుకువం, ద్యజియింతు వనము, వ
        ర్జింతు నాగరుల, వర్జింతు నగరి,
    చోరబోకుందు వంశీవటప్రాంతమ్ము
        సిగ్గిల్ల నెదియైన జేయ నేడు,
    దేహంబుఁ ద్యజియింతు, గేహంబుఁ ద్యజియింతు
        స్నేహ మేభంగిం ద్యజింపనేర్తు?,
    నీనాడు పచరింతు నిట్టులే రాజకా

ర్యము లెల్ల నూతన క్రమమునందు,
నెల్లవారికిఁ బిచ్చియెత్తె, నెల్లరు నాకు
నెంచుచుండిరి బిచ్చియెత్తె ననుచు,
నను బిచ్చిదంచు వాకొనువారి నేరిసే
నూరక విడనాడు నువిడను గాను,

తే. విన్న దన్నది యేదైన వీడుదాన,
వీడెదను దండ్రి, నన్నను గూడఁ గడకు,
తమ్ము వీడెద, వీడెద దైవతమ్ముఁ,
గాని కృష్ణుని విడనాడలేను విడను.

ప్రియతమా! నా జీవనము నీ కొరకే. మరణము నీ కొరకే. ఏమైనను నీ చరణ సన్నిధియందే. యిదియే నా హృద్గతమైన కోరిక. నా సర్వమును ఎట్లును నీకు అర్పితమైపోయినది. ఇక నా మరణ మున్నది! నేను మరణించిన పిమ్మట నా యీ శరీరమునకు జెందిన పంచభూతములును గూడ వేరువేరుగా విక్షిప్తములై నిన్నే సేవింపగలవు.

తాను మరణించిన పిదప తన శరీరగతములైన పంచభూతములును వేరువడి తన ప్రియతముని సేవనమును ఏమరునేమో యని యారాటపడు చిత్తముతో భక్తుడు విధాత నిట్లు ప్రార్థించును. -

పంచత్వం తనురేతు భూతనివహాః స్వాంశే విశంతు స్ఫుటం
ధాతారం ప్రణిపత్య హంత శిరసా తత్రాపి యాచే వరమ్
తద్వాపీషు పయస్తదీయముకురే జ్యోతిస్తదీయాంగణ
వ్యోమ్ని వ్యోమ తదీయవర్త్మని ధరా తత్తాలవృంతేఽనిలః.

ఇందలి భావమునే అనువదించుచు నొక కవి యిట్లు చెప్పెను. -

ఆ. వెరవ మరణమునకు, వెరవను విధికిని,
పంచభూతములు లయించుఁ గాక!
యతని త్రోవ, బావి, నద్దంబు, వ్యజనంబు,
నంగణంబు నింగియందు వరుస

పంచభూతతత్త్వములును ఎట్లును వేరుపడునవియే. దేవా! మీరు ఇంతమాత్రము చేయుడు! నా శరీరగతమైన జలతత్త్వము నా ప్రియతముడు స్నానము చేయుటకు, నీరములు గ్రోలుటకు నుపయోగించుకొను బావియందు లయము పొందుగాక! అగ్నితత్త్వము అతని యుద్ధమందు కలియుగాక! పృథివీతత్త్వము అతడు నడచు మార్గమందు నిలచు గాక! వాయుతత్త్వము అతని వ్యజనమందు (విసనకర్ర) లీనమగు గాక! ఆకాశతత్త్వము అతని యింటి ముంగిట యాకాశమందు ఏకత్వమును పొందు గాక!

ఇక జీవాత్మ యున్నది. అది యెన్నడును స్వామి చరణముల నెడబాయనే పాయదు. జీవుడు ఆ స్వామిని సర్వదా తన హృదయ మందిరములో దాచికొనును. ఇది భక్తుల 'కామము' నకు సంబంధించిన చిన్న దృశ్యము. ఇక మిగిలియున్నది వారి క్రోధస్వరూపము.

ఒకనాడు శ్రీకృష్ణుడు వినోదియై కోప మొదలించు చేష్ట యేదియో చేయగా రాధికకు కినుక కలిగెను. సకియ యామె నాశ్వాసింపబోయెను. అప్పుడామె క్రోధపూరితయై యిట్లు పలికెను. – "నీవు ఇక నా ముందు అతని పేరును కూడ తలపవలదు. అతనినే కాదు. నేను అతనివలె నల్లనైన ప్రతి వస్తువును కూడ త్యజించివైచెదను. యావజ్జీవము నతని విరహతాపమున కనలుచుండెదను. కాని యిక నతనిని గలిసికొనను."

సీ. కూడ నాతని నొక్కనాడు నీపయి నుర్వి
 నంగ మియ్యది నిల్చునంత దాక,
విరహంపు వెతసైతు, విపులంతజ్వాలాళి
 కాల్చివైచిన నన్ను గాల్చుఁ గాక!,
నెమ్మనమ్మున నిట్టి నిశ్చయ మ్మూనితి,
 నతని త్రోవల నీరమ్మైన ద్రావ,
సంస్పృశింపఁగఁబోను శ్యామవర్ణంబైన
 వస్తు వేదియు నింక వనిత! వింటె?,
తే. కాటుకను దాల్చ నొకనాటఁగన్నుదోయిఁ,
బోరపడియు మేన మృగమదంబును ధరింప,
నళిపికాలాపముల నింక నాలకింప,
నంబుగతమ్మైన యిందీవరంబు ముట్ట

ఒకింత పరికించి చూడుడు! ఈ పొలయలుక యందు ఎంత ప్రీతి నిండియున్నదో?

ఒకనాడు లీలామయుడైన శ్రీకృష్ణుడు తన భక్తులకు ప్రణయకోప మొదవించి యానందింప నెంచి ఆటలో నల్లరిచేసి వారికి కోపము గలిగించెను. వారు అందరు నితనిని ఆటలోనుండి తొలగింప నిశ్చయించిరి. శ్యామసుందరుని యెడబాటును భరించుటకు ఎవరి మనములు నంగీకరింపకుండెను. అతనిని దూరము చేసిన వారి ప్రాణములు నిలువజాలవు. ఆయినను వారు ఒకింత బింకము వహించి యిట్లు పలికిరి. – 'కృష్ణా! స్వయముగా నీవే గొడవను తెచ్చిపెట్టుచున్నావు. నీవే యలుక వహించి బిర్రబిగియుచున్నావు. తొలగుమా! యిటనుండి ఇక నీవు మాతో నాడవలదు.' ఇట్లు వారు పలికి తృణీకరించుటతో వారి ప్రాణధనమైన శ్యామసుందరుడు మెత్తబడిపోయెను. వారి పాదాల మీద పడి క్షమాభిక్ష కోరసాగెను. ఈ విషయమును సూరదాసిట్లు వర్ణించెను. –

బహుళపాది - సీసము

సీ. క్రీడలందుండు నేరికి నేర్పెఁ గిన్క?
కారో యెల్లరు సరివార లరయ?,
శ్రీదాముఁ డిటుగెల్చె, జితుండవైతివి హరీ!,
యయ్యు రోసముఁ బూననగున నీకు?
గొప్పవా? కావు నీ కులశీలములు సూడ
మాకంటె?, నీ పొందు మాకిఁకేల?,
ఒక్కింత లెక్కకు మిక్కిలి నీగోవు,
లగుట నాధిక్య మియ్యది వెలార్తె?,
కినియువానికి, మాకు నెనయు నెయ్యము లెట్లు?,
వలదు మాతో నాడవలదు పొమ్ము!,
అంచు గోపకు లాడ నాలించి హా! యంచు
హరి వ్రాలెఁ జని వారి యంఘ్రులందు
ఆ. నన్ను నాడనిండు! నను వీడి చనకుండు!
నా వినోదచేష్ట నమ్ముఁ డిద్ది,
నందు నాన నన్ను నమ్ముఁడీ! యని వార
వేడె 'సూరదాసు' విభు డతండు

ఇక మానలక్షణ విషయములు. దూషణరహితమైన మానము (అలుక) ప్రేమభక్తికి అలంకారమేయగును. ఒకప్పుడు శ్రీరాధాదేవి మానలక్షణమును పూని యలుక వహించి సకియతో నిట్లనెను. -

చ. చెలియరో! నందనందనుని జేరఁగనీయకు మిందు నేఁడు, లో
పల నిడరా దతండు పదపద్మము లెంతగ వేడికొన్నఁ, గ
ల్లలు వచియింతు రిట్టి జనులం గపటాత్ముల నమ్మరాదు, నా
యిలు దృఢియించి యిచ్చమెయి నే యెడకేనియుఁ బొమ్మనంగదే!

ఇట్లు అలుక వహించి యున్న యామెను శ్రీకృష్ణుడు వేడుకొని, విసిగిపోయి కడపట నిట్లు పలికెను. –

బహుళపాది - సీసము

సీ. ఏనాఁడు నెఱుఁగ నే నింత యలంత, నీ
యలుకయే రాధికా! కలుగఁజేసె,
ఉద్ధరించితిఁ గొండ, నుద్ధరించితిఁ వితా
మహుని వేదాలను మహిమ మెరయ,
మధువన్న శత్రుని మట్టుపెట్టితి, యుక్తి
బలిరాజ్యమును జిక్కఁబట్టి కొంటిఁ,
దొలగించి దుస్సహదుఃఖంబులను ద్విజున్
నృపునిఁ గావించితి నెనరు మెరయ,
మును స్వయంవరమందు ధనువుఁ ద్రుంచితిఁ, బూని
దుర్జయు రావణుం దునిమియుంటి,
నఘవత్సబకకేశికారిష్టులను జెండి
దావవహ్నిని దొల్లి ద్రావియుంటి,
మోహింపఁజేసితి మును దేవదానవా
వళి నెల్ల నింతిరూపము ధరించి,
వారాశి శోధించివైచితి మృతిఁ గన్న
గురుపుత్రు బ్రదికింపఁగోరి వింటె?

తే. ఇన్ని చేసిన నన్ను నీ వెఱుఁగ వొక్కొ?,
తలఁపఁగాఁ దోచు నివి నూత్నములుగ నేఁడు,
వేడుకొని వేడుకొని నిన్ను విసువుఁ గంటి,
ఇట్టి నను విస్మరింప నీకెట్లు చెల్లె?

'ఆహా! నీయీ మానలక్షణము విలక్షణము, ధన్యమునైనది. దేవీ! మహాకార్యములను సాధించితిని. నాకు అలసట యెందును దోచలేదు. ఎందును ఓటమి పొందలేదు. నేడు నిన్ను వేడుకొనుటలో నా బలమంతయు తరిగిపోయినది.' ఇది భక్తులకు, భగవానునకు నడుమ సాగు ప్రణయలీలా స్వరూపము. ఈ లీలలో రాగము, కామము, క్రోధము, మానము నన్నియు నున్నవి. కాని యవి వేరురూపమందున్నవి. అవి యన్నియు పవిత్రప్రేమకు నామాంతరమాత్రములు. ఇందున్న యీ సర్వధర్మ పరిత్యాగమే పరమధర్మము. ఇచ్చటి మర్యాదోల్లంఘనమే ప్రేమకు సంబంధించిన సర్వోన్నతమైన విధి.

ఈ చెప్పబడిన సిద్ధభక్తుల విషయము. భక్తిసాధనయందు ఎప్పుడైన కామక్రోధలోభములు బాధించుట సంభవమైనచో వానిని భగవాను నుద్దేశించియే యాచరింపవలెను. మన మార్గమందు బాధకములైన విషయములు భగవాను నుద్దేశించి ప్రయుక్తములైనప్పుడు సాధకములుగా పరిణమించును. ఇది నిశ్చితమైన విషయము. దీనిని మరవరాదు.

శ్రీమద్భాగవతములో పరమహంస శ్రేష్ఠుడైన శుకయోగి యేమనెనో చూడుడు! –

**కామం క్రోధం భయం స్నేహమైక్యం సౌహృదమేవ చ**
**నిత్యం హరౌ విదధతో యాంతి తన్మయతాం హి తే** (10/29/15)

'కామము, క్రోధము, భయము, స్నేహము, ఏకత్వము, సుహృద్భావము నను నీ సర్వమును భగవాను నుద్దేశించియే చేయువారు తప్పక నతనితోడ తన్మయత్వమును పొందుదురు.'

సర్వశ్రేష్ఠము, అఖిలైశ్వర్యమయము, మహామాధుర్యపరిపూర్ణము, సర్వాంగసుందరము, ఆనందమయమునగు వస్తువేదియో దాని కొరకే

ఉత్పన్నమగును. ఈ లక్షణము లన్నియు భగవానునియందు ఉన్నవి. ఈ విషయమును దృష్టిలో నుంచుకొని కేవల మొక్క శ్రీకృష్ణ పరమాత్మను గూడవలెనన్న కామన చేతనే పీడింపబడవలెను. ఈ కామన క్షణక్షణప్రవర్ధమానము గావలెను..ఇక ప్రేమపూర్వకమైన క్రోధము ఉన్నది. అది యిట్టులు ఉండవలెను. – 'ప్రియతమా! నీవు చాల క్రూరుడవు. ఎంతగా పిలిచినను రాకున్నావు. గుర్తుంచుకొమ్మా! ఇప్పుడు మాత్రము నేను పిలుచుచున్నాను. ముందు ముందు నీవు నా వెంటబడి తిరుగాడవలసినవాడవయ్యెదవు.' ఎనిమిది జాములు చింతనమందు మునిగియుండి భక్తుడిట్లు ప్రేమపూరితమైన మానలక్షణమును ప్రకటింపవలెను. – ''నా చెంత అఖండమైన చింతన ధనమున్నది. నీతో నాకు పనిలేదు. నీకు నాతో పని ఉన్న రమ్ము!'' – ఈ భావనలు ఇట్టివి.

భగవానుని యెడల కామక్రోధాభిమానములను ఎట్లు అనుసరింపదగును? అను విషయమున తల్లినంటియుండెడి పిల్లవాడు ఒక చక్కని యుదాహరణము. చంటిబిడ్డకు మీరు బహుమూల్యరత్న మేదేని యొసగుడు! మంచి మంచి పదార్థములను తినుట కర్పించుడు! వానిని ఎక్కువగా గారవించుడు! వాని కీర్తిగానము చేయుడు! నాయనా! నీకు స్వర్గమోక్షములు లభింపగలవురా! యని వానితో జెప్పుడు! కాని వాడు ఇవి యేవియు నొల్లడు. తల్లి, తల్లి స్తనములు మాత్రమే వానికి గావలయునవి. అతడు తదన్యమైన వస్తువు ఏదియు నెరుగనే నెరుగడు. అతడు ఎరుగునది, కోరునదియు నగు వస్తువు కేవలమొక్క వాని తల్లియే. ఆ తల్లికి బదులుగా ఏ వస్తువు నిచ్చినను వానికి తృప్తి గలుగదు. ఈ విధముగానే భక్తుడు కేవలము భగవానుని మాత్రమే కోరవలెను. కేవలమొక్క భగవానుడే యతనికి కామ్యుడు గావలెను.

పిల్లవాడు పెద్దవాడగును. బుడిబుడి నడకలు మొదలుపెట్టును. అట్లు నడచుచుండగా కాలికి ఏదియో తగిలి బోరగిలిపడి యేడ్వ నారంభించును.

వాని యేడుపు విని తల్లి పరుగెడి వచ్చును. పిల్లవానికి అలుక మొదలగును. పడినవాడు వాడు. కాని వానికి కోపము తల్లిమీద. ముద్దు ముద్దు మాటలతో అతడు 'అమ్మా! నీవు నన్ను ఒంటరిగా విడి యేల పోయితివి?' అనును. మరల వానికి అభిమానము పొడుచుకొని వచ్చును. మరల మూతి ముడుచును. 'పో! నేను నీతో మాటాడను. నీ యొడిలోనికి రాను' అనును. తల్లి వానిని బ్రతిమాలును. ఎత్తికొనెద నను. స్తన్యమిచ్చెద నను. వాడు దొరకక యేడ్చుచు, ముందుకు పరుగిడును. అతడు ఇట్లు ఎందుకు చేయును? అతడు సహజముగనే తన తల్లిమీద తన యధికారమును భావించికొన్నవాడు. తల్లినే తన సర్వస్వముగా భావించుచున్నవాడు. వాడు ఆకలి గొన్న తప్పు అమ్మది. పడిపోయిన అమ్మదే యపరాధము. వానికి నిదుర పట్టకున్న తల్లిదే దోషము. ఆ యపరాధమునకు శిక్ష వాని యలుక. వాని మూతి ముడుపు. వాని క్రోధము. వాని యభిమానము.

ఈ విధముగనే సర్వవిధముల భగవానునిపై నాధారపడిన భక్తుడు కూడ ఆ స్వామిని ఉద్దేశించియే కామక్రోధాభిమానములను అనుసరింపవచ్చును.



## ప్రేమిభక్తుల మహత్త్వము

"త్రిరూపభంగపూర్వకం నిత్యదాసనిత్యకాంతాభజనాత్మకం వా ప్రేమైవ కార్యమ్, ప్రేమైవ కార్యమ్." (66)

(స్వామి, సేవకుడు, సేవ యనబడు) మూడు రూపములను భంగపరచి నిత్యము దాసభక్తితో గాని, నిత్యము కాంతాభక్తితో గాని ప్రేమయే చేయవలెను. ప్రేమయే చేయవలెను.

స్వామి, సేవకుడు, సేవ అను మూడు రూపములను గాని, లేక పతి, పత్ని, పతిసేవయను మూడు రూపములను గాని చెరిపివైచి నిత్యము దాసభక్తితో గాని లేక కాంతాభక్తితోగాని భగవానుని ప్రేమింపవలెను. దాస్యభావము, కాంతాభావము నను నీ రెండు భావములందే ముందు ముందు భగవానునితోడ తాదాత్మ్యము సిద్ధించును. నిష్కామభావముతో శరీరము, మనస్సు, వాక్కు సర్వమును స్వామి కర్పించి, కేవలమొక్క యా స్వామిని దక్క అన్యమేదియు నెరుగకుండునట్టి స్థితి యేదో అది దాస్యభక్తికి ఆదర్శభూతమైనది. నాకు తనువైన, మనమైన, ధనమైన, గతియైన, మతియైన, ఆశ్రయమైన, జీవనమైన, ప్రాణమైన, ధర్మమైన, మోక్షమైన, భగవంతుడైన భర్తయేయగును. లోకములో నా దృష్టియందు నా భర్త యొక్కడు దక్క అన్యుడు ఎవ్వడును లేనేలేడు. నా పతి ధనము నా ధనము. అతని మనము నా మనము. అతని తనువు నా తనువు. అతని సేవ నా సేవ. అతని యైశ్వర్యము నా యైశ్వర్యము. అతని ప్రతిష్ఠ నా ప్రతిష్ఠ. అతని ప్రాణము నా ప్రాణము.' అని యీ విధముగా భావన చేయుచు కేవలము పతివ్రతయై, పతిగతప్రాణయై నిష్కామభావముతో, అనన్య భావముతో నిరంతరము పతిసేవయందు నిమగ్నురాలైయుండునట్టి స్థితి, కాంతాభక్తికి ఆదర్శభూతమైనది.

నిజమునకు ఈ రెండును ఒక్కటియే. ఈ రెండింటియందును సాదృశ్యమున్నది. అభేద మున్నది. దాస్యభక్తియందును సేవకుడు తన సర్వమును మరచి తన స్వామియొక్క నామగోత్రములు పొందినవాడు అయిపోవును. కాంతాభక్తియందు మాత్రము తన నామగోత్రములను పతియొక్క నామగోత్రములతో మేళవించివైచిన మీదటనే కాంతాభావము ప్రాప్తించును. దాస్యభావము విషయమున తులసీదాసు భావములను పరికించుడు! –

సీ. కోర నన్యుల కులగోత్రంబులను నేను
 కులగోత్రములు లేని కొంచెకాడ,
పనిలేదు నాకు నొక్కనితోడ నాతోడ
 బనియుండ దెవ్వానికిని ధరిత్రి,
లోకమ్మైనను బరలోకమ్మైనను నాయ
 దనయంబు శ్రీరాము హస్తగతము,
వరరామనామంబె పరమ మాధార మీ
 తులసి దాసునకెన్న తెలియుడన్న!

ఆ. రాముడితని వాడు రామునివాడి తం
డతనినే భజించు నతని దలచు
నతని కొరకె బ్రదుక నాత్మలో దలపోయు
నతనినే నుతించు నితడు సతము.'

'లోకములో జనులు చాల అమాయకులు. వారు ఉపాఖ్యానములను తెలియజాలరు. ప్రభువు యొక్క గోత్రమే సేవకుని గోత్రమగును. నేను మంచివాడనో, చెడ్డవాడనో ఏమైన కానిండు. నేను ఎట్టులున్నవాడను అట్లు రాముని వాడనే.'

ఇప్పుడు స్వామి యొక్కయు, సేవకుని యొక్కయు కులగోత్రములు ఒక్కటి యైనవి. కదా! ఈ దాస్యభావము యొక్క మహత్త్వమును కొనియాడుచు పరమేశ్వరి శ్రీరాధికా దేవి భక్తప్రవరుడైన యుద్ధవునితో నేమనెనో చూచితిరా-

కృష్ణభక్తిః కృష్ణదాస్యం వరేషు చ వరం వరమ్
శ్రేష్ఠా పంచవిధా ముక్తేర్హరి భక్తిర్గరీయసీ.
బ్రహ్మత్వాదపి దేవత్వాదింద్రత్వా దమరాదపి
అమృతాత్ సిద్ధిలాభాచ్చ హరిదాస్యం సుదుర్లభమ్.
(బ్రహ్మవైవర్త. కృ. 97/8-9)

శ్రీకృష్ణ భక్తియైనను, శ్రీకృష్ణ దాస్యమైనను, శ్రేష్ఠమైనవానిలో నన్నిటి యందును శ్రేష్ఠమైనది. శ్రేష్ఠములైన పంచవిధ ముక్తుల కంటెను కూడ హరిభక్తియే శ్రేష్ఠమైనది. గురుతరమైనది. బ్రహ్మత్వము, దేవత్వము, ఇంద్రత్వము, అమరత్వము, అమృతత్వప్రాప్తి, సిద్ధిలాభము నను నీయన్నిటి కంటెను శ్రీహరి యొక్క దాసత్వము ప్రాప్తించుట కష్టము.

కాంతా భక్తి యందు ఏకాత్మభావము ఉండనే యున్నది. ఎట్లన్న -

ఆ. ప్రియుని యెడల ప్రీతి హృదయ పంజరమందు
నిలిచియుంట నిప్పుడు పిలువసాగె
మొనసి రోమరోమమును ప్రియా! ప్రియ! యంచు
నిచట వేరు శబ్ద మెదియు లేదు. (వాదుర్ కవి)

ఆ. ఎందొ యన్యదేశమందున్న ప్రియునకు
పంపుదాన వ్రాసి పత్రికలను
కామమందు, కన్ను గవయందు మనమందు
వరలువాని కెట్లు వ్రాయనగును?

కాంతయు, కాంతుడును కలసి మెలసి యొక్కటి యైపోవుదురు. కావున అక్కడ మూడు రూపములకును స్వయముగనే భంగము ఏర్పడును. ఈ ఏకాత్మ భావ సంబంధమైన యాదర్శమును ముందు ఉంచుకొని, దీనికి మనస్సులో స్థానము కల్పించికొని దాస్యభావముతో గాని, కాంతాభావముతో కాని, భగవానుని ప్రేమించవలెనని ఇక్కడ సూత్రధారుడు చెప్పుచున్నాడు.

''భక్తా ఏకాన్తినో ముఖ్యాః.'' (67)

ఏకాంత భక్తులే ఉత్తములు. అనగా అనన్య భావము గల భక్తులు అన్నమాట.

వెనుకటి సూత్రము ననుసరించి భగవానుని యెడల అనన్యభక్తి కలవాడు అందరు భక్తులందును ఉత్తముడు అని యెన్నదగును. ఏలయన్న అతని తనువు, మనము, ధనము, సర్వము పరమాత్మయే అగును. అతడు లోకములో పరమాత్ముని చేతిలోని యంత్రము వంటివాడు. అతని ఆత్మ పరమాత్మతోడ మిళితమైపోవును. అతని మనము పరమాత్ముని మనస్సునందు రమింపసాగును. అతని కన్నులు ఎల్లవేళల, ఎల్లయెడల, పరమాత్మనే చూచుచుండును.

ఆ. కన్నుదోయిఁ బ్రియుని కాంతి నిండారగా
నిముడు నన్యకాంతి యెట్టులచట
బాటసారి నిండు పాంథశాలను గాంచి
మగిడి పోవకున్నె మారుదెసకు? (రహీము)

ఆ. కన్నులందుఁ గాటుకయుఁ బెట్ట వలనెట్టు
లనఁ బ్రియుండు నిండి యడరుచుండ
నందు నెట్టులుండు నవకాశ మన్యదీ
ప్తికి 'నిదెన్నగాఁ గబీరు వాణి' (కబీరు)

తే. అష్టయామంబులం జతుష్షష్టి ఘటిక
లందు లేరెవ్వరును లోకమందు నాకు
నీవ కందోయిఁ బ్రియతమా! నిండియుంటి
వెట్టులట నిద్ర కవకాశ మేని దొరకు?

''కంఠావరోధ రోమాం చాశ్రుభిః పరస్పరం లపమానాః పావయంతి కులాని పృథివీం చ.'' **(68)**

ఇట్టి యనన్య భావము గల భక్తులు కంఠావరోధము (గద్గదిక), రోమాంచము (ఒడలు పులకించుట), కన్నీటితో నిండిన కన్నులును గలవారై పరస్పరము మాటలాడుకొనుచు తమ కులములను, పుడమిని కూడ పావనము చేయుదురు.

ఈ విధమైన యనన్యభావము గల భక్తులు ఒకచోట జేరి తమకు ప్రాణతుల్యుడైన భగవానుని గూర్చి చర్చించుకొన్నప్పుడు వారితో ప్రేమసముద్రము పొంగి పొరలసాగును. అప్పుడు వారు ఎంత ప్రయత్నించినను గద్గదిక కారణముగా ఏమియు మాటలాడలేరు. శరీరములు పులకించిపోవును. వారి రోమరోమము నుండియు ప్రేమసంబంధమైన కిరణములు వెలువడి యచ్చటి ప్రదేశమంతయు ప్రేమజ్యోతిచేత పరివ్యాప్త మయిపోవును. అచ్చటి వాతావరణ మంతయు పవిత్రమైన ప్రేమమయ మయిపోవును. ఆ సమయమున భక్తులు ప్రేమవిహ్వలతను బొంది తమ కన్నులనుండి ప్రేమాశ్రువులను ఒలికించుచు పరమానందరసమందు తేలియాడుచుందురు. ఇట్టి స్థితి చాల దుర్లభమైనది. పరమపవిత్రమైనది. ఈ స్థితిని పొందినవారు మహాభాగ్యశాలులు. దీనివలన వారి వంశము లన్నియు పవిత్రములైనవే యగును.

ఆ. ఆ కులంబె ధన్యమగు సుమా! యదె జగ
త్పూజ్య మగు నదే ప్రపూత మగును
రామచంద్రునే పరాయణంబుగ నెంచు
వినయశీలి నరుడు వెలయు నెందు.

అంతియే కాదు. వారి యునికి వలన పుడమి కూడ పునీత మగును. ఆ సమయమందు పవిత్ర ప్రేమస్వరూపుడైన యా భక్తుని శరీరము యొక్క సంస్పర్శము నందిన యొకింత వాయువు ఎవని శరీరమును దాకిన అతడు కూడ పవిత్రుడైపోవును. శాస్త్రమందు కూడ చెప్పబడియున్నది. –

కులం పవిత్రం జననీ కృతార్థా
వసుంధరా పుణ్యవతీ చ తేన
అపారసంవిత్సుఖసాగరేఽస్మిన్
లీనం పరే బ్రహ్మణి యస్య చేతః.

(స్కాంద. మా.ఖం.కౌ.ఖం 55/140)

మేరలు లేని జ్ఞానానంద సముద్రమగు పరబ్రహ్మమునందు లీనమైన చిత్తము గలవాడు ఎవడో వాని జన్మము వలన వాని కులము పవిత్రమగును. వాని తల్లి కృతకృత్యురాలగును. పుడమి పునీతమగును.

ఈ విషయమున శ్రీమద్భాగవతము ఏమనుచున్నదో చూడుడు! –

వాగ్గద్గదా ద్రవతే యస్య చిత్తం
రుదత్యభీక్ష్ణం హసతి క్వచిచ్చ
విలజ్జ ఉద్గాయతి నృత్యతే చ
మద్భక్తియుక్తో భువనం పునాతి. (11/14/24)

ప్రేమ ప్రకటమగుట చేత ఎవని వాక్కు గద్గదిక వహించునో, చిత్తము ద్రవించిపోవునో, ప్రేమావేశము కారణముగా ఎవనికి మాటికి మాటికి ఏడ్పు వచ్చునో, ఎవడు ఒకప్పుడు నవ్వుచు ఒకప్పుడు సిగ్గు విడిచి బిగ్గరగా గానము చేయుచు నాట్యము చేయనారంభించునో అట్టి నా పరమభక్తుడు మూడు లోకములను పావనము చేయును.

''తీర్థీకుర్వంతి తీర్థాని సుకర్మీకుర్వంతి కర్మాణి సచ్ఛాస్త్రీకుర్వంతి శాస్త్రాణి.'' **(69)**

**ఇట్టి భక్తులు తీర్థములను ఉత్తమతీర్థములుగాను, కర్మలను ఉత్తమకర్మలు గాను, శాస్త్రములను ఉత్తమ శాస్త్రములుగాను పరిణతము చేయుదురు.**

తీర్థము లన్నవి పాపాత్ములైన స్త్రీ పురుషులను పాపదూరులను, పవిత్రులను గావించును. కాని నిరంతరముగా పాపాత్ముల సమాగమము కారణముగా ఆ తీర్థములందు మాలిన్యము ప్రవేశించుచుండును. ఆ మాలిన్యము ఈ ప్రేమిభక్తుల సమాగమము వలన తొలగిపోవును. దిలీపకుమారుడైన మహారాజా భగీరథుడు చేసిన తపస్సు చేత ప్రసన్నురాలై ప్రత్యక్షమైన భగవతి గంగాదేవి యతనితో నిట్లనెను - ''భగీరథా! నేను భూమిమీదకు ఎట్లు రాగలను? లోకములోని పాపులు అందరును వచ్చి నాయందు తమ పాపములను కడిగివేసికొందురు. కాని వారు నాయందు విసర్జించిన యా మహాపాప పంకమును నేను ఎందు పోయి కడుగు కొందును? ఈ విషయమును గూర్చి నీవు ఏమి యాలోచించితివి?'' అనగా విని భగీరథుడిట్లు బదులు చెప్పెను. -

**సాధవో న్యాసినః శాంతా బ్రహ్మిష్ఠా లోకపావనాః**
**హరంత్యఘం తేఽంగసంగాత్ తేష్వాస్తే హ్యఘభిద్ధరిః**
**(శ్రీమద్భాగ. 9/9/6)**

'తల్లీ! సమస్త విశ్వమును పావనము చేయువారు, విషయములను వీడినవారు. శాంతస్వరూపులు, బ్రహ్మనిష్ఠులు, సాధువులునగు మహాను భావులు వచ్చి నీ ప్రవాహమందు స్నానమాచరింతురు. అప్పుడు వారి శరీర సంస్పర్శము వలన నిన్నంటిన పాపము లన్నియు డుల్లిపోగలవు. ఏలయన్న వారి హృదయములందు సమస్తపాపహారి యగు శ్రీహరి విరాజిల్లుచుండును.'

ప్రచేతసుల గణము భగవానుని స్తుతించుచు నేమనిరో చూడుడు! –

తేషాం విచరతాం పద్భ్యాం తీర్థానాం పావనేచ్ఛయా
భీతస్య కిం న రోచేత తావకానాం సమాగమః. (శ్రీమద్భాగ. **4/30/37**)

'మీ భక్తులు తీర్థములను పవిత్రములను గావించుటకే భూమిపై చరించుచుందురు. వారితోడి సమాగమము సంసారభయభీతుడైన పురుషునకు ప్రియమేల కాకుండును?'

ధర్మరాజు భక్తప్రవరుడగు విదురునితో నన్న మాట.-

భవద్విధా భాగవతాస్తీర్థభూతాః స్వయం విభో
తీర్థీకుర్వంతి తీర్థాని స్వాంతస్థేన గదాభృతా. (శ్రీమద్భాగ. 1/13/10)

'ఓ ప్రభూ! మీవంటి భగవద్భక్తులు స్వయముగనే తీర్థస్వరూపులు. (పాపుల వలన కలుషితములైన) తీర్థములకు మీరు మీ హృదయమందు వెలుగొందుచున్న గదాధర భగవానుని ప్రభావము చేత మరల తీర్థస్థితిని కలిగించుచుందురు.'

ఈ విధముగనే భక్తులచేత నాచరింపబడు శాస్త్రోక్తకర్మలే సత్కర్మలగును. వారు ఏ శాస్త్రము నాదరించిన అదియే సచ్ఛాస్త్రముగా

పరిగణితమగును. అట్టి భక్తులు నిలచిన తావు, స్నానమాడిన రేవు తీర్థమగును. వారు ఏ కర్మ చేసినను అది యాదర్శభూతమైన సత్కర్మగా అగును. వారు ఏమి యుపదేశించినను అది సచ్ఛాస్త్రము, తీర్థము అననేమియో, సత్కర్మము అననేమో, శాస్త్రము అననేమియో తెలిసినప్పుడు ఈ విషయము బాగుగా హృదయంగమ మగును.

''తన్మయాః.'' (70)

(ఏలయన్న) వారు తన్మయులు.

సముద్రములో కలిసి తద్రూపముగా పరిణతమైపోవు నదివలె భక్తుడైనవాడు తన తనువు, మనస్సు, బుద్ధి, అహంకారము సర్వమును తన ప్రియతమ భగవానునకు అర్పించివైచి యాతనితోడ ఐక్యమగును. అట్టి భక్తుడు సాక్షాత్తు భగవత్స్వరూపుడే యగును. అతడు ఎక్కడకు వెడలిన అక్కడ స్థూలము, సూక్ష్మమునగు వాతావరణ మెల్ల పరిశుద్ధము అయిపోవును. ఈ కారణముననే యతని సమాగమ మాత్రమున తీర్థము, కర్మము, శాస్త్రము మూడును పవిత్రములు అగునని చెప్పబడినది. ఇట్టి భక్తుల వలననే భగవానుని యొక్కయు, తన్నామము యొక్కయు, తద్భక్తి యొక్కయు మహత్త్వము పెంపొందును. వీరి సంపర్కము లోనికి వచ్చిన స్త్రీపురుషులు ఎంతటి పాపాత్ములైనను ఈ భయంకర సంసార సముద్రము నుండి అనాయాసముగా తరించిపోవుదురు.

''మోదంతే పితరో నృత్యంతి దేవతాః సనాథా చేయం భూర్భవతి.'' (71)

(ఇట్టి భక్తుల యావిర్భావమును గాంచి) పితృదేవతలు

ప్రమోదమును పొందుదురు. దేవతలు నాట్యము చేయుదురు. భూమి నాథుడు కలది యగును.

భక్తజనుల యావిర్భావము ఎల్లరకును శుభహేతువే యగును. ఏలయన్న వారుచేయు పనులు అన్నియు సహజముగా లోకకల్యాణ కరములైనవే యగును. వారి ప్రభావము వలన జనులలో ధర్మము నెడల శ్రద్ధ పెంపొందును. పితృకార్యములందు, దేవకార్యములందును విశ్వాసము ఉత్పన్నమగును. దీనివలన ధర్మమార్గమునుండి దిగజారిన వ్యక్తులు మరల ఆ మార్గము నవలంబించి యజ్ఞములు, దానములు, శ్రాద్ధములు, తర్పణములు మున్నగు క్రియల నాచరింప మొదలుపెట్టుదురు. ఆ క్రియల వలన దేవతలకు, పితృదేవతలకును పరమసుఖము ప్రాప్తించును. భక్తి ప్రభావము చేత భక్తునియొక్క ముందు, వెనుక తరములవారు ఎందరో తరించిపోవుదురు. కావున తమ వంశములో భక్తుడు ఆవిర్భవింపగా జూచి ముక్తులము కాగలమన్న యాశ బలపడి పితరులు పరమానందము ననుభవింతురు. ఈ విషయమున పద్మపురాణ మిట్లు చెప్పుచున్నది. -

ఆస్ఫోటయంతి పితరో నృత్యంతి చ పితామహాః
మద్వంశే వైష్ణవో జాతః స నస్త్రాతా భవిష్యతి.

'పితృపితామహుల గణములు తమ వంశమందు భగవద్భక్తుడు ఆవిర్భవించెనని యెరిగి - ఇతడు తమను ఉద్ధరించునన్న యాశవహించి యానందముతో తాళము వేయుచు నృత్యము చేయుదురు.'

భగవద్దర్శనము కొరకు స్థిర నిశ్చయముగల భక్తులు మరి దేనిచేతను కూడ సంతుష్టిని పొందరు. ఆ కారణమున వాత్సల్యపూరితయైన మాతృమూర్తివలె వానిని తన ఒడిలోనికి జేర్చికొని లాలించి పాలించి యానందింప జేయుటకై సచ్చిదానంద ఘనుడైన భగవానుడు

దివ్యరూపముతో వారి ముందు ప్రత్యక్షమగును. అతడు ప్రకటమైనంతనే దేవతల కహితులైన రాక్షసుల వినాశము మొదలగును. ఈ విధముగా భక్తుని యావిర్భావమునే భగవానుని అవతారమునకు, ఆవిష్కారమునకు ప్రధానకారణమని యెరిగి దేవతలు కూడ నర్తింప నారంభింతురు. భక్తులు, భగవానుడు నావిర్భవించనంత వరకు భూదేవి యనాథగానే యుండును. భక్తులు ఆవిర్భవించినంతనే ప్రేమవశమున లేగదూడ వెంట పరుగువెట్టు గోవువలె భగవానుడు కూడ అవతరించుచుండును. కాబట్టి భక్తుని యావిర్భావము చేత పృథివి నాథుడు కలదియగుట సంభవమగునని చెప్పబడినది.

''నాస్తి తేషు జాతి విద్యారూప కుల ధన క్రియాదిభేదః.'' **(72)**

వారియందు (ఆ భక్తులయందు) జాతి, విద్య, రూపము, కులము, ధనము, క్రియ యనువానికి సంబంధించిన భేదము ఏదియును లేదు.

సూత్రకారుడు ఇక్కడ తెలియజెప్పుచున్న విషయము. - భక్తి విషయమందు జాతి, విద్య, కులము, రూపము, ధనము, క్రియ మున్నగువానికి ప్రాధాన్యము లేదు. బ్రాహ్మణుడు కాని, శూద్రుడు కాని, విద్యావంతుడు కాని, విద్యారహితుడు కాని, సుందరుడు కాని, కురూపి కాని, ఉన్నతవంశము వాడు కాని, నిమ్నవంశమువాడు కాని, ధనవంతుడు కాని, దరిద్రుడు కాని, మిక్కిలి క్రియాశీలుడు కాని, క్రియారహితుడు కాని, యెవడు తన సర్వస్వమును భగవదర్పణము గావించి నిరంతరము తత్స్మరణమందు చిత్తమును సంలగ్నము గావించునో వానికే భక్తి యనబడు దుర్లభమైన పరమధనము ప్రాప్తించును. నిషాదుడు నీచజాతిలో పుట్టెను. కన్నప్ప వేటగాడు. శబరి గిరిజన వనిత. ధ్రువుడు విద్యలేని బాలకుడు. విభీషణుడు రాక్షసుడు. హనుమంతుడు వానరుడు.

విదురుడు, సుదాముడును (కుచేలుడును) ధనహీనులు. గోపికలు క్రియావిరహితలు. అయినను వీరు అందరును భక్తిప్రపత్తుల ప్రభావము చేత భగవత్ప్రేమ భాగ్యమును బడసినారు. భగవానునకు అత్యంత ప్రేమపాత్రులు అయినారు. సమస్త సత్కర్మల ఫలస్వరూపమైన భక్తి యెవని హృదయమందు ఉండునో అతడే భక్తుడు. అతడే సర్వగుణసంపన్నుడు. అతడు ఎట్టివాడు? అన్న ప్రశ్నకు తావేలేదు. ఈ విషయమే తులసీదాసు ఇట్లు చెప్పెను. –

ఆ. అతడె సుగుణవంతు, డఖిలజ్ఞుడును, జ్ఞాని
దాత, పండితుం డతండె ధర్మ
పరు డతండె వంశపాలకుం డతడై శ్రీ
రామచరణయుగ్మరతు డెవండు

ఆ. అతడె నీతినిపుణు డాతడే చతురుండు
శ్రుతుల యర్థ మెరిగె నతడె చక్క
నతడె కవియు బుధుడు నాహవధీరుండు
ఛలము లేక రాము గొలుచు నెవడు

ఆ. శివ! మహేశ! యీశ! చేకొనందగు నాదు
భక్తియుక్తితోడి బంధ మొండె
యంచు దొల్లి నాకు నా రామచంద్రుండు
చెప్పె కరుణ మెరయ చెలువమిన్న!

ఆ. ధనము, బలము, కులము, ధర్మంబు, జాతియు,
గరిమ, గుణము, నేర్పు, పరిజనంబు
పుడమి భక్తిహీను కడ రాణ గనకుండు
నంబురహితవారిదంబు వోలె

దీనినిబట్టి భక్తుడైనవాడు తనను సర్వాధికారిగాను, సర్వగుణ సంపన్నునిగాను భావించుకొని యెల్లరచేతను పూజలు చేయించుకొనవలెనని కాని, సమాజము, జాతి, వర్ణము, ఆశ్రమమునందును, పెద్దవారితోడ ఆహారవిహారములు, వివాహాది వ్యవహారములు, సంప్రదాయములు, ఆచార పద్ధతులు, కులపరంపరలు మొదలయిన వానియందు తనకు సమానాధికారము ఉన్నదని యెంచి అది చెల్లుటకై అహంకరించవలెనని కాని భావమును గ్రహింపరాదు. భక్తుడు ఎప్పుడును సర్వవిధముల అభిమానరహితుడై యుండును. అతడు ఈ నూతనాభిమానమును నెత్తిన పెట్టుకొని యట్లు ఏల చేయును? అట్లు చేయువారు భక్తులు కారు. వర్ణాశ్రమములు వేరు. భక్తివేరు. భక్తి పేరున వర్ణాశ్రమములను నాశనము చేయువారు భక్తిని కళంకితము చేసినవారగుదురు. కావుననే భక్తిమార్గమందు పయనించువారు శాస్త్రమర్యాదను ఉల్లంఘించవలె నన్న భావనకు కూడ మనములో చోటు ఈయరాదు. ప్రారబ్ధములో లేనప్పుడు విద్య, ధనము ప్రాప్తింపవనుట నిజము. ఈ జన్మలో రూపము, జాతి మారునవి కావనుటయు నిజమే. అయినను ఈ వస్తువులు ఉండుట వలన, లేకుండుట వలన లేక ఎక్కువ తక్కువలుగా నుండుట వలనను, భక్తుడు తనను అధికునిగనో, అల్పునిగనో భావించికొనరాదు. భక్తి సంబంధమును బట్టి జాతిభేదము కారణముగా తనను తక్కువవానినిగా ఎన్నడును భావించుకొనరాదు. ఈ కారణముననే వైష్ణవశాస్త్రములలో జాతిభేద మొక యపరాధముగా చెప్పబడినది. -

వైష్ణవశాస్త్రములందు 64 అపరాధములు పేర్కొనబడినవి. వానిని దృష్టిలో నుంచుకొని నడుచుకొనుట వలన అధికలాభమును పొందవచ్చును. అవి యివిగో। ఇవి. -

1. భగవానుని సాధారణ దేవతయో లేక యొక తత్త్వవిశేషమోయని

భావించుట. 2. వేదములను సాధారణ గ్రంథములు గాను, పౌరుషేయములుగాను భావించుట. 3. భక్తులలో జాతిభేదమును పాటించుట. 4. గురువును సాధారణ మానవునిగా తలపోయుట. 5. భగవానుని ప్రతిమను కేవలము కొయ్యయని, పాషాణమని, ధాతువని, కాగితమని, మృత్తికయని తలపోయుట. 6. భగవానుని పాదోదకమును సాధారణ జలముగా తలపోయుట. 7. భగవానుని ప్రసాదమును సాధారణ భక్ష్యముగా నూహించుట. 8. తులసిని సాధారణ వృక్షముగా నెంచుట. 9. గోవును సాధారణ పశువని భావించుట. 10. భాగవతమును, భగవద్గీతను సాధారణ పుస్తకములుగా తలచుట. 11. భగవానుని లీలలను సామాన్య మానవునివని తలచుట. 12. సాంసారిక ప్రేమతోను, స్త్రీ సుఖముతోను భగవానుని లీలను సరిపోల్చుట. 13. గోపికలను (భగవానునకు) పరకాంతలని భావించుట. 14. రాసలీలను కామచేష్టగా పరిగణించుట. 15. భగవానుని యుత్సవసమయములందు అంటరానితనమును పాటించుట. 16. ఈశ్వరుని, శాస్త్రములను విశ్వసింపక నాస్తికత్వము నభిలషించుట. 17. సందేహముతో ధర్మము నాచరించుట. 18. ధర్మపాలనమందు అలసట చూపుట. 19. భక్తులను బాహ్య విషయముల నుంచి సామాన్యునిగా తలచుట. 20. సాధువులైన మహాత్ముల గుణదోషములను పరిశీలించుట. 21. తనను ఉత్తమునిగా తలచికొనుట. 22. ఒక దేవతను కాని, శాస్త్రమును కాని నిందించుట. 23. భగవానుని ముందు వెనుదిరిగి కూర్చుండుట. 24. భగవానుని చేరువకు చెప్పులతో వెడలుట. 25. భగవానుని మూర్తి ముందు మాలలను ధరించుట. 26. భగవానుని యెదుటకు బెత్తెము చేతబట్టుకొని వెడలుట. 27. భగవానుని యెదుటకు నీలి వస్త్రములతో వెడలుట. 28. దంతధావనము చేసికొనక వెడలుట. 29. మలవిసర్జనము, మైథునాదులు చేసిన పిదప ఆ బట్టలు మార్చుకొనకయే ఆలయములో ప్రవేశించుట. 30. భగవానుని మూర్తి ముందు కాలుసేతులు బారసాచుట. 31.

భగవన్మూర్తి ముందు తాంబూలమును సేవించుట. 32. భగవన్మూర్తి యెదుట బిగ్గరగా నవ్వుట. 33. తప్పుడు పనులు చేయుట. 34. స్త్రీల చుట్టును తిరుగుట. 35. క్రోధము వహించుట. 36. భగవన్మూర్తి యెదుట ఇతరులకు నమస్కరించుట. 37. దుర్గంధభరితమైన వస్తువు ఏదియైన తిని యా వాసన పోవక ముందే యాలయము లోపలకు వెడలుట. 38. మత్తు పదార్థములను సేవించుట. 39. ఎవనినైన అవమానించుట, కొట్టుట. 40. కామక్రోధాది చేష్టలకు పాల్పడుట. 41. అతిథులకు, సాధుజనములకు స్వాగత సత్కార విధులు ఆచరింపకుండుట. 42. తనను భక్తునిగా, ధర్మాత్మునిగా, పండితునిగా, పుణ్యపురుషునిగా భావించుకొనుట. 43. నాస్తికులు, వ్యభిచారులు, హింసాపరులు, లోభులు, కల్లలాడువారు నగు మనుష్యులతో సంపర్కము కలిగియుండుట. 44. కష్టములు కలిగినప్పుడు భగవానుని నిందించుట. 45. పాపము కొరకు ధర్మమాచరించుట. 46. ఎవనికైన ఈషణ్మాత్రపు దుఃఖమైన కలిగించి తనను తాను ధార్మికునిగా తలచుకొనుట. 47. భార్యను, బిడ్డలను, పరివారమును, ఆశ్రితులను, దీనులను, సాధుజనులను పాలించి పోషింపకుండుట. 48. ఏ వస్తువునైన తనకు భోగ్యమైనదిగా నెన్నుకొని భగవానునకు నివేదించుట లేక నివేదింపక తానే యారగించుట. 49. తన యిష్టదైవతము పేరున ఒట్లు పెట్టుకొనుట, శపథములు చేయుట. 50. ధర్మమును, భగవన్నామమును అమ్ముకొని ధనోపార్జనము చేయుట. 51. తన యిష్ట దైవతమును వీడి యన్యుల నుండి యేమైన నాశించుట. 52. శాస్త్రమర్యాద నుల్లంఘించుట. 53. బ్రహ్మజ్ఞానము తనకు కలుగకున్నను బ్రహ్మజ్ఞానివలె ప్రవర్తించుట. 54. సంప్రదాయ భేదమును బట్టి వైష్ణవులలో ఒకని నధికునిగా, మరియొకనిని కొంచెపువానినిగా భావించుట. 55. దేవతల ననుకరించి వారివలె నాచరించుట. 56. అవతారలీలలందు తారతమ్యము నూహించి వానిని నిందించుట. 57. పరిహాసమునకైనను ఎవరినైనను మీరే భగవంతుడనుట. 58.

పొరపడియైనను భగవానుని పక్షపాతబుద్ధి గలవానినిగా తలపోయుట. 59. లోభబుద్ధితో ఎవనికైన భగవానుని చరణోదకమును, ప్రసాదమును అర్పించుట. 60. భగవానుని చిత్రమును, ప్రతిమను, నామమును అవమానించుట. 61. ఏ జీవికైనను ఏ విధముగానైనను కష్టము గలిగించుట, భయము కలిగించుట లేక ఎవరికైనను అహితమును గలిగించుట. 62. వాద వివాదములందు ఓడిపోయినప్పుడు, సిద్ధాంతమును నిలుపలేని యప్పుడు నైరాశ్యమును పొంది యాస్తిక్యబుద్ధిని వీడుట. 63. భగవానుని యవతారములను, జన్మకర్మాదులను సాధారణమైనవిగా భావించుట. 64. భగవానుని యుగళస్వరూపమందు ద్వైతబుద్ధిని పాటించుట.

''యతస్తదీయాః.'' **(73)**

ఏలయన్న (భక్తులందరును) అతని (భగవానుని) వారే.

భక్తులు తమలోని భక్తియొక్క ప్రభావము చేత భగవద్రూపులే! కావుననే వారి యందు పారస్పరికమైన భేదబుద్ధి యుండదు. వారిలో నెవ్వడును ఏ కారణము చేతను గూడ తనను అధికునిగా భావించుకొనడు.



## వాదవివాదరూపములైన విఘ్నములు

''వాదో నావలంబ్యః.'' (74)

(భక్తుడు) వాదవివాదములకు పాల్పడరాదు.

'భక్తిసాధన చేయువారికి ఈ సూత్రము బహు ప్రధానమైనది. విలువ గలది. తర్కవితర్కములకు పాల్పడవలసిన యావశ్యకత భక్తునకు అవంతయును లేదు. నా ప్రతిక్షణము నా ప్రియతమ భగవానుని భజనమునకు సమర్పితము అయిపోయినది. దానిని ఇతర విషయములందు వెచ్చించుటకు నాకు అధికారము లేదు' అని భక్తుడు భావించుకొనవలెను. ఇట్లు భావించుకొన్నవాడు అతడు ఎవరితో ఏవిషయమున తర్కవితర్కములకు పూనుకొనును? సృష్టి ఎప్పుడు అయినది? ఎట్లు అయినది? ఎందులకు అయినది? దీని మూలతత్త్వమేమి? అనునిట్టి విషయములను తెలిసికొనవలసిన యావశ్యకత ఇక అతనికి ఉండదు. అతడు భగవానునే తన సర్వస్వముగా భావించుకొని యతనినే ఏకాగ్రమైన లక్ష్యము గావించుకొన్నవాడు. భగవానుడు తాను తలచినప్పుడు అతనికి తన తత్త్వమును ఎరిగించును. ఎప్పుడు ఎరిగించును? ఇంతకు ఎరిగించునా? ఎరిగింపడా? అన్న విషయమును గూర్చి యతడు చింతింప నక్కరలేదు. తన ప్రియతమ భగవానుని చింతనమునకు దక్క అన్యవిషయముల చింతనమునకు అతని మనములో తావే యుండరాదు. తర్కము వలన తత్త్వము తెలియరాదనినననిది నిజము. కావుననే బ్రహ్మసూత్రములందు 'తర్కాప్రతిష్ఠానాత్' (2/1/11) తర్కమునకు ప్రతిష్ఠ లేదు అని చెప్పబడినది. కఠోపనిషత్తులో కూడ - 'నైషా తర్కేణ మతిరాపనేయా' (1/2/9) బుద్ధితో తర్కించుట వలన ఆ తత్త్వము

ప్రాప్తించునది కాదు అని చెప్పబడినది. ఆ సత్యతత్త్వము శుద్ధాంతఃకరణుడైన సాత్త్విక పురుషునకు స్వయముగానే ప్రాప్తించును. 'వాదే వాదే జాయతే తత్త్వ బోధః' వాదించగా వాదించగా తత్త్వబోధము కలుగు ననుట కూడ కొంతమేరకు సత్యమే. కాని యీ వాదము వేరు. శ్రద్ధావంతుడైన శిష్యుడు జిజ్ఞాసా దృక్పథముతో గురువు నెదుట తర్క పద్ధతిని అనుసరించును. గురువు అతని సందేహమును నివారించి వాని ముందు మరింత ప్రబలమైన తర్కమును ప్రతిపాదించి సిద్ధాంతీకరించుటకు ప్రయత్నించును. ఇట్టి వాదము దోషభరితమైనది కాదు. కాని పిడివాదముతో సాగుట మాత్రము దుష్పరిణామమునే కలిగించును. వాదములందు తమ వాదము నెగ్గవలెనన్న పంతగింపు భావములు కలుగుట సహజము. అప్పుడు సిద్ధాంత లక్ష్యము వదలిపోవును. వ్యక్తిగతముగా దోషాన్వేషణము, దోషారోపణము, పరస్పరము దూషణ మొదలగును. వివేకము భ్రష్టమైపోవును. క్రోధ మావరించును. వాక్కు వశము తప్పును. వైరము ప్రబలమగును. ఆ కారణముననే 'వాదే వాదే వర్ధతే వైరవహ్నిః' వాదవివాదముల వలన వైరాగ్ని పెచ్చరిల్లునని చెప్పబడినది. భక్తిమార్గమందు పయనించువానికి వాదవివాదములు సాగించుటకు అవకాశమే యుండరాదు. సాధ్యమగు నంతవరకు వాదవివాద స్థానములకు దూరముగనే యుండవలెను. ప్రారబ్ధవశమున ఏ కారణము చేతనైన అట్టి వితండవాదులతోడ సమాగమము సంభవమైనప్పుడు సవినయముగా వారి వాదము నాలకించి యుక్తమైన ప్రత్యుత్తర మేదియో చెప్పి వాదము ముందునకు సాగకుండుటకు ప్రయత్నింపవలెను. 'అతృణే పతితో వహ్నిః స్వయమేవోపశామ్యతి' ఇంధనము లేనిచోట పడిన యగ్ని స్వయముగనే శాంతించును. కాబట్టి భక్తునకు మౌనధారణమే సర్వవిధముల నుపయుక్తమైనది. 'మౌనం సర్వార్థసాధనమ్' అన్నమాటను మరవరాదు. తన యిష్టమందు, మార్గమందు, విశ్వాసమందు, సాధనయందు

సంశయస్థితిని గలిగించునట్టి మాటలను ఆలకింపనేరాదు. ఇతరులకు దుఃఖము గలిగించు మాట యేదియు నెవరితోను పలుకరాదు. సమయాసమయములందు ఇతరుల మాటలను వినక తప్పని స్థితి వచ్చినప్పుడు ప్రశాంతముగా నాలకింపవలెను. కాని తర్కించు సంకల్పముతో కాని, ఇతరులను అణచియుంచుటకు కాని, తన వాదమును నిలుపుకొనుటకు కాని వాదవివాదముల లోనికి దిగరాదు. ఇట్లు అంటిమి కదా! యని భక్తిశ్రద్ధలతో నడుగువానికి ఏమియు బదులు చెప్పకూడదు అనికాని, తరుణము వచ్చినప్పుడు అడుగకపోయినను ఇతరులకు హితమును ఎరిగింప కూడదని కాని భావించికొనరాదు. వాదవివాదములలోనికి దిగరాదు. అన్నదే యందలి యభిప్రాయము. అనావశ్యకముగా మాట యాడనేరాదు. తప్పని పరిస్థితి యైనప్పుడు కార్యసాధన మగునంత మేరకే మాటలాడవలెను. అదియు సంగ్రహముగా మాటలాడవలెను. మాటలను పెంచరాదు. వివాదదృష్టితో మాటలాడరాదు. ఎవనిని ప్రతిఘటింపరాదు. ఎవనితోడను పరియాచకము లాడరాదు. ఎవని దోషములను ఉగ్గడింపరాదు. ఎవని మనమునకును నొప్పి గలిగింపరాదు. తనను, తన వాదమును ప్రశంసించికొనరాదు. ఎవనిని నిందింపరాదు. కటువచనము లాడరాదు. మాటలలో ఆశను కామనను వెల్లడింపరాదు. మాటలతో ఎవనిని వంచింపరాదు. ఒకని విశ్వాసమందు సందేహము గలిగింపరాదు. సత్యము, మధురము, ప్రియము, ఉద్వేగమును గలిగింపనిది, హితమును గలిగించునదియైన మాటనే పలుకవలెను. శేషసమయ మంతయు భగవన్నామస్మరణముతోనే గడపవలెను. అనావశ్యకమైన మాట యొక్కటి పలికినను ఎంతయో హాని కలుగుననుటను మరవరాదు. ఏలయన్న దానికి అయిన సమయము వ్యర్థమగును. ఆ సమయమందు నాల్కతో నామజపము నిలిచిపోవుట యొక నష్టము. పలికిన పలుకుయొక్క ప్రభావము వాతావరణమందు

విస్తరించుట మరియొక నష్టము. తర్కముల వలన, వాదవివాదముల వలన భగవత్ప్రేమ కాని, భగవత్ప్రాప్తి కాని యెన్నడును కలుగనేరదు అనుట నిశ్చయము. వాని వలన అహంకారము, ద్వేషము, క్రోధము, హింస, వైరము అనునవి ఒకచోట చేరును. కావున సర్వదా వాదవివాదములకు దూరముగనే యుండవలెను. ఈ విషయమున తులసీదాసు ఇట్లు చెప్పియున్నాడు. -

ఆ. తలచి యీ విధానఁ దమ మనమ్ములఁ దద్వి
దులు, విరక్తులౌ జనులు సతంబు
చెలువు మీఱఁ బ్రభుని శ్రీరాముఁ గొల్తురు
సర్వతర్కములను సంత్యజించి

ఆ. ఇట్లు మదిఁ దలంచి యెల్లశంకలఁ గుత
ర్కముల వీడి సంతతమును ధీర!
సుందరాంగు వరదు సుఖదుని సదయు సం
గ్రామధీరుఁ గొల్వఁగదవె! రాము

"బాహుళ్యావకాశాదనియతత్వాచ్చ." (75)

ఏలయన్న (వాదవివాదములలో) బాహుళ్యమునకు అవకాశముండును. అది అనిశ్చితమైనది.

ఇక్కడ సూత్రకారుని యభిప్రాయ మిది. - వాదవివాదములందు ఉత్తర ప్రత్యుత్తరము లుండుటయు, అది పెరిగిపోవు చుండుటయు సంభవమగును. ఇరుపక్షముల నుండియు తమ తమ వాదములను బలపరచికొనుటకు మాటలను వర్షముగా కురిపించవలసిన పరిస్థితి సంభవించును. కేవలము భగవత్కృప వలన మాత్రమే తెలియనగు

విషయమేదియో యది తర్కము వలన ఎన్నడును తెలియనేరదు. కావున ఈ విషయమున తర్కవితర్కములు సత్ఫలితము నీయజాలవు. వివాదమందు మాటలాడి మాటలాడి యలసిపోవుటయు, సమయమునకు ఆవశ్యకమైన విషయము జ్ఞప్తికి రాకపోవుటయు సంభవమైనవేళ ఎదుటి పక్షము గెలువవచ్చును. కాని యా గెలుపునకు మూలమైన భావన సిద్ధాంతము గాజాలదు. కాబట్టి వాదవివాదములలో కాలమును వ్యర్థము చేయక భక్తుడగువాడు సర్వవిధముల తన యిష్టదైవతము మీద నాధారపడి యుండుచు నిరంతరము నిష్కామ భావము, నిష్కపటబుద్ధిని వహించి యత్యంత శ్రద్ధాపూర్వకముగా అతనినే భజించుకొనుచుండవలెను. భగవత్ప్రేమ యన్నది తర్కము వలన లభించునది కాదు. అది భక్తివలన మాత్రమే లభించును.



# భక్తికి ప్రధాన సహాయకములు

''భక్తిశాస్త్రాణి మననీయాని తదుద్బోధక కర్మాణ్యపి కరణీయాని.'' (76)

(ఆ ప్రేమభక్తిని పడయుటకు) భక్తిశాస్త్రములను మననము చేయుచుండవలెను. భక్తిని ఉద్బుద్ధము గావించునట్టి కర్మలను కూడ నాచరింపవలెను.

భక్తిని అపేక్షించువారు ఏ గ్రంథమును చూడ నక్కరలేదు. ఏ కర్మయు చేయనక్కరలేదు అనుటకు వీలులేదు. వారు తర్కవితర్కములను మాని పర్యాయముగా భక్తి నిరూపణము గలవి, భక్తి మహత్త్వ వివరణము గలవి, భక్తిసాధన విధములను ఎరిగించునవి, భగవద్భక్తుల పుణ్య చరిత్రములు గలవి, భక్తికి వశీభూతుడగు భగవానుని ప్రభావ-రహస్య-గుణ-తత్త్వముల వివరణము గలవియు నగు గ్రంథముల పఠనము, పరిశీలనము చేయుచుండవలెను. ఇట్టి భక్తిశాస్త్రముల యధ్యయనము వలన, మహాత్ములు, భక్తులు నగు సాధుజనుల పలుకులను వినుచుండుట వలన, పఠించుచుండుట వలన భగవానుని యెడల ప్రేమభక్తి యుదయించును. భక్తి నపేక్షించు పురుషులు భక్తిని ఖండించునవి, నిందించునవి, భక్తిమహత్త్వమును తక్కువగా ప్రతిపాదించునవి, లౌకిక విషయముల మహత్త్వమును పెంచి పెంచి వివరించునవియునగు పుస్తకముల పఠనశ్రవణములు చేయరాదు. భగవానుడు, భక్తి, భక్తుల మహత్త్వము వంటి విషయముల వివరణము లేని పుస్తకముల పఠనము వలన వారికి ప్రయోజన మేదియు నుండదు. ఇవియును గాక రాగద్వేషములను, కామక్రోధములను, వైరభావములను పోషించు సాహిత్యమును వారు తాకనైనా తాకరాదు. ఈ కారణముననే యిట్లు చెప్పబడినది. -

యస్మిన్ శాస్త్రే పురాణే వా హరిభక్తిర్న దృశ్యతే
శ్రోతవ్యం నైవ తచ్ఛాస్త్రం యది బ్రహ్మా స్వయం వదేత్

భగవద్భక్తిని ప్రదర్శించని శాస్త్రమును కాని, పురాణమును కాని, అది స్వయముగా బ్రహ్మదేవుని చేత చెప్పబడినదైనను ఆలకింపరాదు.

దానితోబాటు భక్తిని పెంపొందించు కర్మలనే యాచరించు చుండవలెను. భక్తిని గోరు పురుషుడు నిషిద్ధకర్మలను ఎన్నడు నాచరింప రాదు. విషయములయందు ఉండు నాసక్తికి లోబడి పాపకర్మలను వీడక భక్తుడుగా మాత్రము ఎన్నికను పొందగోరు మానవుని భ్రాంత చిత్తునిగా దలపవలయును. లేదా బుద్ధిపూర్వకముగా భ్రాంతిని విస్తరింపజేయ నెంచుచున్నాడని భావింపవలయును.

భక్తి ప్రాప్తించుటకు తోడ్పడు కర్మలలో ప్రధానమైనవి కొన్ని యివిగో! ఇవి. -

(1) తన వర్ణాశ్రమ ధర్మములను సాధ్యముగునంత వరకు పూర్తిగా పాటింపవలెను. బ్రహ్మచారికి, వానప్రస్థునకు, సన్న్యాసికి, త్యాగభరితమైన యాచరణ మావశ్యకము. గృహస్థునకు భగవానుని ప్రసన్నతను గోరి మాతాపితరులు, భార్యా, బిడ్డలు, పరివారము ఆదిగా ఆశ్రితజనుల నెల్లరను ప్రేమతో సత్కారపూర్వకముగా పాలించుటయు, న్యాయమును, సత్యమును వీడక జీవికానిర్వహణము సాగించుటయు, శాస్త్రోక్తములైన యజ్ఞదానతపోనుష్ఠానాది విధులను తప్పక పాటించుటయు నావశ్యకము.

(2) సదాచారము పాటించుట.

(3) సత్సంగము, భగవద్గుణానువాదమును ఆలకించుట. చింతించుట. కీర్తించుట.

(4) భగవన్నామ జపము, స్మరణము, కీర్తనము.

(5) భగవానుని పూజనము, స్తుతి, ప్రార్థన, నమస్కారము.

(6) సాధుశీలురైన భక్తులను సేవించుట, శ్రద్ధాభక్తులతో వారి యాజ్ఞలను పాలించుట.

(7) తీర్థములను సేవించుట.

(8) దీనప్రాణులయందు దయ చూపుట. సాధ్యమగునంత వరకు తన తనువు, ధనము, మనము నర్పించి వారికి సేవ చేయుట.

(9) సర్వకర్మలను భగవదర్పణబుద్ధితో నాచరించుట.

(10) సమస్త ప్రాణులయందు భగవానుని దర్శించు నభ్యాసము.

భగవానుడు ఇట్లు చెప్పియున్నాడు -

శ్రద్ధామృతకథాయాం మే శశ్వన్మదనుకీర్తనమ్
పరినిష్ఠా చ పూజాయాం స్తుతిభిః స్తవనం మమ
ఆదరః పరిచర్యాయాం సర్వాంగైరభివందనమ్
మద్భక్తపూజాభ్యధికా సర్వభూతేషు మన్మతిః
మదర్థేష్వంగ చేష్టా చ వచసా మద్గుణేరణమ్
మయ్యర్పణం చ మనసః సర్వకామవివర్జనమ్
మదర్థేఽర్థపరిత్యాగో భోగస్య చ సుఖస్య చ
ఇష్టం దత్తం హుతం జప్తం మదర్థం యద్వ్రతం తపః

ఏవం ధర్మైర్మనుష్యాణాముద్ధవాత్మనివేదినామ్
మయి సంజాయతే భక్తిః కోఽన్యోఽర్థోఽస్యావశిష్యతే
(శ్రీమద్భాగవత. 11/19/20-24)

అమృతతుల్యమైన నా కథయందు శ్రద్ధ, నిరంతరము నా నామగుణముల కీర్తనము, నా పూజయందు పూర్తి నిష్ఠ, స్తోత్రములతో నన్ను స్తుతించుట, నన్ను సేవించుట యందు నిరంతరము ఆదరబుద్ధి కలిగియుండుట, సర్వాంగములతోను నాకు నమస్కరించుట, నా కొరకే లౌకిక కర్మలను అన్నింటిని ఆచరించుట, సంభాషణలో కేవలము నన్ను గూర్చియే చర్చించుట, మనస్సును సర్వదా నాయందే లగ్నము చేయుట, కామనలనెల్ల వర్జించుట, నాకై ధనమును, భోగమును, సుఖములను త్యజించుట, నా కొరకే యజ్ఞ దాన హోమ జప తపోవ్రతాదులైన సమస్త శాస్త్రోక్త కర్మములను ఆచరించుటయును నీ యెల్ల ధర్మములతోను ఆత్మనివేదన పూర్వకముగా నన్ను ఉపాసించుట వలన, ఓ యుద్ధవా! మానవులకు నా ప్రేమరూపమగు భక్తి ప్రాప్తించును. ఇట్లు అయిననాడు ఇక వారు ఏమియు పడయనక్కరలేదు.

ప్రబుద్ధుడు అను యోగీశ్వరుడు ఒక్కడు నిమియను మహారాజునకు ప్రేమరూపమగు భక్తి ప్రాప్తించుటకు సాధనములను ఈ విధముగా నెరుగజెప్పెను -

తస్మాద్గురుం ప్రపద్యేత జిజ్ఞాసుః శ్రేయ ఉత్తమమ్
శాబ్దే పరే చ నిష్ణాతం బ్రహ్మణ్యుపశమాశ్రయమ్.
తత్ర భాగవతాన్ ధర్మాన్ శిక్షేద్గుర్వాత్మదైవతః
అమాయయానువృత్త్యా యైస్తుష్యేదాత్మాఽఽత్మదో హరిః.
సర్వతో మనసోఽసంగ మాదౌ సంగం చ సాధుషు
దయాం మైత్రీం ప్రశ్రయం చ భూతేష్వద్ధా యథోచితమ్.

శౌచం తపస్తితిక్షాం చ మౌనం స్వాధ్యాయ మార్జవమ్
బ్రహ్మచర్య మహింసాం చ సమత్వం ద్వంద్వసంజ్ఞయోః.
సర్వత్రాత్మేశ్వరాన్వీక్షాం కైవల్య మనికేతతామ్
వివిక్త చీరవసనం సంతోషం యేనకేనచిత్.
శ్రద్ధాం భాగవతే శాస్త్రేఽనిందా మన్యత్ర చాపిహి
మనోవాక్కర్మదండం చ సత్యం శమదమావపి.
శ్రవణం కీర్తనం ధ్యానం హరే రద్భుతకర్మణః
జన్మకర్మగుణానాం చ తదర్థేఽఖిల చేష్టితమ్.
ఇష్టం దత్తం తపో జప్తం వృత్తం యచ్చాత్మనః ప్రియమ్
దారాన్ సుతాన్ గృహాన్ ప్రాణాన్ యత్ పరస్మై నివేదనమ్.

ఏవం కృష్ణాత్మనాథేషు మనుష్యేషు చ సౌహృదమ్
పరిచర్యాం చోభయత్ర మహత్సు నృషు సాధుషు.
పరస్పరానుకథనం పావనం భగవద్యశః
మిథో రతిర్మిథస్తుష్టిర్ని వృత్తిర్మిథ ఆత్మనః
స్మరంతః స్మారయంతశ్చ మిథోఽఘౌఘహరం హరిమ్
భక్త్యా సంజాతయా భక్త్యా బిభ్రత్యుత్పులకాం తనుమ్
(శ్రీమద్భాగవత. **11/3/21-31**)

తన పరమక్షేమ మేదియో తెలిసికొనగోరువాడు వేదవేత్తయు బ్రహ్మనిష్ఠుడు, శాంతమూర్తియు నగు గురువును శరణు పొందవలెను. ఆ గురువునే యాత్మగాను, ఇష్టదైవతముగాను భావించుకొని నిష్కపటముగా అతనిని సేవించి యతని వలన భాగవతధర్మశిక్షణము పొందవలెను. అట్లు చేయుట వలన భక్తులకు ఆత్మ సమర్పణము గావించుకొనువాడగు పరమాత్మ శ్రీహరి ప్రసన్నుడగును. మానసికముగా

విషయభోగములందు విరక్తి వహించుట, సాధుపురుషులగు మహాత్ములతోడ సాంగత్యమును సాగించుట, సమస్త ప్రాణులయందు (దీనులయందు) దయను ప్రదర్శించుట, (సమవయస్కులతోడ) మైత్రిని గల్పించుకొనుట, (పెద్దలతోడ) వినయపూర్వకముగా వ్యవహరించుట, తనువునందు, మనమునందు, ధనమునందు పవిత్రతను నిలిపికొనుట, క్లేశమును భరించియైన వర్ణాశ్రమ ధర్మపాలన రూపమైన తపస్సును సాగించుట, శీతోష్ణాదిద్వంద్వములను భరించుట, వ్యర్థభాషణమును మానివేయుట. భగవానుని మననము చేయుట, స్వాధ్యాయము, సారళ్యము, బ్రహ్మచర్యము, అహింస, సుఖదుఃఖాదిద్వంద్వములందు సమబుద్ధి, సర్వత్ర సమస్తజీవులయందు తనను, ఈశ్వరుని దర్శించుట, ఏకాంతవాసము, గృహాదులను భగవానునిగా తలచుట, శుద్ధసాధారణ వస్త్రములను ధరించుట, ప్రాప్తలాభ సంతుష్టి వహించుట, భగవానుని గుణానువాద శాస్త్రమున ఆదరము చూపుట, ఇతర శాస్త్రమును నిందించుట, మనస్సు, వాక్కు, క్రియ - వీనియందు సంయమనమును పాటించుట, సత్యమును మాటలాడుట, మనస్సును, ఇంద్రియములను అదుపులో నుంచుకొనుట, అద్భుతలీలలను సాగించువాడగు శ్రీహరి యొక్క జన్మకర్మగుణముల శ్రవణము, కీర్తనము, ధ్యానము చేయుచుండుట, విహితకర్మలను అన్నిటిని భగవానుని కొరకే యాచరించుట, యజ్ఞదానజపతపోనుష్ఠానాది సదాచారములను, తనకు ప్రియములైన సమస్త పదార్థములను, భార్యను, బిడ్డలను, గృహమును, కడకు ప్రాణములను సైతము పరమాత్మ కర్పించివేయుట, ఈ విధముగా భగవానునే యాత్మగాను, స్వామిగాను భావించుకొను భక్తులతోడ మైత్రీబంధమును గల్పించుకొనుట, జడములకు, చేతనప్రాణులకు, మానవులకు అందును సాధుశీలురైన మహాత్ములకును విశేషముగా సేవలు చేయుట, పరస్పరము భగవానుని యశశ్చరిత్రములను ప్రసంగించుకొనుట,

ఈ భగవద్గుణగానము మూలముననే పరస్పరానురాగమును, తుష్టిని, దుఃఖనివృత్తిని సాధించుకొనుట – ఈ సాధనా విధముల నన్నిటిని గురువు చెంగట నుండి నేర్చుకొనవలెను. ఈ విధుల నాచరించువారు, సమస్తపాపహారి యగు శ్రీహరిని స్వయముగా స్మరించుచు నన్యులచేత స్మరింపజేయువారు నగు భక్తుల హృదయాలలో ఈ సాధనరూపమగు భక్తివలన ప్రేమలక్షణమైన భక్తి యావిర్భవించును. వారి శరీరములు పులకించిపోవును. వారు ప్రేమరసమగ్నులు అగుదురు.

ఈ విధముగా శ్రీమద్భాగవతము, భగవద్గీత, రామాయణము మున్నగు భక్తిప్రధానములైన గ్రంథముల శ్రవణపఠనముల వలన, పైన చెప్పిన విధముగా సత్సంగము, నామజపము, నామసంకీర్తనము మొదలైన భక్తివర్ధకములగు సత్కార్యములను భగవత్ప్రీత్యర్థమే యాచరించుచుండుట వలన భక్తి పెంపొందును. భక్తుడు సర్వదా సాధుస్వభావము, సత్కార్యనిరతుడును గావలయును. అప్పుడే వానిలో భక్తి యభివృద్ధి చెందును.

భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు తన ప్రియతమ భక్తుల లక్షణములను వివరించుచు నిట్లు చెప్పియున్నాడు. –

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ
నిర్మమో నిరహంకారః సమదుఃఖ సుఖః క్షమీ.
సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః.
యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యః స చ మే ప్రియః.
అనపేక్షః శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః

సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తః స మే ప్రియః.
యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యః స మే ప్రియః.
సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానాపమానయోః
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగ వివర్జితః.
తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్మే ప్రియో నరః.
యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః.
(గీత. 12/13-20)

ఏ ప్రాణితోను ద్వేషము వహింపనివాడు, ఎల్లరతోడను మైత్రిని పాటించువాడు, ఎల్లప్రాణుల యందును దయ జూపువాడు, అహంకార మమకారములను విడనాడినవాడు, సుఖదుఃఖముల యందు సమదృష్టి గలవాడు, క్షమాగుణము కలవాడు, నిరంతరము చిత్తమును నాయందే లగ్న మొనర్చినవాడు, సర్వదా సంతుష్టాంతరంగుడై యుండువాడు. మనమును, ఇంద్రియములను నిగ్రహించికొన్నవాడు, దృఢనిశ్చయము గలవాడు, తన మనోబుద్ధులను నాకు అర్పించివైచినవాడు, నా యందు భక్తి గలవాడును ఎవడో వాడు నాకు ప్రీతిపాత్రుడు.

లోకమును ఉద్వేగము నొందించనివాడు, తాను స్వయముగా ఉద్వేగమును పొందకుండువాడు, హర్షము, అమర్షము (కోపము), భయము, ఉద్వేగములకు లోబడకుండువాడు నాకు ప్రీతిపాత్రుడు.

ఎవడు హర్షింపక, ద్వేషింపక, శోకింపక, ఏమియు గాంక్షింపక, ఏ శుభాశుభకర్మలను గూడ ఆసక్తితోను, ఫలాపేక్షతోను చేయకయునుండు భక్తుడు నాకు ప్రీతిపాత్రుడు.

ఎందును అపేక్ష లేనివాడు, శుద్ధచిత్తుడు, దక్షత గలవాడు, అన్నిటియందు ఉదాసీనత వహించువాడు, దుఃఖముల నుండి విముక్తి గన్నవాడు. సర్వారంభములను పరిత్యజించినవాడు (కర్తృత్వాభిమానము లేనివాడు) నగు నా భక్తుడు నాకు ప్రీతిపాత్రుడు.

శత్రుమిత్రులయందు, మానావమానములందు, శీతోష్ణములు, సుఖదుఃఖములు మున్నగువానియందును (ద్వంద్వములందు) సమబుద్ధి గలవాడు, (నాయందు దక్క) మరి దేనియందును ఆసక్తి లేనివాడు, నిందను, స్తుతిని సమముగా భావించువాడు, మనస్సుతో నన్నే మననము చేయువాడు, వాక్కుతో నన్ను గూర్చియే ప్రసంగించువాడు, జీవననిర్వహణము ఏవిధముగా సాగినను సంతుష్టినే పొందువాడు. ఎందు తనకు గృహమన్నది లేనివాడు, అనగా గృహమందు మమకారము లేనివాడు లేక యిల్లు, వాకిలి సర్వము భగవానునివిగా భావించినవాడు, గృహము మొదలైనవి లేకున్నను స్థిరబుద్ధిని వీడనివాడు నగు భక్తుడు నాకు ప్రియుడు.

శ్రద్ధావంతులై నన్నే ఆలంబనగా జేసికొని పైని జెప్పిన ధర్మమయమైన అమృతమును సేవింతురో అట్టి భక్తపురుషులు నాకు అత్యంత ప్రీతిపాత్రులు కాగలరు.

భగవానుడు చెప్పిన యీ లక్షణములు సిద్ధి గన్న భక్తులయందు సహజముగనే యుండును. భక్తి సాధన చేయువారు ఈ లక్షణములను ఆదర్శభూతములుగా గ్రహించి వీనిని అనుసరించి యాచరణము సాగింప ప్రయత్నింపవలెను.

ఈ విధముగా భక్తిశాస్త్రము యొక్క అధ్యయన మననములు చేయుచు భక్తివర్ధకములైన సాధనలలో ప్రవర్తిల్లుచుండుట వలన భక్తునకు యోగిజన దుర్లభమైన ప్రేమభక్తి ప్రాప్తించును.

''సుఖదుఃఖేచ్ఛాలాభాదిత్యక్తే కాలే ప్రతీక్ష్యమాణే క్షణార్ధమపి వ్యర్థం న నేయమ్.'' (77)

సుఖము, దుఃఖము, ఇచ్ఛ, లాభము మున్నగునవి (పూర్తిగా) పరిత్యక్తములు అయిపోవునట్టి తరుణమునకై ప్రతీక్షించుచు అరక్షణము కూడ (భగవద్భజన రహితమయి) వ్యర్థము గాకుండు విధమున సమయము బుచ్చవలయును.

భక్తి సిద్ధించిన మీదట సుఖదుఃఖాలు, లాభనష్టాలు, మున్నగు ద్వంద్వాలు స్వయముగనే తొలగిపోవు ననుటలోను, భక్తునకు ఇక నే పదార్థమందును ఇచ్ఛయుండదు అనుటలోను సందేహము లేదు. కాని యట్టి శుభసమయము ఎప్పుడు వచ్చునా? యని కేవలము ప్రతీక్ష మాత్రమే చేయుచుండి ఒకింతయు సాధన చేయక యూరకున్నచో ఇప్పటి హీనదశ యెట్లు నివృత్తమగును? ఆ శుభస్థితి యెట్లు ప్రాప్తించును? ఈ మానవ జీవితమును నమ్మ వీలు లేదాయె. ఏ క్షణములో ప్రళయము సంభవించునో, ఏ ఘటికలో మృత్యువు వచ్చిపడునో చెప్పజాలము. తెలియనేరము గదా! కాబట్టి 'ఫలాని పరిస్థితి వచ్చినప్పుడు భగవద్భజనము చేసెదను' అను నట్టి భావనను విడనాడి యిప్పుడే యీ క్షణమందే ఏ స్థితియందు ఉన్నవాడు ఆ స్థితియందే మానవుడు భగవత్సాధనను ఆరంభింపవలయును. అరక్షణము కూడ విలంబము కారాదు. ఈ విషయమున కబీరు ఏమనెనో చూడుడు! –

ఆ. పరదినంపు విధిని జరియంపు మీనాఁడె,
చేయు మార్య! నేఁటి చెయిద మిపుడె,
అయ్యోనేని ప్రళయ మయ్యెయో! క్షణమందె
యెపుడు చేయనేర్తు వింకఁ జెపుమ!

రెప్పపాటు కాలములోనే ధూళిలో కలియవచ్చును. ఇక నెప్పుడు చేసెదవు? 'ఇంకను నేను చిన్నవాడను, నాకు ఇది యాటపాటల కాలము. భోగవిలాసాల తరుణము. వార్ధక్యము వచ్చిన తరువాత భగవద్భజనము చేసెదను గాక!' అని తలచుచున్నావేమో! ఆ నీ తలపు యుక్తమైనది కాదు. నీవు పెద్దవాడవు కాక ముందే మరణింపకుందువని ఎవరు చెప్పగలరు? మృత్యుదేవత యొక్క 'తీక్ష్ణ' ఖడ్గము నీ తలమీద తిరుగాడుచున్న దనుటను మరవరాదు. ఇందులకు ఓ దృష్టాంత మున్నది. ఒక తుమ్మెద యుండెను. అది తామరపూవు గర్భమందు జేరి మకరందపానము చేయుచుండెను. పానాతిరేకవశమున అది మత్తగిల్లి యందే పడియుండెను. అంతలో సంధ్యాసమయమై సూర్యుడు అస్తమించెను. తోడనే తామరపూవు ముడుచుకొనిపోయెను. పెద్దపెద్ద మద్దిచెట్లను సైతము భేదించి రంధ్రములు చేయగల యా తుమ్మెద యా పూవులోపల ఉండిపోయెను. అప్పుడు అది యిట్లు తలపోయసాగెను. -

రాత్రిర్గమిష్యతి భవిష్యతి సుప్రభాతం
భాస్వానుదేష్యతి హసిష్యతి పంకజశ్రీః
ఇత్థం విచింతయతి కోశగతే ద్విరేఫే
హా! హంత! హంత! నళినీం గజ ఉజ్జహార

'రాత్రి గడచిపోవును. అంతట తెల్లవారును. సూర్యుడు ఉదయించును. తోడనే తామరలు మరల వికసించును. (అప్పుడు నేను ఎగసి బయటకు పోయెదను.) అని యిట్లు బందీఅయిన తుమ్మెద భావించుకొనుచుండెను. అంతలో ఎటనుండియో వచ్చి ఒక యేనుగు ఆ తామరపూవును సమూలముగా పెకలించి నోట నిడుకొని నమలివైచెను. దాని దంతముల నడుమ అపూవుతోపాటు తుమ్మెద కూడ నలిగి మరణించెను. దాని మనములోని కోరిక మనములోనే నిలిచిపోయెను.' కాబట్టి 'ఫలాని పని పూర్తియైన పిదప భజన మారంభించెదను' అను

యాలోచనలను విడనాడవలెను. నిజమరయుగా మనస్సులో పుట్టుకొనివచ్చు కోరిక లన్నియు సఫలము అగుట సంభవము కానే కాదు. ఏ విధముగనో ఒక కోరిక ఫలించినను అది యనేకములైన యభావములను వెంట నిడుకొని వచ్చును. ఒక మానవుడు పరంపరగా వచ్చునట్టి యా యభావముల పూర్తికై ప్రయత్నము చేయుచునే యుండవలసినవాడగును. అపూర్ణములు, అభావమయములు, క్షణభంగురములునైన యీ సాంసారిక పదార్థముల వలన సమగ్రముగా తృప్తి యెన్నడును కలుగనేరదు. ఎంత లభించినను మిగిలియుండునది అసంతృప్తియే యగుచుండును. అభావసంబంధమైన దుఃఖముతో క్షోభపడుచు మానవుడు మరణింపవలసినవాడగును. కావున పూర్తిగా విషయములు అనుభవించవలెనన్న యాశను, వాని భోగము వలన పరిపూర్ణ తృప్తి కలుగునన్న యాశను వీడి, ముందు నుండియే భగవద్భజనమందు ప్రవర్తిల్లవలెను.

ఇదియే కాక మరియొక విషయము ఆలోచింపవలసియున్నది. ఈనాడు సత్సాంగత్య ప్రభావము వలన మన మనస్సులో భగవద్భక్తిని పడయవలెనన్న తలంపు గలుగవచ్చును. క్షణకాలము భగవత్ప్రాప్తియే మన జీవిత లక్ష్యము అన్న భావన మనలో కలుగవచ్చును. కాని మనము అప్పుడు ఫలాని అనుకూల పరిస్థితి వచ్చినప్పుడు సాధన చేయుదము అని కలిగిన సంకల్పమునకు వాయిదా వేయుదుము. ఏమి? ఈ యాలోచన ఆత్మవంచనము కాదా? ఒకటి - మనము అనుకొన్నట్టి యా యనుకూల పరిస్థితి వచ్చునో రాదో చెప్పజాలము. రెండు - అప్పటికి మన సంకల్పము ననుసరించి యప్పుడే సాధన సాగింప మొదలుపెట్టితిమేని అందు పురోగమించుచున్న కొలదియు మనకు అందు విశేషాభిరుచి కలుగును. లాభము గోచరింపసాగును. అభ్యాసము బలపడును. అట్లు కాక మనము కలిగిన సంకల్పమును ఒక

ధ్యేయమాత్రముగా దలపోసి యూరకుంటిమేని మరుక్షణమందు మనస్సునకు మరియొక సంగము ప్రాప్తించగా ముందటి ధ్యేయము మారిపోవును. కావున అనుకూల సమయమునకై ప్రతీక్షించుట మాని యిప్పటి నుండియే భగవద్భజన సాధనకు ఉపక్రమింపవలెను. సత్సంగము వలన గలిగిన సత్సంకల్పము, సదవకాశమును ఎన్నడును జారవిడువరాదు. ఎల్ల కాలము ఆరోగ్యము అనుకూలముగా ఉండు నన్న నిశ్చయము ఏదియును లేదు. స్వాస్థ్యము అనుకూలముగా నున్నంత వరకే సాధన, భజనము సాగుట సంభవమగును. ఆ స్వాస్థ్యము క్షీణించిన మీదట, ఇంద్రియములు అశక్తములు అయిపోయిన మీదట, ముదిమి బలిసిన మీదట సాధనయందు మన మనస్సు లగ్నము అగుట చాలకష్టము. కాబట్టి శరీరము దృఢముగా నున్నయప్పుడే పూర్తి సాధన చేయవలెను. ఈ విషయమున భర్తృహరి వచనములు ఇవిగో! పరిశీలింపుడు! -

> యావత్ స్వస్థ మిదం కళేబరగృహం యావచ్చ దూరే జరా
> యావచ్చేంద్రియశక్తి రప్రతిహతా యావత్ క్షయో నాయుషః
> ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్
> ప్రోద్దీప్తే భవనే చ కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః?
> (వైరాగ్యశతకమ్)

'శరీరము ఆరోగ్యవంతమై యుండునంత వరకు, వార్ధక్యము వచ్చి మీద పడనంత వరకు, ఇంద్రియముల శక్తి క్షీణించిపోవనంత వరకు, ఆయువు చెల్లిపోవనంత వరకు, బుద్ధిమంతుడైన పురుషుడు ఆత్మశ్రేయస్సు కొరకు చక్కగా ప్రయత్నము చేయుచుండవలెను. కొంపకు నిప్పు అంటుకొన్న మీదట నూయి త్రవ్విన ప్రయోజనమేమి?

ఈ కారణముననే భక్తులు భగవానుని శరణుజొచ్చి యిట్లు ప్రార్థింతురు. -

ఆయుర్నశ్యతి పశ్యతాం ప్రతిదినం యాతి క్షయం యౌవనం
ప్రత్యాయాంతి గతాః పునర్న దివసాః కాలో జగద్భక్షకః
లక్ష్మీస్తోయతరంగభంగ చపలా విద్యుచ్చలం జీవితం
తస్మాన్మాం శరణాగతం శరణద త్వం రక్ష రక్షాధునా.

'చూచుచు చూచుచు నుండగా దినదినము ఆయువు చెల్లిపోవుచున్నది. యౌవనము క్షీణించిపోవుచున్నది. కడచిపోయిన దినములు వెనుకకు ఎట్లును మరలి రావు. కాలుడు (మృత్యువు) లోకమును తినివేయుచున్నాడు. లక్ష్మి (సిరి) నీటి కెరటము వలె చంచలమైనది. జీవితము విద్యుత్తు యొక్క మెరుపువలె అస్థిరమైనది. ఆ కారణమున ఓ శరణదాతా! నేను నిన్ను శరణు పొందినవాడను. నన్ను రక్షింపుము! ఇప్పుడే రక్షింపుము!

కృష్ణ! త్వదీయపదపంకజ పంజరాంత
మద్యైవ మే విశతు మానసరాజహంసః
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే? (ముకుందమాలా-7)

'ఓ కృష్ణా! నీ చరణకమలములనెడు పంజరమునందు నా మనస్సనెడు రాజహంస యిప్పుడే ప్రవేశించుగాక! ప్రాణములు పోవు వేళ శ్లేష్మము, వాతము, పిత్తము పెరిగిపోయి కంఠమునకు అవరోధము గలిగించినప్పుడు (నాకు) నీ స్మరణము ఎట్లు సాధ్యమగును?

కాబట్టి ఏ సమయమును కూడ భగవద్భజన విరహితముగా గడపరాదు. భగవద్భజనమందు గడచిన సమయమేదో అదియే సార్థకమైనది. తక్కిన సమయమంతయు వ్యర్థమే యగును. కాలము యొక్క విలువను గుర్తించి ఒక్కొక్క శ్వాసను కడు జాగరూకతతోడ

పిసినిగొట్టువాని చెంత నున్న పరిమితవములైన ధనవము వలె కేవలవము భగవచ్చింతనమునందే వెచ్చింపవలెను. భజనరహితముగా గడచిన కాలమే మనకు భయంకరమైనది. అదియే మన పాలిటికి మహావిపత్కాలము.

భగవానుని స్మరణము సాగని కాలమేదో అదియే విపత్కాలము రామా! అని హనుమ కూడ శ్రీరామునితో చెప్పియున్నాడు. (తులసీరామాయణము)

సా హానిస్తన్మహచ్ఛిద్రం స మోహః స చ విభ్రమః
యన్ముహూర్తం క్షణం వాపి వాసుదేవం న కీర్తయేత్.

'ఏ యొక్క క్షణము, ఏ యొక్క ఘటిక వాసుదేవ కీర్తన రహితముగా గడచిపోవునో అదియే మహానష్టము. అదియే అజ్ఞానము. అదియే మోహము అని యెరుగదగును.'

భగవద్భజనమును మాని అందులకై యేదియో యనుకూల సమయము వచ్చునని యెదురు చూడరాదు. అట్లు కాని నాడు అమూల్యమైన మన మానవజీవిత మంతయు నిరర్థకమైపోవును. భగవద్భజనమే మానవజీవితమందు ఆచరింపదగిన సర్వోత్తమము, ఆదరణీయము నగు ప్రముఖ కృత్యము. అవిరామముగా భజనము సాగించుచున్ననాడు ఒక నాటికి మన సుఖదుఃఖాది ద్వంద్వముల పీడలు అన్నియు సమసిపోగలవు. భగవత్ప్రేమ సంబంధమగు నిర్మలజ్యోతిస్సుతో మన హృదయము ప్రకాశించును. ఎల్ల దిక్కులు, సమస్త బ్రహ్మాండమును శీతలము, నిర్మలమునైన స్నిగ్ధజ్యోతిస్సు చేత పరివ్యాప్తమైపోవును. అప్పుడు మన యానందమునకు అవధులు ఉండవు.

వాస్తవమునకు భగవద్భజనము యొక్క పరిమాణము ఎంత యుండును? అన్న యాలోచనము కూడ భక్తుడు చేయనక్కరలేదు.

కేవలము ప్రేమపూర్వకముగా భగవద్భజనము సాగించుకొనుచు పోవుటయే అతని కర్తవ్యము. ప్రేమకొరకే ప్రేమసాధన, భజనము కొరకే భజనసాధన చేయవలయును. అట్లయిన భజనమే అతని స్వభావము అయిపోవును. అది చేయక యుండలేని పరిస్థితి యతనికి ప్రాప్తించును. అతడు ఏమైనను సహించును. కాని భజన వియోగమును సహించలేని వాడగును. శ్రీమద్భాగవతములో ఇట్లు చెప్పబడియున్నది. -

> త్రిభువనవిభవహేతవేఽప్యకుంఠ
> స్మృతిరజితాత్మసురాదిభిర్విమృగ్యాత్
> న చలతి భగవత్పదారవిందా
> ల్లవనిమిషార్థ మపి యస్స వైష్ణవాగ్ర్యః **(11/2/53)**

'ఓయీ! ఒక్క యర్ధనిమేషకాలము భగవచ్చరణారవింద చింతనమును మానివేయుము! దీనికి బదులుగా నీకు త్రిలోక సామ్రాజ్యవైభవమును సమగ్రముగా సమర్పించెదము అని ప్రలోభపెట్టినను భక్తులు అందులకియ్యకొనరు. నిరంతరము ధ్యానపూర్వకముగా అన్వేషించినను ఏ చరణకమలములను దేవతలు కూడ పడయజాలరో అట్టి యీ భగవచ్చరణకమలములందు అతని చిత్తభ్రమరము సంలగ్నమయిపోవును. అట్టి భక్తుడు తదన్యమేదియు నపేక్షింపడు.'

అతడు కాతర కంఠముతో భగవాను నిదియే వేడుకొనును. - 'దేవా! నాకు మోక్ష మక్కరలేదు. జ్ఞానమక్కరలేదు. వైభవ మక్కరలేదు. బుద్ధిసిద్ధు లక్కరలేదు. పెద్ద పేరు ప్రఖ్యాతు లక్కరలేదు. నేను ఇటుపైనే యోనిలోనికి పోవవలసివచ్చినను, ఏమయిపోయినను నాకు చింతలేదు. ఓ నా ప్రియతమ దైవతవరేణ్యా! నీ చరణారవిందయుగళిపై నాలో నిర్హేతుకమైన ప్రేమ, పిచ్చిప్రేమ, గ్రుడ్డి ప్రేమ, అనన్యభక్తిమయమైన ప్రేమ, ప్రియతమమయమైన ప్రేమ దినదినము, క్షణక్షణ ప్రవర్ధమానము కావలె ననియే నేను నిన్ను ప్రార్థింతును.'

'జన్మజన్మల శ్రీరామచంద్ర చరణారవిందయుగళిపై ప్రీతి నిలిచియుండునట్టి వరదానమే యభిలషింతును. తదన్య మేదియు నాకు వలదు.' (తులసీదాసు)

ఆదిశంకరాచార్యులవారు జగజ్జననీ స్వరూపుడైన భగవానుని ఇట్లు ప్రార్థించిరి. -

న మోక్షస్యాకాంక్షా వరవిభవవాంఛాపి చ న మే
న విజ్ఞానాపేక్షా శశిముఖి సుఖేచ్ఛాపి న పునః
అతస్త్వాం సంయాచే జనని! జననం యాతు మమ వై
మృడానీ రుద్రాణీ శివ శివ భవానీతి జపతః. -8

''అహింసాసత్యశౌచదయాస్తిక్యాది చారిత్ర్యాణి పరిపాలనీయాని.'' (78)

(భక్తుడైనవాడు) అహింస, సత్యము, శౌచము, దయ, ఆస్తిక్యము మొదలైన యాచరణీయములైన సదాచారములను చక్కగా పాటింపవలెను.

76వ సూత్రములో భక్తివర్ధకములైన కర్మలను ఆచరింపవలెనని చెప్పుటయైనది. ఈ సూత్రములో ఆ క్రియల నుండియు, సద్గుణముల నుండియు 5 ఆచారములను పృథక్కరించి వాని నామములను నిర్దేశించివాని నాచరించుట అత్యంతావశ్యకమని సూత్రకారుడు నిర్దేశించుచున్నాడు.

దైవీ సంపదకు సంబంధించిన గుణములు భక్తుని లక్షణములు. భక్తియున్న చోట దైవీసంపద యుండుట అనివార్యము. భక్తునియందు సద్గుణము లున్నను, లేకున్నను అతడు భక్తిసాధన చేయవచ్చునని కొందరు చెప్పుదురు. మానవుడు ఎన్ని పాపములు చేయుచున్నను భక్తుడైయున్న

చాలునని, ఇక భయమేదియు నుండదని వారందురు. సూర్యుడు ఉదయించిన చాలును. అంధకారమున్నను చింతింప నక్కరలేదు అనుట ఎంత యుక్తివిరుద్ధమైనదో పైవారి మాట కూడ అంతియే విరుద్ధమైనది. సూర్యుడు ఉదయించిన చోట అంధకారము ఉండనే యుండదు. ఎల్లయెడల తత్ప్రకాశమే యావరించును. అట్లే భక్తియను సూర్యుడు ఉదయించిన చోట తత్ప్రకాశరూపమైన దైవీసంపద యవశ్యము విస్తరించును. భగవత్ప్రాప్తిని గన్న మహాత్ములగు భక్తులను వారి బాహిరములైన యాచరణములను బట్టి పరీక్షింపజాల మనుట కొంతమేరకు సత్యమేయగును. కాని వారియందు కూడ కొన్ని గుణములు అవశ్యము ప్రకటముగా నుండవలసిన యావశ్యకత యున్నది. ఆవశ్యకమే కాదు. అనివార్యమని కూడ చెప్పవచ్చును. వానిలోనే యీ యైదు గుణములున్నవి. ఏ పురుషునియందు ఈ గుణములు లేని మానవులు సాధుజనులు, భక్తులును కానే కారు. ఈ గుణములను బట్టియే తనను సాధకుడు పరీక్షించుకొనవలసి యుండును. మనలో భగవచ్చింతనము, దైవీసంపద పెరుగుచున్నచో మనము భక్తిమార్గములో పురోగమించుచున్నామని భావించుకొనవచ్చును. లోకచింతనయును, విషయచింతనము, ఆసురీసంపత్తి పెరుగుచున్నచో నిశ్చయముగా మనము అవనతి దిక్కుగా పయనించుచున్నామని తలపవలయును. ప్రేమపూర్వకముగా భగవచ్చింతనము చేయుట భక్తుని ధర్మము. దైవీసంపత్తికి సంబంధించిన గుణములు భక్తుని జీవనపద్ధతిని నిర్దేశించును. భక్తుడు ఏమైన విడనాడును కాని ఈ రెండింటిని వీడడు. అవశ్యము లీలామయభగవానుని యాజ్ఞను, అభిరుచిని అనుసరించి సిద్ధిని పొందిన భక్తుడు అందందు తన జీవనపద్ధతిని మార్చుకొనవలసినవాడగును. కాని యట్లు చేయుట నియమము మాత్రము కాదు. అతడు ఏ విధమైన యాసక్తికి, మమకారమునకు, కామమునకు, వాసనకు, అహంకారమునకు, మోహమునకును లోబడి మాత్రము తన జీవనవిధానమును

మార్చుకొనడు. ఏ కారణము చేతనైన, ఎప్పుడైన తన జీవన పద్ధతిలోను, తన సహజధర్మమైన భగవత్ప్రేమమందు వైరుధ్యము వచ్చినట్లు గుర్తించినచో అప్పుడే అట్టి సందర్భమందే భగవదాజ్ఞను గ్రహించి యతడు నీతిని సైతము వీడుట సంభవమగును. ఇట్టి స్థలములందే, ఇట్టి సందర్భములందే భరతుడు, ప్రహ్లాదుడు, విభీషణుడు, గోపికలు మున్నగువారు ఉదాహరణలగుచున్నారు. తల్లి యానతిని మీరరాదన్న నీతిని భరతుడు విడనాడెను. తండ్రి మాటను ధిక్కరింపరాదన్న నీతిని ప్రహ్లాదుడు తిరస్కరించెను. అన్న యాజ్ఞను తిరస్కరింపరాదన్న నీతిని విభీషణుడు ఉల్లంఘించెను. భర్త్రాజ్ఞను పరిహరింపరాదన్న నీతిని వ్రజగోపికలు విడనాడిరి. కాని యక్కడ కూడ సదాచార సంబంధమగు నీతి పరిత్యక్తము కాలేదు. ప్రేమధర్మపాలనమునకై భక్తులు స్వయముగనే క్లేశమును భరించిరి. విధి నిషేధము లన్నియు భగవచ్చరణారవిందములపై సమర్పించివేయబడునట్టి స్థితి యొకటియున్నది. అది వేరు. ఈ సమర్పణము అగునట్టిది. కాని చేయబడునట్టిది కాదు అన్న విషయమును మనము విస్మరింపరాదు. విధి నిషేధముల బరువు ఆ పిచ్చిభక్తుని నెత్తిమీద నుండి దింపివేయబడును. కాని బుద్ధిపూర్వకముగా అతడు దించుకొనడు. ఆ పిచ్చియందు, ఆ యున్మత్తదశయందు వానియందు దుర్గుణము ఏదైన ఉండు ననుటకును వీలులేదు. కాని యక్కడ సాగుచున్నది సాధకునకు సంబంధించిన చర్చ. అతడు కడుజాగరూకతతోడ శాస్త్రవిహితములైన సద్గుణములను సదాచారములను రక్షించుకొనవలసినదే. పాటింపవలసినదే. సూత్రకారుడు ఇక్కడ నిర్దేశించిన అయిదు గుణముల స్వరూపమెట్టిదో విచారింతము.

అహింస – శారీరకముగాను, మానసికముగాను, వాచికముగాను కూడ ఏ ప్రాణికిని కూడ ఏ విధముగను వర్తమాన సమయమందు గాని భవిష్యత్తునందు కాని ఎట్టి దుఃఖమును గలిగింపకుండుటయు, సర్వదా సమస్త ప్రాణులకు సుఖము గలిగింప బూనుటయు అహింస యనబడును.

సత్యము – విన్నది విన్నయట్లు, చూచినది చూచినట్లు, ఎరిగినది ఎరిగినట్లు మాటలతో కాని, లేఖనపూర్వకముగా కాని, సంకేతములతో గాని యితరులకు తెలియజేయునట్టి నీతిని పాటించుట సత్యమగును. సత్యములు, మధురములు, హితకరములునైన మాటలనే వాచికముగా పలుకవలెను. కొందరు సత్యభాషణమందు కఠినమైన మాటలను ప్రయోగించుట యావశ్యకమని భావింతురు. ఒకరి మనస్సునకు కష్టము కలుగుగాక! సుఖము కలుగుగాక! కుండ బ్రద్దలు కొట్టినట్లు ఉన్న మాటను (సత్యము) మేము ముఖము ముందే పలికెదము, అని కొందరు సాభిమానముగా పలుకుచుందురు. కాని అది యుక్తము కాదు. మనము వాకొనునట్టి మాట ద్వేషము, వైరము, నింద, చాడీలు చెప్పుటవంటి లక్షణములు లేనిదై పరులకు హితకరమై సత్యమై మధురమై యుండవలయును. చంద్రజ్యోత్స్న ప్రకాశమునే కాక చలువలను కూడ వెడలించు విధమున భక్తుడాడు మాట కూడ సత్యము, మధురము, ప్రకాశకము, శాంతిదాయకమును గావలయును. పరులకు అహితము నొదవించు సత్యమును కూడ పలుకుట వాంఛనీయము కాదు.

> సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్య మప్రియమ్
> ప్రియం చ నానృతం బ్రూయా దేష ధర్మస్సనాతనః

'సత్యము పలుకవలెను. ప్రియవచనము పలుకవలెను. అప్రియమైన మాట సత్యమైనను పలుకరాదు. ప్రియమైనను అసత్యమాడరాదు. ఇవి వాఙ్నియమములు. ఇది సనాతన ధర్మము.'

శౌచము – ఇది బాహ్యశౌచము, అంతరశౌచము నని రెండు విధములు. ఈ రెండును ఆవశ్యకములే.

బాహ్యశౌచము -

(క) మృత్తిక, జలము మున్నగువానితో శరీరమును శుభ్రపరచికొనుట.

(ఖ) ఇతరుల స్వత్వమును హరింపక సత్యపూర్వకముగా, దోషరహితముగా సంపాదించు ప్రయత్నముతో ధనమును పవిత్రముగా నుంచుకొనుట.

(గ) పరిశుద్ధమైన ప్రదేశమందు, పరిశుద్ధుడు, స్నానము చేసినవాడు నగు మనుజుని చేత పరిశుద్ధముగాను, మాంసరహితముగాను సిద్ధము చేయబడిన యన్నమును, పదార్థములను భగవదర్పణము గావించి భోజనమును పవిత్ర మొనర్చికొనుట.

(ఘ) శుద్ధము, కపటరహితము, ప్రేమపూర్వకము నగు ప్రవర్తనముతో వ్యవహారమును పవిత్రము గావించుకొనుట.

(ఙ) అతిథి సత్కార విధులతో, భగవన్నామ స్మరణ ధ్వనితో గృహమును పవిత్రమొనర్చుకొనుట.

(చ) శాస్త్రవిహితములైన యాచరణములతో ఇతరములగు బాహ్యకర్మల నెల్ల పవిత్రములను జేసికొనుట.

ఆంతరశుద్ధి - దంభము, వైరము, అభిమానము, ఆసక్తి, ఈర్ష్య, ద్వేషము, శోకము, పాప చింతనము, నిరర్థక విషయచింతనము మున్నగు దోషములకు సాధ్యమగునంత వరకు మనస్సులో తావీయక సారళ్యము ప్రేమ, వినయము, వైరాగ్యము, ద్వేషరాహిత్యము, ప్రసన్నత, సచ్చింతనము, భగవచ్చింతనము మున్నగు సద్గుణములతో

అంతరంగమునకు పవిత్రతను గల్పించుట - ఇది యాంతరశుద్ధి స్వరూపము.

దయ - ఇంటిలోని వాడు కాని, వీథిలోనివాడు కాని, శత్రువు కాని, మిత్రుడు కాని యే మానవుడైనను కష్టదశలో నున్నప్పుడు వానిని గాంచి యే విధమైన భేదమును ఎంచక మానసికముగా వ్యాకులత చెందుట. సాధ్యమగునంత వరకు కష్టమును భరించియైన, త్యాగము చేసియైన వాని దుఃఖమును దూరమొనర్చుటకు ప్రయత్నించుట దయాలక్షణము. ఈ భావము సర్వకాలములందు సమస్త జీవుల యెడలను ఉండవలెను. జీవులకు అహితమును కాని, దుఃఖమును కాని కలుగజేయు క్రియలను విసర్జింపవలెను. ఇట్లే దేశీయముగా కాని, సామాజికముగా కాని యే పరిపాటుల వలన, ఏ కృత్యముల వలన ప్రాణులకు అహిత మొదవుచుండునో వానిని తొలగించుటకు, పరిత్యజించుటకును ప్రయత్నింపవలెను.

ఆస్తిక్యము - ఈశ్వరునియందు, శాస్త్రములయందు ప్రత్యక్షముగా నున్నదానియందువలె పరిపూర్ణ విశ్వాసము ఉండవలెను. భగవానుడు సర్వవ్యాపకుడు. సర్వప్రభుడు, సర్వశక్తిసమేతుడు, సర్వజ్ఞుడు, పరమదయాపరుడు, పరమసుహృదుడు, భక్తవత్సలుడు, దీనజనబాంధవుడు. సర్వదా సర్వత్ర విరాజమానుడై అన్నిటికంటె ముందు భగవంతునియందు విశ్వాసము జూపవలసిన యావశ్యకత మానవునిపై అత్యధికముగా నున్నది. భగవానుని అస్తిత్వమందు, ప్రభావమందు, గుణములయందు విశ్వాసము గలిగననాడు మనస్సు సహజముగనే ఆ స్వామిపై లగ్నమగును. మానవునకు ఏవి కావలయునో వాని యన్నిటియొక్కయు మహానిధి భగవానుడు. మనకు జ్ఞానము కావలెనన్న అతడు జ్ఞానమయుడు, ప్రేమ కావలయునన్న ప్రేమమయుడు, ఆనందము కావలయునన్న అతను ఆనందమయుడు. వైరాగ్యము కావలెనన్న అతడు

వైరాగ్యమయుడు. ధనము కావలెనన్న ధనాధిష్ఠాత్రి లక్ష్మీదేవి తన చాంచల్యమును వీడి నిరంతరము ఆ స్వామియొక్క చరణకమలసేవ చేయుచుండును. ఐశ్వర్యము కావలెనన్న జగత్తు అంతయు ఆ భగవానుని యైశ్వర్యమునకు సంబంధించిన ఒక్క కణము యొక్క ప్రకాశమైయున్నది. యశస్సు కావలెనన్న యాతనినుండియే వెలువడుచుండును. సారాంశమేమన్న లోకములో మనము సౌందర్యము, మాధుర్యము, ప్రేమ, స్నేహము, జ్ఞానము, వైరాగ్యము, ఐశ్వర్యము, ధనము, భోగము, సుఖము మున్నగువానిని ఏ కొంచెము చూచుచున్నామో, ఈ యెల్ల వస్తువుల విషయమందు ఎంతవరకు మనము ఉన్నతోన్నతముగా కల్పన చేయగలమో అంతవరకు ఆ సర్వమును భగవానుని ఒక అత్యల్పమైన యంశమునకు చెందినది మాత్రమే యగును. జగత్సంబంధమైన యీ సమస్త పదార్థములు, వానిని గూర్చి మనము చేయు కల్పన - ఇవి యన్నియు ఆ యఖిల సౌందర్య-మాధుర్య-పరమైశ్వర్యాది సమస్త సద్గుణ సముద్రములోని ఒక బిందుమాత్రముతో గూడ సరిగావు. ఈ విధముగా భగవానునర్థము చేసికొన్నవాడు, విశ్వసించినవాడు ఆ స్వామిని కాదని యరక్షణమైన తన దృష్టిని, మనస్సును అన్యత్ర లగ్నము చేయజాలడు. ప్రాపంచిక క్షణభంగురములైన భోగముల ప్రాప్తి చేత అతడు హర్షమును పొందడు. వాని నాశము చేత దుఃఖమును పొందడు. ఆస్తిక్యమందు మాత్రము అవశ్యము అచ్చమైన విశ్వాసముండవలెను. భగవానుని అస్తిత్వమును విశ్వసించు విషయమున మనము ప్రహ్లాదుని చరిత్రమును సర్వదా తలపులో నుంచుకొనవలెను. హిరణ్యకశిపుని యాజ్ఞచేత వేనవేలు దుర్దాంతులైన దానవులు పలు భయంకరాస్త్ర శస్త్రములను కేల ధరించి ప్రహ్లాదుని వధింపబోవుదురు. అప్పుడు ప్రహ్లాదుడిట్లు చెప్పెను. -

విష్ణుశ్శస్త్రేషు యుష్మాసు మయి చాసౌ వ్యవస్థితః
దైతేయాస్తేన సత్యేన మాక్రమంత్వాయుధాని చ.

(విష్ణుపురా. 1/17/33)

'ఓ దైత్యులారా! నా భగవానుడైన మహావిష్ణువు ఈ శస్త్రములయందు, మీయందు నాయందును ఉన్న సత్యము కారణముగా ఈ శస్త్రాస్త్రములు నా యెడల ప్రభావరహితము లగునుగాక!'

ఇట్లన్నంతనే దైత్యుల శస్త్రములు నిరర్థకములు అయిపోయెను. వాని ప్రహారము చేత ప్రహ్లాదునకు ఆవంతయు వేదన గలుగలేదు.

విషధరవములైన సర్పవములందు, విశాలకాయంవములైన యేనుగులయందు, వాని వజ్రతుల్యములైన దంతములందును కూడ ప్రహ్లాదుడు తన యిష్టదైవతమును దర్శించెను. అవి ప్రహ్లాదునకు ఎట్టి హానిని గలిగింపలేకపోయెను. రాక్షసులు ప్రహ్లాదుని అగ్నిలో పడవైచిరి. ఆ యగ్నియందు కూడ భగవానుని నవనీలనీరదమూర్తి గోచరించెను. అప్పుడు అతడిట్లు పలికెను. -

తాతైష వహ్నిః పవనేరితోఽపి
న మాం దహత్యత్ర సమంతతోఽహమ్
పశ్యామి పద్మాస్తరణాస్తృతాని
శీతాని సర్వాణి దిశాం ముఖాని. (విష్ణుపురాణ. 1/17/47)

'ఓ తండ్రీ! వాయువు చేత ప్రేరితమైనను ఈ యగ్ని నన్ను కాల్చుటలేదు. ఎల్లయెడల తామరపూవులు పరచబడినవా! యనునట్లు అంతటా చల్లదనము నిండియున్నది.'

ప్రహ్లాదుని సంహరించుటకు అప్పుడు 'కృత్య' క్షుద్రశక్తి యావిర్భవింపజేయబడెను. అది కూడ ప్రహ్లాదుని సంహరింపలేక కడకు పురోహితులనే చంపివైచెను. అప్పుడు ప్రహ్లాదుడు మరల నిట్లనెను. -

యథా సర్వేషు భూతేషు సర్వవ్యాపీ జగద్గురుః
విష్ణురేవ తథా సర్వే జీవంత్వేతే పురోహితాః.
యథా సర్వగతం విష్ణుం మన్యమానోఽనపాయినమ్
చింతయామ్యరిపక్షేఽపి జీవంత్వేతే పురోహితాః.
(వి. పు. 1/18/40-41)

సర్వవ్యాపకుడు, జగద్గురువు, భగవానుడు నగు విష్ణువు సమస్త ప్రాణులయందును పరివ్యాప్తుడై యున్నవాడు అన్న సత్యముయొక్క ప్రభావము చేత ఈ పురోహితులు పునరుజ్జీవితులయ్యెదరు గాక! సర్వగతుడు, క్షయవిరహితుడు నగు విష్ణుదేవుని నేను నన్ను సంహరింపబూనిన యీ శత్రువర్గమునందు కూడ దర్శించుచుంటినేని ఈ పురోహితులు జీవింతురు గాక!

ప్రహ్లాదుని దృఢమైన ఆస్తిక్యము కారణముగా పురోహితులు పునరుజ్జీవితులైరి.

కడపట హిరణ్యకశిపుడు ప్రశ్నింపగా ప్రహ్లాదుడు అత్యంత దృఢత్వముతో స్థిరమైన నిశ్చయముతో, 'అవును! నా ప్రభువు లేని తావులేదు. ఈ స్తంభమునందును గలడు.' అని యతనికి బదులు చెప్పెను. తన భక్తుడాడిన యీ మాటను సత్యము గావించుటకై భగవానుడు ఆ స్తంభమునే భేదించుకొని వెలికివచ్చెను. ఏమి దృఢనిశ్చయము? ఎంతటి యద్భుత పరిణామము? ఆస్తిక్యబుద్ధియన్న నిది!

కాబట్టి భక్తులు సాధ్యమగునంత వరకు ఆస్తికులు అగుటకును, ఆస్తిక్యమందు ముందడుగు వేయుటకును, నిరంతర ప్రయత్నము చేయవలెను.

సూత్రకారుడు ఈ సూత్రములో 'ఆస్తిక్యము' అను శబ్దముతోడ 'ఆది' శబ్దమును జోడించి దైవీ సంపదకు సంబంధించిన యితరదైవీ

సంపదల వంకకు సంకేతము చేసెను. భగవద్గీతలో ఈ సంపదలను ఇరువదియారింటిని పేర్కొనుట జరిగెను. అవి యివిగో। ఇవి. -

అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్.
అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాంతిరపైశునమ్
దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీర చాపలమ్.
తేజః క్షమాధృతిశ్శౌచమద్రోహో నాతిమానితా
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత। (16/1-3)

ఓయి అర్జునా! నిర్భయత్వము, అంతఃకరణ సంశుద్ధి, భగవత్స్వరూపమందు నిరంతరము దృఢమైన నిలుకడ (ఆస్తిక్యము), దానము, ఇంద్రియనిగ్రహము, యజ్ఞము, స్వాధ్యాయము, తపస్సు, సారళ్యము, అహింస, సత్యము, క్రోధరాహిత్యము, త్యాగము, శాంతి, ఎవనిని నిందింపకుండుట లేక ఎవనిని గూర్చియు చాడీలు చెప్పకుండుట, ప్రాణికోటియందు దయ, లోభరాహిత్యము, కోమలత్వము, ఈశ్వరుని విషయమున శాస్త్రవిరుద్ధకర్మల విషయమున లజ్జాసంకోచస్థితి, చాంచల్యము లేమి, తేజము, క్షమ, ధైర్యము, శౌచము, ద్రోహబుద్ధి లేమి, అభిమానరాహిత్యము అను నీ యిరువదియారు దైవగుణముల సంపదయు భక్తుని యందే యుండును. కావుననే భక్తులను దేవునివంటివారు అనుట సంభవమైనది.

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ
విష్ణుభక్తః స్మృతోదైవ ఆసురస్తద్విపర్యయః. (పద్మపురాణ)

'ఈ జగత్తులో జీవకోటులు రెండు విధములు. 1. దైవములు. 2. ఆసురములు. విష్ణువునందు (భగవానుని యే రూపమందైనను) సాత్త్విక

భక్తి గలవారు దైవశ్రేణికి చెందినవారు. అట్లు భక్తి లేనివారు అసురశ్రేణికి చెందినవారు.'

''సర్వదా సర్వభావేన నిశ్చింతితైర్భగవానేవ భజనీయః.'' **(79)**

సర్వకాలములందును, సర్వభావములతో, ఎట్టి చింతలును లేక భగవద్భజనము చేయుచుండవలెను.

ఈ సూత్రము బహుమహత్త్వపూరితమైనది. ఇందు దేవర్షి నారదుడు ప్రేమమార్గమునకు చెందిన భక్తులు అనుసరించునట్టి మిక్కిలి చక్కని భగవద్భజన ప్రకారమును ప్రతిపాదించెను. భగవానుని దివ్యగుణములు, రహస్యము, తత్త్వము, ప్రభావమును వాస్తవరూపములో నెరుగు నాతడు, (ఎరుగుట మాటయటుంచి సాధుపురుషుల వలన నాలకించి అందు విశ్వాసమును గల్పించికొను నాతడు) భగవానుని కాదని యే కాలమందును మానసికముగా, వాచికముగా, కాయికముగా మరియొక పని యేదియు చేయజాలడు. ఈ విషయమున శంకరభగవానుడు పార్వతీదేవితో నిట్లు పలికియున్నాడు. –

ఆ. రామచంద్రవిభుని రమ్యస్వభావమ్ము
నేరెఱుంగువారు, వా రెడంద
నితరభావములకు నీరు గౌరీ! తావు
నతని భజన చింత నవలఁ ద్రోసి (తులసీదాసు)

దరిద్రుడైనవానికి పరుసవేది (స్పర్శమాత్రమున ఇనుమును బంగారమును గావింపగల ఒక మణి విశేషము) లభించినచో అతడు వేరు దెసకు ఏల చూచును? భగవానుడు ఒక్కడే పరమతత్త్వమైనవాడు. అతడే యెల్లరకును గతి. అతడే సర్వాధారుడు. అతడే సర్వశక్తి సమేతుడు.

అతడే సమస్త దివ్యగుణనిధానము. అతడే సౌందర్య మాధుర్యములకు, నైశ్వర్యమునకు నిధి యగువాడు. జ్ఞానవైరాగ్యముల కంటే మూర్తరూపమగువాడు. ఆనందకందవిగ్రహ మనదగువాడతడే. ఈ లక్షణము లన్నియు కలిగియుండియు నతడు మనకు పరమసుహృదుడు. అతడు మనలను అక్కున జేర్చికొనుటకై చేతులు సాచి సర్వదా మనకై ప్రతీక్షించుచుండును.- అను నీ విషయములను తెలిసికొన్న మీదట సకాముడు కాని,కామనారహితుడు కాని, విషయలోలుడు కాని, మోక్షాపేక్ష కలవాడు కాని, సాధకుడు కాని, సిద్ధుడు కాని యే పురుషుడు భగవానుని కాదని క్షణార్థమైనను అన్యమును లేక యన్యుని భజించును? మనము భజించుట లేదన్న అందులకు మనమా పరమాత్మ యొక్క ప్రభావము నెరుగకపోవుటయే కారణము. ఆ ప్రభావము నాలకించినను మనము అందు విశ్వాసమును చూపలేదు. 'మానవులారా! భగవానుని విశ్వసింపుడు! కేవలము ఆ పరమ ప్రియతమునే భజింపుడు! మనములోని చింతల నన్నిటిని దూరముగా పారద్రోలుడు!' అని యిచ్చట దేవర్షి నారదుడు మనలను హెచ్చరించుచున్నాడు. ఎల్ల చింతనముల నుండియు చిత్తమును విముక్తము గావింపుడని యుద్బోధించుచున్నాడు. కావున ఓ సాధకశ్రేష్ఠా! చంటిబిడ్డ యెట్లు తల్లి యొడిలో జేరి నిశ్చింతతను పొందునో అట్లే పరమప్రభువగు భగవానుని దాసత్వమును స్వీకరించి చింతావిరహితుడవు గమ్ము! శ్రీరామచంద్రుని రక్షణమందు ఉన్నవానికి ఏ విషయమున చింత కలుగవలయును? కాబట్టి సర్వమును త్యజింపుము! సర్వాశలను విడుము! భగవానుని ముందు అన్యము సర్వము తుచ్ఛమని భావించుము! ఆ దివ్యాతిదివ్య మధుర సుధారసము నెదుట జగత్తులోని సర్వరసములు నిస్సారములని తలపోయుము! ఆ కోటికోటి కందర్పదర్పహరణుడు సౌందర్య సారసర్వస్వభూతుడు నగు శ్యామసుందరుని స్వరూపము ముందు జగతీతలగతమైన సమస్తరూపరాశియు గణనీయము కానిదని యెరిగి యా స్వామినే

భజింపుము! అతనికే చిత్తము నర్పించుము! సర్వవిధముల అతనినే యవలంబముగా గ్రహింపుము! మానసికముగా అతనినే స్మరింపుము! బుద్ధిచేత అతనిని గూర్చియే ధ్యానము చేయుము! నాల్కతో అతని ప్రసాదరసమునే చవిచూడుము! నాసికతో అతని పదపద్మపరాగగంధమునే యాఘ్రాణింపుము! శారీరకముగా సర్వత్ర అతని సంస్పర్శమునే యనుభవింపుము! కన్నులతో సర్వదా సర్వత్ర సమస్త శోభాధామమగు ఆ విభుని శోభనే యవలోకింపుము! చేతులతో అతనినే సేవింపుము! తనువు, మనము, ధనము సర్వము నతనికే యర్పింపుము!

ఇవి నావి, ఇవి నావి యనుచు లౌకిక వస్తుజాతముపై మమకారము కలిగియుండునంత వరకు నెన్నడును నీవు నిశ్చింతతను పొందలేవు. నశ్వరములు, క్షణభంగురములు, క్షణక్షణ పరివర్తన శీలములు నగు నీ పదార్థము లేవియు నిన్ను నిశ్చింతగా నుండనీయవు, దీనిపై నున్న యాసక్తిని, మమకారమును వదులుము! ఈ వస్తువులు ఎవరివో వారికి 'త్వదీయం వస్తు గోవింద! తుభ్యమేవ సమర్పయే' అని యర్పించివేయుము! అంతియే నీవు చేయవలసిన పని. వీనిని అర్పించివేయుటతో నీకు నిశ్చింతతయే నిశ్చింత ప్రాప్తించును. ఇక నీకు నశించుటన్న యుండదు. లేదను చింతయుండదు. కామనాజ్వాల నిన్ను బాధింపదు. నీవు నిశ్చింతుడవై భగవద్భజనమందు ప్రవర్తించిన క్షణము ఆదిగా నీకు ఆ యానంద మాధుర్య సౌందర్య సముద్రభూతుడైన ప్రియతమ భగవానుని దర్శనము తెలిపెడి శకునములు, నడుమ నడుమ గోచరింప నారంభించును. అప్పుడు నీ చిత్తము వేరొక దెసకు పోవుటకు ఇచ్చగింపనే యిచ్చగింపదు. నీ దృష్టి యైశ్వర్యము వంకకు పోవనే పోవదు. ఒకింత యైశ్వర్యవాసన అవశిష్టమై నీలో యున్నను అది నీకు సర్వైశ్వర్య నిధానమైన యా ప్రియతమ ప్రభుని చరణారవిందములందే ప్రాప్తించును. కాబట్టి నీవు విషయాసక్తి రూపమైన వ్యభిచారమును మాని కేవలమును ఆ ప్రాణారామ

ప్రియతమ ప్రభువునకు ప్రియతమురాలవైన, పతివ్రతవైన పత్నిగా పరిణతుడవు గావలయును. కావుననే సుందరదాసు ఇట్లనుట సంభవమైనది. –

సీ. పతివలన నౌఁ బ్రీతి, పతివలన నౌ నీతి,
పతివలన నౌ క్షేమగతియు రతియుఁ,
బతి యజ్ఞయోగాలు, పతి రసభోగాలు,
పతి కతంబునఁ దీరు వెతలు సతము,
జ్ఞానంబునకునైన ధ్యానంబునకు నైనఁ
బరమలక్ష్యం బెన్నఁ బతియె నిజము,
పతియె తీర్థస్నాన, మతఁడె దానము, ధర్మ,
మరయంగ నిజమతం బతని మతమె,

తే. పతి యభావంబునం దొండు గతియె లేదు,
లేదు భద్రంబులకుఁ దెర్వు, లేదు పర్వు,
శస్త్ర మెన్నఁ బాతివ్రత్య సరణి యొండె
యిద్ది 'సుందరదాస' కవీశు వాణి

సీ. జలకామి మీనమా జలము వాయంగఁ జచ్చు,
మణి వాయఁగాఁ జచ్చు ఫణివరంబు,
ఒండు ముత్తెపుఁ జిప్ప రెండు చాతకపక్షి
స్వాతిబిందువులనే సతముఁ గోరుఁ,
కాసారగతమైన కంజాత మనయంబుఁ
గామించు నాకాశగతుని రవిని,
చంద్ర చంద్రికలనే సంతతంబును జకో
రము గోరుఁ దా నబ్బురంబు గాఁగ,

నటులె 'సుందరదాసు' వాక్యంబు నాల
కించి ప్రేమబంధమును సంధించికొనుమ!
సాధకోత్తమ! యొక ప్రియస్వామితోన,
యెందొ ప్రవహించి చనకుమా! యేదొ చూచి

భగవానుడు కూడ స్వయముగా నిట్లు ఆదేశించియున్నాడు -

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే.
సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః.
**(గీత. 18/65-66)**

ఓయి అర్జునా! నీవు నీ మనస్సును నాయందే లగ్నము చేయుము! నాయందే భక్తి గలవాడవు గమ్ము! నన్నే పూజింపుము! నాకే నమస్కరింపుము! అట్లు చేసిన నన్నే పొందగలవు. ఇది నిశ్చయము. ఇది సత్యప్రతిజ్ఞ చేసి నీతో చెప్పుచున్న మాట. ఏలయన్న నీవు నాకు అత్యంత ప్రియుడవు. నీవు ఇతర ధర్మముల నాశ్రయించుట మాని యనన్య భావముతో కేవలమొక్క నన్నే శరణుపొందుము! నేను స్వయముగా నిన్ను సమస్త పాపముల నుండియు విముక్తిని జేసివైచెదను. నీవు చింతింపవలదు.'

భగవానుని వలన ఈ విధమైన ప్రతిజ్ఞాయుక్తమైన యాశ్వాసనము (ఊఱట) పొందియుండీ కూడ మనము సర్వదా సర్వభావముతో నిశ్చింతులమై యా భగవానుని భజింపకున్న మనవంటి యభాగ్యుడు వేరొకడు ఎవడు ఉండును?

కాబట్టి యీ విషయమందే పరమశ్రేమ మున్నదని గుర్తెరిగి లేచుచున్నను, కూర్చుండుచున్నను, నిదురించుచున్నను, మేల్కొనుచున్నను సర్వసమయములందును, సర్వకార్యములందును మనము భగవానుని పవిత్రమైన యస్తిత్వమును దర్శించుచు, హానిలాభమును, జననమరణములు మున్నగువాని చింతలను వీడి నిశ్చింతముగా అనన్య చిత్తముతో శ్రీహరినే భజించుచు, కీర్తించుచు నుండవలెను.

* * * * *

## ప్రేమభక్తి యొక్క ఫలము - భక్తియొక్క సర్వశ్రేష్ఠత్వము

''స కీర్త్యమానః శీఘ్రమేవావిర్భవతి అనుభావయతి చ భక్తాన్.'' (80)

ఆ భగవానుడు (ప్రేమపూర్వకముగా) కీర్తింపబడిన శీఘ్రముగా నావిర్భవించును. భక్తులకు తన యనుభవమును గలిగించును.

దీనికి ముందు చెప్పిన సూత్రమును అనుసరించి, యనన్య భజనము సాగించుట వలన భగవానుడు శీఘ్రముగా సాక్షాత్కరించి భక్తునకు తన స్వరూపమును అనుభూతము గావించును అని చెప్పుటయైనది. ఇక్కడ 'ఆవిర్భవతి' యను శబ్దమును బట్టి భగవానుడు సమస్త దివ్య సౌందర్య మాధుర్యరససారభూతమైన సాకార రూపమందు ప్రకటమగును అన్న యర్థమును గ్రహింపవలెను. వస్తుతత్త్వమును విచారణ చేయగా సగుణ నిర్గుణములందు, సాకార నిరాకారములందును భేద మేదియును లేదు. అతడే మనస్సునకు, బుద్ధికిని గోచరము గాకుండునట్టి పరబ్రహ్మము. అతడే సృష్టికర్త. అతడే సగుణ నిరాకారవిభుడు. అతడే జగదాత్మ. అతడే శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, అతడే శివుడు, మహావిష్ణువు. అతడే మహాదేవి. అతడే జగన్మాత. అతడే విరాట్పురుషుడు. అతనికంటె భిన్నమైనది ఏదియును లేదు. రసికుడు, పట్టుదల గలవాడునగు భక్తుని ప్రేమచేత నాకర్షింపబడి యా భగవానుడు దివ్యమైన తన హ్లాదినీశక్తిని నిమిత్తము గావించుకొని దివ్యములు, చిన్మయములు నగు వస్త్రములు, మాల్యములు, గంధములు, ఆయుధములు, ఆభరణములు మున్నగువానితో సమలంకృతుడై సౌందర్య నిధి రూపమున ప్రకటమై భక్తుని కృతార్థుని గావించును. -

ఆ. అగుణ సగుణమూర్తులందు లేదే భేద
మనుఁ బురాణనిగమ ముని బుధాళి.
యే దరూప మగుణ మేదలక్ష్యం బజం
బదియు సగుణ మగుఁ బ్రియత్వవశత (తులసీదాసు)

కాని యీ రూపము జగత్తును ప్రభవింపచేయునట్టి మాయచేతనే నిర్మితమగునట్టిది అని తలపరాదు. ఇందు అన్ని వస్తువులను దివ్యములు, శుద్ధములు, నిత్యములు, చిన్మయములు, భగవత్స్వరూపములు. ఈ కారణముననే యీ రసమయమైన దివ్యస్వరూపము సమక్షమునకు వచ్చినంతనే యాత్మజ్ఞానులైన మునుల మృతప్రాయములైన మానసములు కూడ సజీవములై యీ స్వరూపమునకు జెందిన ప్రతివస్తువు నెడల ముగ్ధములు అయిపోవును. శబ్దస్పర్శరూపరసగంధములు ఇంద్రియముల వికారరూపము లగునవి, వానినుండి చిత్తము ఒక్క మోక్షదశయందు మాత్రమే విరత మగుచుండును. భగవానునకు జెందిన యా రూపరసగంధ శబ్ద స్పర్శాది విషయముల చేతనే సర్వవిషయ విరక్తులైన మునులు, ఆత్మజ్ఞానులును ఆకృష్టు లగుచున్నారన్న అవి సాధారణ శబ్దస్పర్శ రూపరసగంధాదులవలె మాయావిరచితములైనవి కాని, త్రిగుణముల వలన నావిర్భవించినట్టివి కాని కావనుట నిశ్చయము. ఇవి యన్నియు సర్వగుణ సంపన్నుడు, సర్వదా నిర్గుణుడు నగు నా భగవానుని స్వరూపములే యగను. కావుననే వీని యెడల మునిజనులు ఆకర్షితులు అగుట సంభవ మగుచుండును. ఈ కారణముననే వేదాంతమునకు సంబంధించిన ప్రధానాచార్యులు, శ్రీశంకరాచార్యులవారు శ్రీకృష్ణభగవానుని విషయమున ఇట్లు చెప్పియున్నారు. -

బ్రహ్మాండాని బహూని పంకజభవాన్ ప్రత్యండ మత్యద్భుతాన్
గోపాన్ వత్సయుతా నదర్శయ దజం విష్ణూనశేషాంశ్చ యః
శంభుర్యచ్చరణోదకం స్వశిరసా ధత్తే స మూర్తిత్రయాత్
కృష్ణోవై పృథగస్తి కో౽ ప్యవికృతః సచ్చిన్మయో నీలిమా.

(ప్రబోధసుధాకర) (242)

'ఎవడు బ్రహ్మకు అనేకములైన బ్రహ్మాండములను, ఒక్కొక్క బ్రహ్మాండమందు ఒక్కొక్క బ్రహ్మను, లేగలతోడ గోవకులను, వేరువేరు బ్రహ్మాండవములందు వేరువేరు విష్ణువులను ప్రదర్శించెనో, ఎవని చరణోదకమును స్వయముగా శంకరుడు తన శిరముపై ధరించునో అట్టి యా శ్రీకృష్ణపరమాత్మ యన్న ఆ త్రిమూర్తులకంటెను అనగా విభిన్న బ్రహ్మాండవములందు విభిన్న రూపవములతో శాసనము సాగించు నంశావతారభూతులైన బ్రహ్మవిష్ణుమహేశ్వరుల కంటెను భిన్నముగా నున్న యేదియెా యొక వికారరహితవము, సచ్చిదానందమయవమునైన నీలతేజఃపుంజము.'

ఒక పర్యాయవము దివ్యమైన వైకుంఠవమందు విరాజిల్లుచున్న విష్ణుభగవానుని చెంతకు నిత్యము నాత్మనిష్ఠులై యందు సనకాదిమునులు వచ్చిరి. వారు స్వామిని సమీపించి యతని సుందరరూపవమును జూచి ముగ్ధులైరి. ఆ మనోహరమూర్తిని ఎంత చూచినను వారి కన్నులకు తనువు గలుగకుండెను. భగవానుని సౌందర్యాతిశయము చేతనే వారు మోహితులైరి అని యనజాలము. వారు స్వామికి ప్రణమిల్లుచున్న వేళ ఆ కమలనయనుడు శ్రీహరి చరణపద్మపరాగ సమ్మిళితమైన తులసీమంజరి యొక్క సుగంధము నాసికా మార్గమున పోయి వారి యంతరమందు ప్రవేశించెను. తోడనే నిత్యము అవిచలితముగా బ్రహ్మానందానుభూతిని పొందువారైన యా మహర్షుల హృదయములు సంక్షుభితములయ్యెను. బలిమి మీర వారి చిత్తములు ఆ సుగంధము దిక్కునకు ఆకృష్టములై యా స్వామి యెడల మోహపరవశము లయ్యెను. ఆనందాతిరేకవశమున వారి దేహములందు రోమాంచ ముదయించెను. -

తస్యారవిందనయనస్య పదారవింద
కింజల్క మిశ్ర తులసీమకరందవాయుః
అంతర్గతః స్వవివరేణ చకార తేషాం
సంక్షోభ మక్షరజుషామపి చిత్తతన్వోః.(శ్రీమద్భాగవత. 3/15/43)

ఇట్టి దశయే భగవానులైన శ్రీరామలక్ష్మణుల సుందరరూపములను జూడగా బ్రహ్మవిద్వరేణ్యుడు, విదేహుడు నగు జనకమహారాజునకు ప్రాప్తించెను. -

తే. సిరులు గురియుచు నతిమనోహరము లగుచుఁ
గెరలు శ్రీరామలక్ష్మణాకృతులఁ గాంచి
పుణ్యదేహి విదేహుఁ డపూర్వభంగి
దివ్య మానంద మొసఁగ విదేహుఁ డయ్యె

తే. నైజ హృదయంబు ప్రేమమగ్నంబు గాగ
ధృతిని గొని వివేకము నూని నృపతి యిటులు
పలికెఁ దల వంచి మునిపాదపద్మసీమ,
గళము గంభీర మగుచు గద్గదికఁ గనఁగ (తులసీదాసు)

ఆ సౌందర్యరాశి సమక్షమునకు వచ్చినంతనే విదేహవిభుని జ్ఞానమే మూర్ఛిల్లినటులయ్యెను. అతనికి దేహజ్ఞానము లోపించిపోయెను. కన్నుల నశ్రుధారలు ఉరలెను. నాలో నీ యపూర్వపరిణామమేమి? యని యతడు వెరగుఁ జెందెను. ధృతిని, వివేకమును చేకొని యెట్లో యతడు తనను తాను సంబాళించుకొనెను. కాని పృచ్ఛ చేయక యూరకుండలేకపోయెను. విశ్వామిత్రుని చరణములపై ప్రణమిల్లి ప్రశ్నింపనెంచెను. కాని యతని వివేకము హృద్గతమైన ద్రవీభావమును తొలగించలేకపోయెను. పలుకుచు పలుకుచు నుండగా వాక్కు గద్గదము అయిపోయెను. అప్పుడా మహారాజా తన పరిస్థితి నెరిగించుచు మునిరాజును ఏమని ప్రశ్నించెనో చూడుడు!

సీసము - బహుళపాది

సీ. మునినాథ! నుడువుమా! ముందుగా నందాలు
సిందు నీ బాలుర చంద మేమొ?

మునికుల తిలకమా? జనపాలకులపాల
కుల? వీర లిర్వురే నెలవువారు?
అదియుఁ గా దిదియుఁ గాదని వేదములు నిషే
ధించుచుం జని తుదిం దెల్పినట్టి
బ్రహ్మమే యుభయరూపంబులన్ ధరియించి
యాగమించెన యిట్టు లబ్బురముగ
స్వాభావికముగ నా స్వాంతంబు వైరాగ్య
పరిపూర్ణ మయ్యు నీ బాలకులను
జూడఁ జూడఁగఁ జంద్రుఁ జూచు చకోరంబు
చందాన ముగ్ధత నందు చుండె
ఆ కారణమున నిన్నడుగుచుంటిని సత్య
భావంబుతో మునిప్రవర! నాకుఁ
దెలుపుమా! యీ బాలకుల యుదంతము నించు
కంతయు దాఁచకీ యదనఁ గరుణఁ

తే. జెలువు లొలికెడు నీ బాలకులను గనఁగ
నెమ్మనము నాయ దనురాగనిలయ మయ్యె,
బ్రహ్మసుఖమును సైతము పరిహరించె
బలిమి మీరంగ డెంద మిప్పట్టునందు

అనగా విని మహర్షి మహారాజు యొక్క యనుమానమును సమర్థించెను.

ఈవిధముగా ఏ స్వరూపము మరల మరల చూడబడుచుండియు మరి మరి చూడవలెనన్న కోరికను గలిగించుచుండునో అది సాధారణవస్తువు గాదు. ఏదియో విలక్షణవస్తువనియే యనవలయును. పలుమార్లు చూడబడుచుండియు నింకను చూడవలెనన్న కుతూహలము

నాదరించు పదార్థము లోకమందు ఏదియును లేదు. లౌకికముగా మనకు ఏ వస్తువును చూడవలె నన్న కాంక్ష ప్రబలముగా నుండునో అది లభించినప్పుడు ప్రథమ దర్శనవేళ అమితమైన యానందము గలుగుట సహజమే. కాని యనంతరము ఆ దర్శనము సులభతరమగుచున్న కొలదియు నా వస్తువుపై నాకర్షణము తగ్గిపోవ మొదలిడును. కాని భగవానుని సౌందర్యము అట్టిది కాదు. అది యెంతగా చూచినను తృప్తినీయదు. ప్రేమిభక్తునియందలి ప్రేమ క్షణక్షణ పరివర్ధిత మగుచుండుటతో దాల్చు సౌందర్యము, నధికాధికమగుచున్న తద్గతమాధుర్యము ననుభవములోనికి వచ్చును. ఇట్టి భగవత్స్వరూపము మాయామయము గాజాలదు. అది సర్వవిధముల దివ్యమైనది. అది భక్తుని యెదుట అతని ప్రేమాకర్షణము చేత ప్రకటమగును. అది ప్రకటమైన క్షణమునుండియు నతనిని దివ్యభావపరిపూర్ణుని గావించి యతనికి నిజస్వరూపమును అనుభవములోనికి వచ్చునట్లు చేయును. ఆ మాధుర్యము ఎదుట నున్నంతవరకు భక్తుడు ఏదియో యనిర్వచనీయమైన దివ్యరాజ్యమందు ఉన్నట్టి యనుభూతిని పొందును. వాని సర్వము దివ్యత్వమును సంతరించుకొనును. ఆ సమయమందు అతడు భగవానుని మాధుర్యము దక్క అన్యమేదియు చూడగోరడు, వినగోరడు. అతడు తన్మయత్వమును పొందును. అతనికి భగవానుని యథార్థానుభూతి ప్రాప్తించును.

''త్రిసత్యస్య భక్తిరేవ గరీయసీ భక్తిరేవ గరీయసీ.'' **(81)**

(కాయికము, వాచికము, మానసికమునైన) మూడు సత్యములందును (లేదా మూడు కాలములందును సత్యస్వరూపుడైన భగవానునియందు) భక్తిని పాటించుటయే మంచిది. భక్తిని పాటించుటయే మంచిది.

కాయికము, వాచికము, మానసికము నగు సత్య మేదియో అదియే త్రిసత్యము. త్రిసత్యముల చేతను భక్తియే మేలైనదన్న విషయము దేవర్షి నారదునకు అనుభూతమైన విషయము. కావుననే భక్తియే శ్రేష్ఠము, భక్తియే శ్రేష్ఠము అని పర్యాయముగా ఉద్ఘోషించుచున్నాడు. వాస్తవస్థితి కూడ నట్టిదే. ఉపనిషత్తు కూడ ఈ విషయమునే ఉద్ఘోషించుచున్నది. -

''సర్వోపాయాన్ పరిత్యజ్య భక్తిమాశ్రయ. భక్తినిష్ఠో భవ. భక్తినిష్ఠో భవ. భక్త్యా సర్వసిద్ధయః సిద్ధ్యంతి. భక్త్యాఽసాధ్యం నకించిదస్తి.'' (త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్)

''ఎల్ల ఉపాయములను వీడి భక్తినే యాశ్రయించుము. భక్తి నిష్ఠుడవు కమ్ము! భక్తినిష్ఠుడవు కమ్ము! భక్తివలన సర్వసిద్ధులును గలుగును. భక్తి చేత సాధ్యము కానిది ఏదియును లేదు.' ముక్తియు లభించును. భక్తునకు ముక్తిదాతయైన సగుణరూపభగవానుని తోడ క్రీడించునట్టి సౌభాగ్యమును ప్రాప్తించును. స్వయముగా భగవానుడే చెప్పియున్నాడు. ఏమని యనగా -

**యథాగ్నిః సుసమృద్ధార్చిః కరోత్యేధాంసి భస్మసాత్**
**తథా మద్విషయా భక్తిరుద్ధవైనాంసి కృత్స్నశః. (శ్రీమద్భాగ. 11/14/19)**

'ఓయి ఉద్ధవా! ప్రబలముగా మండుచున్న యగ్ని కట్టెల రాశులను భస్మము జేసివేయును. అట్లే నా యెడల పాటింపబడు భక్తి (చిన్న పెద్ద) సమస్త పాపసమూహములను దగ్ధము జేసివేయును.'

భక్తుని సాధనను భగవానుడు రక్షించును. తత్ఫలితముగా తానే తన ప్రాప్తిని కూడ అతనికి కలుగజేయును. ఈ భక్తి సాధనయందు ఎల్లరకును అధికార మున్నది. కాబట్టి భక్తికంటె శ్రేష్ఠమైనది వేరేదియును లేదు అని చెప్పుట సంభవమైనది. ఈ కారణముననే భగవానుడు భగవద్గీతలో కూడ భక్తిని ప్రశంసించియున్నాడు. పంద్రెండవ

యధ్యాయములో భక్తుని 'యుక్తతముడు' అని కూడ చెప్పియున్నాడు. ఈ కారణముననే యిక్కడ నారదుడు - కాయికము, వాచికము, మానసికము నను నీ మూడు సత్యములందును, లేక త్రికాలములందును సత్యస్వరూపుడైన భగవానుని యెడల భక్తిని పాటించుటయే సర్వశ్రేష్ఠము. భక్తిని పాటించుటయే సర్వశ్రేష్ఠము, అని నొక్కి వక్కాణించుచున్నాడు.

''గుణమాహాత్మ్యాసక్తి రూపాసక్తి పూజాసక్తి స్మరణాసక్తి దాస్యాసక్తి సఖ్యాసక్తి కాంతాసక్తి వాత్సల్యాసక్త్యాత్మనివేదనాసక్తి తన్మయతాసక్తి పరమవిరహాసక్తిరూపా ఏకధాప్యేకాదశధా భవతి.'' **(82)**

ఈ ప్రేమభక్తి ఏకరూపమే యైనదైనను గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, కాంతాసక్తి, వాత్సల్యాసక్తి, ఆత్మనివేదనాసక్తి, తన్మయతాసక్తి, పరమవిరహాసక్తియు నని పదునొకండు విధములుగా నుండును.

ఈ ప్రేమరూపభక్తియందు పరిపూర్ణతాస్థితి నందికొన్న మహాత్ముల యందు పైని చెప్పబడిన సర్వవిధములైన యాసక్తులు నుండును. వ్రజగోపికలయందు ఈ యాసక్తులన్నియు నుండెను. వీరిని నారదుడు ముందే ఉదాహరించియున్నాడు. ఈ యెల్ల విధముల యాసక్తుల వికాసమును సాధించకొనలేని యప్పుడు సాధకులు ఎవరి యిచ్ఛానుసారము వారు ఆ యాసక్తులలో ఒకదానినిగాని, ఒకటికంటె నధికముగా నెన్నిటికైనను గాని యనుసరించి భగవానుని ప్రేమింపవచ్చును. ప్రేమ యన్నది ఏవిధమైనది యైనను ఒకటియే. కాబట్టి యీ ప్రేమభక్తిమార్గమును అనుసరించిన భక్తులలో ఆసక్తిభేదమును బట్టి హెచ్చుతగ్గులను భావన చేయరాదు.

ఈ వేరువేరు ఆసక్తులతో భగవానుని భజించిన భక్తులు అనేకులు ఉండిరి. ఉదాహరణార్థము ఇక్కడ కొందరను పేర్కొనుచున్నాము -

1. గుణమాహాత్మ్యాసక్తభక్తులు. - దేవర్షి నారదుడు, మహర్షి వేదవ్యాసుడు, శుకయోగి, యాజ్ఞవల్క్యుడు, కాకభుశుండి, శేషుడు, సూతుడు, శౌనకుడు, శాండిల్యుడు, భీష్ముడు, అర్జునుడు, పరీక్షిత్తు, పృథుచక్రవర్తి, జనమేజయుడు మున్నగువారు.

2. రూపాసక్తభక్తులు - మిథిలానగరవాసులైన స్త్రీలు, పురుషులు, జనకమహారాజు, దండకారణ్యగతులైన మహర్షులు, వ్రజవనితలు మొదలగువారు.

3. పూజాసక్తభక్తులు - లక్ష్మీదేవి, పృథుచక్రవర్తి, అంబరీషుడు, భరతుడు మున్నగువారు.

4. స్మరణాసక్తభక్తులు - ప్రహ్లాదుడు, ధ్రువుడు, సనకాదులు.

5. దాస్యాసక్తభక్తులు - హనుమంతుడు, అక్రూరుడు, విదురుడు మొదలగువారు.

6. సఖ్యాసక్తభక్తులు - అర్జునుడు, ఉద్ధవుడు, సంజయుడు, శ్రీదాముడు, సుదాముడు (కుచేలుడు) మొదలగువారు.

7. కాంతాసక్తభక్తులు - రుక్మిణీ మున్నగు ఎనమండుగురు శ్రీకృష్ణుని పట్టమహిషులు మున్నగువారు.

8. వాత్సల్యాసక్తభక్తులు - అదితికశ్యపులు, పృశ్నిసుతపులు, శతరూపామనువులు, కౌసల్యాదశరథులు, యశోదానందులు, దేవకీ వసుదేవులు మొదలగువారు.

9. ఆత్మనివేదనాసక్తభక్తులు - హనుమంతుడు, అంబరీషుడు, బలిచక్రవర్తి, విభీషణుడు, శిబిచక్రవర్తి మొదలగువారు.

10. తన్మయతాసక్తభక్తులు - యాజ్ఞవల్క్యుడు, శుకయోగి, సనకాది జ్ఞానయోగులు, కౌండిన్యుడు, సుతీక్ష్ణుడు మున్నగు ప్రేమభక్తిపూరితులైన మునిజనులు.

11. పరమవిరహాసక్త భక్తులు - ఉద్ధవుడు, అర్జునుడు, వ్రజభూమియందలి స్త్రీ పురుషులు మున్నగువారు.

గోపికలయందు మాత్రము ఈ పదునొకండు విధముల ప్రేమయు వికాసము చెందినది. కాని పైని పేర్కొనబడిన భక్తులలో ఒక్కొక్క విధమైన భక్తిప్రకారమే వికాసము చెందినదని మాత్రము తలపరాదు. వారియందు ఏ భావమునకు ప్రాధాన్యమున్నదో ఆ భావమునకు ముందే యిచ్చుట వారి పేరు నుదాహరించుటయైనది.

''ఇత్యేవం వదంతి జనజల్పనిర్భయా ఏకమతాః కుమారవ్యాస శుకశాండిల్య గర్గవిష్ణుకౌండిన్య శేషోద్ధవారుణి బలిహనుమద్విభీషణాదయో భక్త్యాచార్యాః.'' **(83)**

కుమారులు అనగా సనత్కుమారాదులు, వేదవ్యాసుడు, శుక యోగి, శాండిల్యుడు, గర్గుడు, విష్ణువు, కౌండిన్యుడు, ఆదిశేషుడు, ఉద్ధవుడు, ఆరుణి, బలిచక్రవర్తి, హనుమంతుడు, విభీషణుడు మున్నగు భక్తితత్త్వప్రబోధకులైన యాచార్యులు లోకుల వలన గలుగు నిందాస్తుతులు నించుకంతయు పరిగణింపక యేకాభిప్రాయముగా ఇట్లే (అనగా భక్తియే శ్రేష్ఠమని) చెప్పుచున్నారు.

దేవర్షి నారదుడు భక్తితత్త్వ ప్రబోధకులైన ప్రధాన ప్రధానాచార్యుల సమ్మతిని దెలిపి తన కథనమును బలపరచికొనుచున్నాడు. ఈ మహాపురుషులందరు భక్తితత్త్వ పరిజ్ఞాతలు, ఆచార్యులు. సనత్కుమారుడు నిత్యము 'శ్రీహరిః శరణం మమ' అను మంత్రమును జపించువాడు.

భక్తితత్త్వ ప్రబోధకుడైనవాడు. వేదవ్యాస భగవానుడు అష్టాదశపురాణము లందును భక్తియే ప్రముఖమైనదని తెలిపియుండెను. అతడు రచించిన శ్రీమద్భాగవతము భక్తిరసపు గని. శుకయోగి యొక్క భక్తిని గూర్చి యేమని చెప్పగలము? భక్తిరస ప్రధానమైన శ్రీమద్భాగవత మంతయు అతని ముఖారవిందము నుండియే వినిర్గతమైన యమృత సముద్రము, శాండిల్య మహర్షి రచించిన భక్తిసూత్రములే యతడు భక్తితత్త్వమునకు సంబంధించిన ప్రధానాచార్యు డనుటకు ప్రమాణ భూతములు. మహర్షి గర్గుడు తన గర్గసంహితలో భక్తిరసమును ప్రవాహముగా పారించెను. విష్ణుమహర్షి యొక ప్రధాన స్మృతికర్త. మరియొక విష్ణుస్వామి భక్తితత్త్వమునకు సంబంధించిన ప్రధానాచార్యుడయ్యెను. కౌండిన్యమహర్షి తన్మయతాసక్తియందు సిద్ధిని గన్న మహాపురుషుడని చెప్పుదురు. భగవానుడగు ఆదిశేషుడు రేబవళ్ళు తన వేయి ముఖములతోను హరిగుణగానమే చేయుచుండును. ఇతడు దాస్యభక్తికి పరమాచార్యుడు. దాసరూపుడైన లక్ష్మణుని రూపములో ఇతడే యవతారధారణము చేసినవాడు. ఉద్ధవుడు శ్రీకృష్ణభగవానుని ప్రధానసఖుడు. ఆరుణి నింబార్కునకు నామాంతరమగువాడు. ఇతడు యుగళస్వరూపమును (ప్రకృతి పురుషులను) ఉపాసించినవాడు. బలిచక్రవర్తి సర్వాత్మ నివేదనాసక్తిరూపమైన భక్తికి మూర్తరూపమగువాడు. ఇతని భక్తిబలము చేత భగవానుడు స్వయముగా నితనికడ ద్వారపాలకుడుగా నుండుటకు అంగీకరించెను. ప్రాతఃస్మరణీయుడు, భక్తశ్రేష్ఠుడునగు హనుమంతుడు దాస్యభక్తికి పరమోదాహరణ మగువాడు. మహాభాగుడగు విభీషణుడు భక్తిప్రభావముచేత శ్రీరామచంద్ర భగవానునితోడ సఖ్యమును పొంద గలిగెను. భక్తి శాస్త్రమునకు సంబంధించిన యీ యాచార్యవర్యులందరు లోకము వలన గలుగు నిందాస్తుతులను పరిగణింపక భక్తిమహత్త్వము నుగ్గడించిరి. తమ జీవనముల మూలమున భక్తియొక్క సర్వశ్రేష్ఠత్వమును ప్రతిపాదించిరి. వీరి మతమును అనుసరించియే దేవర్షి నారదుడు కూడ భక్తియే సర్వోత్కృష్టమైనదని ఢంకా మ్రోగించి చాటుట సంభవమైనది.

''య ఇదం నారదప్రోక్తం శివానుశాసనం విశ్వసితి శ్రద్ధత్తే స ప్రేష్ఠం లభతే స ప్రేష్ఠం లభత ఇతి.'' **(84)**

ఎవడు నారదప్రోక్తమైన శివానుశాసనమందు విశ్వాసమును, శ్రద్ధను వహించునో అతడు ప్రియతముని పొందును. అతడు ప్రియతముని పొందును.

ఇంతవరకు భక్తిశాస్త్రమును వివరించి సూత్రకారుడు ఇప్పుడు దాని ఫలమును తెలుపుచున్నాడు. నేను చెప్పిన యీ పరమకల్యాణమయమైన యుపదేశము నెడల లేక భక్తితత్త్వమునకు ఆద్యాచార్యుడైన సాక్షాత్తు శంకరభగవానుడు చేసిన యుపదేశము నెడల శ్రద్ధావిశ్వాసములను వహించువారు భగవానుని దమ ప్రియతమునిగా బడయుగలరు. శ్రద్ధావిశ్వాసములే యీ విషయమున ప్రధానములు. అవి లేనివాడు ఏదియును గాదు. సంశయాత్మునకు పతనమే ప్రాప్తించును. 'సంశయాత్మా వినశ్యతి' (గీత - 4/40) శ్రద్ధావిశ్వాసములు ఉన్ననాడే భగవత్సాధన సంభవమగును. కావున శ్రద్ధావిశ్వాసములతో భక్తిసాధన చేయవలెను. ఇతరేతర సాధనల వలన భగవానుడు ఇతేరతరరూపములలో ప్రాప్తించును. కాని భక్తి వలన మాత్రము అతడు ప్రియతముడుగా ప్రాప్తించును. ఈ ప్రేమయే కడపటిది లేక అయిదవది యగు పురుషార్థము. ఇందు మోక్షము కూడ పరిత్యజింపబడును. ఇదియే జీవితమునకు పరమఫలము.

భక్తికి జయము! భక్తునకు జయము! భక్తపాలకుడగు భగవానునకు జయము!

శ్రీకృష్ణార్పణమస్తు